శ్రీ ర స్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

# కవిహృదయసర్వస్వము.

పరిమళరంగనాథక్షేత్ర వాసులగు

ఉపన్యాసప్రసిద్ధులైన

శ్రీమత్తిరుమలై కిందూ్యరు-

## రామానుజాచార్యులవారిచే

అనేకగ్రంథములయందుండు శ్లోకములనుచేర్చి

ఆంధ్రతాత్పర్యసహితముగ వ్రాయబడి.

మ-రా-రా-శ్రీ. పచ్చిశెట్టి రంగయ్యశెట్టివారి కుమారుల

సహాయముచే

మ-రా-రా-శ్రీ. ముక్కాల, కిష్ణుశెట్టివారి సహాయముచే

అచ్చువేయించబడినది.

*Printed at the*

*Sri Rajarajasvari Niketanam Press.*

*No 28 Kollavariagraharam.*

*Old Washermanpet*

**MADRAS.**

**1901.**



దీని వెల రూ. ౧.

ఛత్రా లంకారేణె దమద్భుతం గ్రథితం।
రామానుజార్య నామ్నా జయతితరాం సుకవిహృద
య సర్వస్వమ్॥

శ్లో॥ తత్రతత్రస్థితై ర్హృద్యైః తత్తద్వర్ణన తత్పరైః।
నిరవద్యైర్యుతః పద్యైః గ్రన్థోయం తనుతేముదమ్॥

శ్లో॥ రామానుజార్య విదుషా రచితా మాంధ్రభాషయా।
టీకామేతస్య సంవీక్ష్యమోదతేమమ మానసమ్॥

విచిత్రశతావధాని విద్వన్మణి మహాభాగవత
ఘనపాఠి లక్ష్మణాచార్యః। మతత్రయ
భగవద్గీతోపన్యాస విద్వాన్॥

---

ప్రకటన.

| | | |
|---|---|---|
| శ్రీరామవైభవగీతమ్. | రూ. | ౦—౨— |
| యక్షప్రశ్నలు తాత్పర్యసహితము. | | ౦—౩— |
| కవిహృదయసర్వస్వమ్ తాత్పర్యసహితము. | | ౧—౦— |

ఈగ్రంథములు వలయువారలు యీదిగువ కనుపర
యుండువారలపేర వ్రాసి వాల్యూపేబిలుద్వారా తెప్పిం
కొనవచ్చును.

పి, రంగయ్యశెట్టి అండుసన్సు.
యస్ప్లనేడ్ మద్రాసు.

యం, వి, కన్నయ్యశెట్టి.
యస్ప్లనేడ్‌హాల్ మద్రాసు.



# విషయసూచిక.



విషయసూచిక సమాప్తము.

# శుద్ధాశుద్ధ పత్రిక.

| శ్లో॥ నెం. | అశు. | శుద్ధ. |
|---|---|---|
| ౧ | పేపిద | పెపియే |
| ౫ | జ్యాత్స్నా౨ం | జ్యోత్స్నా౨ |
| ౧౩ | నస్నెహ | నస్నె౨హ |
| ౨౦ | షినిను | షునను |
| ౨౬ | దవాతి | దహాతి |
| ౨౯ | విగ్రహం | విగ్రహః |
| ౪౪ | కత్యా | కృత్యా |
| ౪౮ | పితాపి | పితా |
| ౫౩ | శ్రోత్ర | శ్రోత్ర |
| ౫౫ | దృయో | ద్వయో |
| ౫౬ | దన | ధన |
| ౫౭ | ద్రో॥గ్రో | ద్రో॥గ్రో |
| ౬౦ | సస్వభావ | సుస్వభావ |
| ౬౧ | నడ | నుడు |
| ౬౮ | భాషశె | భాషతే |
| ౭౦ | స్థూల | స్తూల |
| ౭౧ | ణాశ | ణాశా |
| ౮౦ | లవ | జల |
| ౮౨ | చారః | చోరః |
| ౯౦ | స్వామిలి | స్వామిని |
| ౯౪ | తష్ణా | తృష్ణా |
| ౯౯ | నాయూ | నాయు |
| ౧౧౦ | వశో | వశః |
| ౧౧౦ | పది | పవిః |
| ౧౧౩ | రక్షతి | రక్షిః |
| ౧౧౬ | శబి | శిబి |
| ౧౧౭ | భుజైర్వ | భుజైః |
| ౧౨౪ | క్రాపి | క్రోపి |

| శ్లో॥ నెం. | అశు. | శుద్ధ. |
|---|---|---|
| ౧౩౨ | విలంబితం | వలంబితం |
| ౧౩౨ | యాశ | యాశను |
| ౧౪౪ | లక్ష్మ్యం | లక్ష్మం |
| ౧౬౦ | తెగినము | తెగినను |
| ౧౯౧ | మూఢై | మూఢ |
| ౨౨౪ | రుభాజం | రుపాజం |
| ౨౬౪ | శ్రంభం | స్రంభం |
| ౨౯౦ | ధ్రమి | తఱ్రిమి |
| ౨౮౩ | వస | వన |
| ౨౯౪ | వృషిణ | వృషేణ |
| ౩౨౦ | సఫే | సఖే |
| ౩౨౯ | మితీకిం | మితికిం |
| ౩౩౫ | రకికనా | రకనా |
| ౩౩౭ | రష్తా | రపా |
| ౩౪౮ | ష్మితః | ష్మతః |
| ౩౬౪ | తచ | తిచ |
| ౪౧౪ | పంకలా | పంకిలా |
| ౪౨౨ | దీశ్చ | ధీశ్చ |
| ౪౪౮ | కద్వ | కవద్వ |
| ౫౧౦ | ద్విజ | ద్విజ |
| ౫౧౧ | ద్విజ | ద్విజ |
| ౫౧౩ | బుద్దే | బుద్ధే |
| ౫౧౮ | నల | నర |
| ౫౨౬ | లస్థ్య | లస్త్యః |
| ౫౪౨ | తిపతౌ | శిపత్యౌ |
| పు.౧౧౯ | గణకప్ర- | అసత్యవాదినిం |
| ౯౮ | కలితా | కవితా |

—*—



శ్రీ

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

# కవిహృదయసర్వస్వం.

## సుజన ప్రకరణం.



శ్లో॥ యస్సమః పరకార్యాణి సాధ్నోతి సతతంసుహృత్।
తస్మైసర్వ జనాహ్లాద సింధవే సాధవేనమః॥

అవతారిక॥ సజ్జనులు భగవత్సంరక్షణకు ముఖ్యపాత్రులు గనుకను, న్ని సాధుసాంగత్యము సర్వశ్రేయస్కర మగుటవలనను నీగ్రంథారంభమున సత్పురుష మాహాత్మ్యమును అనేక గ్రంథముల యందున్న దానిని వ్రాయబడుచున్నది.

శ్లో॥ మేదీనేష దయాళవఃస్పృశతి యానల్పోపి నశ్రీమదః
వ్యగ్రాయేచ పరోపకారకరణే హృష్యన్తియే యాచితాః।
స్వస్థాస్సన్తిచ యౌవనోన్మదమహా వ్యాధిప్రకోపేపిచ
తైస్తంభైరి వసుస్థిరైః కిలభరక్లాన్తా ధరాధార్యతే॥ ౧

తా॥ దీనులయందెవరు దయగలవారో సంపత్సంబంధించిన మదమింతు కంతయు నెవరిని తాకదో యితరుల కొరకు నుపకరించుట యందెవరు ముందు నిలచుచున్నారో యితరులచే యాచించబడిన వారై కోపించుకొనక యెవరు సంతోషించుచున్నారో యావనమనే

ముదిరిన గొప్ప రోగార్భాటమందెవరుకంపించక ధైర్యముతో నుంటు న్నారో యటువంటి సాధువులచేత కదలని స్తంభములచేతవలె మోసుటచే డస్సిన భూమిధరింపబడుచున్నది.

శ్లో॥ వికృతిం నైవగచ్ఛన్తి సంగదోషేణ సాధవః।
ఆవేష్టితం మహాసర్పైశ్చందనం నవిషాయతే॥ ౨

తా॥ సజ్జనులు సహవాస దోషము చేత వికారమును పొందనే పొందరు. విషముతోకూడిన గొప్ప సర్పములతో చుట్టబడిన చందనవృక్షము విషము కాచాలదు. స్వగుణము మారక జనులకు నుపయోగ మవునని భావము.

శ్లో॥ సుజనో నయాతి వైరం పరహితకార్యే వినాశకాలేపి।
ఛేదేపి చందన తరు స్సురభయతి ముఖం కుఠారస్య॥ ౩

తా॥ సత్పురుషుడు తాను చెడిపొయ్యే కాలమందు నితరుల యొక్క హితము చేసుటయందు విరోధమును పొందడు తన్ను ఛేదించుట యందును చందన వృక్షము గొడ్డలియొక్క మూతిని యెట్లు పరిమళింప చేయుచున్నదో ఆరీతిన హితమును చేయుచున్నాడని భావము.

శ్లో॥ శరదిన వర్షతిగర్జతి వర్షతివర్షాసుని స్వనోమేఘః।
నీచోవదతిన కురుతేనవదతి సాధుః కరోత్యేవ॥ ౪

తా॥ శరత్కాలమందు మేఘము వర్షించదు శబ్దించును వర్షాకాలమందలి మేఘము శబ్దించకనే వర్షించును. అటులనే యధముడుచెప్పనేకాని చెయ్యనేచెయ్యడు. సత్పురుషుడుచెప్పడు చెయ్యనేచేసును.

శ్లో॥ నిర్గుణేష్వపి సత్త్వేషు దయాం కుర్వన్తి సాధవః।
నహిసం హరతే జ్యోత్స్నాం చంద్రశ్చండాల వేశ్మని॥ ౫

తా॥ సాధువులు నిష్ఫలమైన ప్రాణులయందును దయను కలగచేయుదురు చంద్రుడెటుల తనవెన్నెలను మాలవాని యింటియందు తగ్గించడో యటులని భావము.

శ్లో॥ అపకారిషు యస్సాధు స్ససాధు స్సద్భిరుచ్యతే।

ఉపకారిషు యస్సాధు స్సాధుత్వే తస్యకోగుణః॥ ౬

తా॥ అపకారుల విషయమైయె తనుహితమును చేయుచున్నాడో యతను సత్పురుషులచే సాధువనిచెప్పబడుచున్నాడు. ఉపకారుల విషయమైయె తను హితమును చేయుచున్నాడో అతనియొక్క యుపకారమందేమిఫలము.

శ్లో॥ ఉదయే సవితారక్తో రక్తశ్చాస్తమయేతథా।
సంపత్తౌచ విపత్తౌచ మహతా మేకరూపతా॥ ౭

తా॥ సూర్యుడెటుల ఉదయమునందును అస్తమయకాలమందును మారక యెఱ్ఱనివాడుగానే యుండును ఆప్రకారముననే మహాత్ములకాపత్సంపదలయందు మారక నొకటే విధముండునని భావము.

శ్లో॥ ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమః
జ్ఞానస్యోపశమః కులస్య వినయో విత్తస్య పాత్రేవ్యయః।
అక్రోధ స్తపసః క్షమాబలవతాం ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషామపి సర్వకారణ మిదంశీలం పరం భూషణం॥ ౮

తా॥ సంపదకు మంచితనము పరాక్రమమునకు పదరక నుండడము జ్ఞానమునకు శాంతి కులమునకు అణకువ ద్రవ్యమునకు సత్పాత్రమునందీవి తపస్సుకు కోపము లేకుండుట బలవంతుల కోర్పు ధర్మమునకు నిష్కారణముగా చేయుటయు నలంకారము అందరికిన్ని నన్నిటికిన్ని అన్ని విధములచేత హేతువైన యీమంచి నడవడిక (లేక) మంచి స్వభావమే ముఖ్యమైన యలంకారము.

శ్లో॥ కేనాంచితాని నయనాని మృగాం గనానాం
కోవాకరోతి రుచిరాం గరుహాన్ మయూరాన్।
కశ్చోత్పలేషు దళసంన్నిచయం కరోతి
కోవాకరోతి వినయం కులజేషు పుంసు॥ ౯

తా॥ లేడికన్నులెవనిచే బెదురు చూపులతో గూడిన వైనవి నెమళ్ళను మనోహరమైన పింఛములతో గూడినవాటినిగా నెవడుచేయు

చున్నాడు నీలోత్పలములయందు నెవడురేకుల ముత్తమును కలుగజేసె ను ఆమాదిరిగానే మంచికులమందు బుట్టిన పురుషులయందు వినయము నెవడు జేయుచున్నాడు గనుక స్వాభావికముగా యేర్పడిన వినయమని భావము.

శ్లో॥ ఆరభ్యతే సఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్న విహతా విర మన్తి మధ్యాః।
విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః
ప్రారభ్య చోత్తమ జనాన పరిత్యజంతి॥ ౧౦

తా॥ విఘ్నము కలుగునని భయము వల్ల అధములచేత నేకార్యము నారంభింపబడదు. మధ్యస్థులారంభించి విఘ్నములచే నుపద్రవపడినవారై యూరక యుందురు. వుత్తములైన సాధువులు విఘ్నములచే మరల మరల నుపద్రవ పడినవారైన నా కార్యమును విడిచి పెట్టకము గింతురని తాత్పర్యము.

శ్లో॥ ఘృష్టంఘృష్టం పునరపి పునశ్చందనం చారుగంధం
ఛిన్నంఛిన్నం పునరపి పునస్స్వాదు చైవేక్షుకాండం।
దగ్ధందగ్ధం పునరపి పునః కాంచనం కాంతవర్ణం
నప్రాణాన్తె ప్రకృతి వికృతి ర్జాయతే చోత్తమానాం॥ ౧౧

తా॥ గంధపుచెక్క చెక్కను చెక్కను మంచివాసనతో కూడిన దౌను చెరుకు గణుపులను ఖండించను ఖండించను నిండాతీపుగల దౌను బంగారము పుటము పెట్టను పెట్టను మంచి రంగుగలదౌను నటులనే నుత్తమ జనులకు ప్రాణాపత్కాలముల యందును స్వాభావికగుణమునకు వికారము గలుగ చాలదు.

శ్లో॥ దాతాన దాపయతి దాపయితాన దత్తే
యోదాన దాపనపరో మధురం నవక్తి।
దానంచ దాపన మహో మధురా చవాణీ
త్రీణ్యప్య మూనిఖలు సత్పురుషేవ సన్తి॥ ౧౨

తా॥ ఇచ్చేడివా డితరునిచే నిప్పించడు. యిప్పించెడి వాడు తాను నెవరికిని నివ్వడు యిచ్చుట యందిప్పించుట యందును ప్రియ ముగలవాడు మంచిమాటలు చెప్పడు యిప్పించడము నివ్వడమును ప్రియ ముగా మాటలాడడమున్ను యీమూడుగుణములు సత్పురుషులయందె ప్పుడున్ను వసించుచున్నవి.

శ్లో॥ మాభూన్సజ్జన యోగో యదియోగో మాపున స్నేహః।
స్నేహోయదివిరహో మాయదివిరహో జీవితాశాకాః॥ ౧౩

తా॥ సత్పురుషులతోటి సమాగమము కలుగకూడదు అట్లు కలిగి నను వారితో స్నేహము కలుగకూడదు అట్లు స్నేహముకలిగిన యెడబా టు కలగకూడదు అదికలిగితే బ్రతుకుటయందేమి యాశయుండునుగనుక సజ్జన సాంగత్యమువదలుట శ్రమకరమని భావము.

శ్లో॥ ప్రథమవయసిదత్తం తోయమల్పంపిబంతః శిరసినిహితభా రా నారికేళానరాణాం। వుదకమమృతకల్పం దద్యురా జీవితాంతం నహికృతి ముపకారంసాధవో విస్మరంతి॥ ౧౪

తా॥ నారికేళ వృక్షములు బాల్యవయసునందివ్వబడిన స్వల్పజల మును త్రాగుచున్నవియై తలయందుంచుకొన్న భారములతోడ తాను బ తికియుండె కాలమువరకు నరులకు నమృతముతో సమానమయిన నీటిని యిచ్చునుగనుక చేయబడిన యుపకారమును సత్పురుషులు మరిచేపోరు.

శ్లో॥ హంసః పదాహంతి శ్లాఘ్యస్యాన శ్లాఘ్యం ఖరరోహణం।
స్పర్ధాపి సాధుభిరాయుక్తా నయుక్తా ఖలమిత్రతా॥ ౧౫

తా॥ గజ్జముయొక్క కాలిచే తన్నుబడినడమున్ను గౌరవము యిం తకంటెగాడిద నెక్కడము శ్లాఘ్యముకాదు అటులనే సజ్జనులతో విరో ధమున్ను మంచిదిగాని,దుష్టులతో స్నేహము యోగ్యముకాదు.

శ్లో॥ నారికేళ సమాకారా దృశ్యంతేపిహి సజ్జనాః।
అన్యేబదరికాకారా బహిరేవ మనోహరాః॥ ౧౬

తా॥ సత్పురుషులు నారికేళములతో సమానమైన యాకారము

గలిగినవారుగా కానబడుదురు దుర్జనులు రేగుపండ్లతో సమానమయిన యాకారముగలవారై బైటికి మంచివారుగా కానబడుదురు.

శ్లో॥ అతికుపితా అపిసుజనాయోగేన మృదూభవన్తి నతునీచాః।
హేమ్నః కఠినస్యాపి ద్రవణోపాయోస్తి నతృణానాం॥ ౧౭॥

తా॥ సత్పురుషులధికకోపముగలవారైనను యొకసందర్భముచేత కోపములేనివారై సులభులగుచున్నారు కఠినమయినప్పటికిన్ని బంగారమును కరిగించెడి యుపాయముకలదు అటులగడ్డికి కరగించు నుపాయముకానము అటులనే అధములు కోపించుకొన్నవారై శాంతులుకారు.

శ్లో॥ వజ్రాదపికఠోరాణి మృదూనికుసుమాదపి।
లోకోత్తరాణాం చేతాంసికోహి విజ్ఞాతుమర్హతి॥ ౧౮

తా॥ వజ్రాయుధముకంటెను కఠినములైన పుష్పములకంటె మెత్తనయిన సర్వోత్తములైన సాధువుల యొక్క మనస్సుల నెవరున్ను గుర్తెరుగ జాలరు.

శ్లో॥కింమధునాకింవిధునాకిం సుధయాకించ వసుధయాఖిలయా।
యదిహృదయహారిచరితః పురుషః పునరేతినయనయోరయనం॥ ౧౯

తా॥ మనోహరమైన చరిత్రముతోగూడిన సత్పురుషుడు కంటికెదురైనయెడల మధురమైన తేనెచేత నేమిప్రయోజనము ఆహ్లాదకరుడైన చంద్రునితో నేమి ప్రయోజనము దప్పినాకలిని పోగొట్టెడి యమృతముచేత నేమి ఫలము అఖండమయిన భూమిచేత నేమి ప్రయోజనము గనుక సత్పురుషసమాగమముచే నాపదలువదలి సంపదలుగలిగి సౌఖ్యపడుదురని తాత్పర్యము.

శ్లో॥ కాకైస్సహప్రవృద్ధస్య కోకిలస్య కలాగిరః।
ఖలసంగేపినేష్ఠుర్యం కల్యాణప్రకృతేః కుతః॥ ౨౦

తా॥ కాకులతోగూడా పెరిగిన కోకిలకు కాకిస్వరమురాక తనదైన మంచిమంచి స్వరములే కలుగుచున్నవి ఆరీతిగా దుర్జన సహవాసమందును సత్పురుషునికి చెడ్డతనము గలుగ చాలదని తాత్పర్యము.

—(*) దుర్జనపద్ధతి. (*)—

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతో పిసన్।
మణినా భూషితస్సర్పః కిమసౌ నభయంకరః॥ ౨౧

తా॥ విద్యచే నలంకృతుడయ్యును దుర్జనుడు విడువతగినవాఁడేను సర్పము రత్నముచేత ప్రకాశించుచున్నదైనను భయంకరముగదా.

శ్లో॥ కర్పూరధూళీ రచితాలవాలః కస్తూరికా కుంకుమ లిప్త దేహః। సుమాంభసావా పరిషిచ్యమానః నిజంగుణం ముంచతి కింపలాండుః॥ ౨౨

తా॥ పచ్చకర్పూరముచేత పాదుకట్టి కస్తూరీ కుంకుమ పువ్వును చెట్టుకుపూసి పన్నీరుపోసి పెంచినను నుల్లిచెట్టుపై చెప్పిన వాటియొక్క పరిమళములను పొందకనే తన దుర్గంధగుణమును వదలకయుండునని భావము.

శ్లో॥ తేవై సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థం పరిత్యజ్యయే
సామాన్యాస్తు పరోపకార నిరతాస్స్వార్థా విరోధేనయే।
తేఽమీమానుష రాక్షసాః పరహితం స్వార్థాయనిఘ్నంతియే
యేతుఘ్నంతి నిరర్థకం పరహితం తేకేనజానీమహే॥ ౨౩

తా॥ తమ కార్యమును వదలి నితరుల కార్యమును సాధించెడివారెవరో వారు సత్పురుషులు తమ కార్యమునకు విరోధములేక నితరుల కార్యమందాసక్తిగలవారెవరో వారు సామాన్యులు తమకార్యము కొరకై నితరుల కార్యమును చెరచువారు మనుష్యులనే రాక్షసులు తమకున్ను ప్రయోజనము లేక పరుల కార్యమును చెరచువారే తెరగతివారో మేమెఱుగము.

శ్లో॥ దహ్యమానా స్సుతీక్ష్ణేన నీచాః పరయశోగ్నినా।
అశక్తాస్త త్పదంగంతుం తతోనిందాం ప్రకుర్వతే॥ ౨౪

తా॥ అధములు వాడినైన యితరులయొక్క యశస్సనేనిప్పుచేత గాలబడుచున్నవారై నాకీర్తి స్థానమును తమరు పొందుట కశక్తులై

వెనుక కీర్తినిగురించి నిందించుచున్నారు (ధనికులను) యెందరినో మోసము జేసిన ధనమనిన్ని పండితులను వృపాసనవల్ల వచ్చిన విద్యయనిన్ని నానావిధముగా నిందించుచున్నారు.

శ్లో॥ దుర్జనదూషిత మనసాంపుంసాంసుజనేప్య విశ్వాసః।
బాలః పయసాదగ్ధో దధ్యపి ఫూత్కృత్య భక్షయతి॥ ౨౫

తా॥ దుష్టులచేత యుపద్రవపడినవారికి సత్పురుషులనుజూచినప్పటికిన్ని నమ్మికకలుగదు యెటువలెననగా వేడిపాలుతాగి మూతికాలినబాలుడు పెరుగునుగూడ నూదుకొని నెటుల తినునోనట్లు నమ్మికకలుగదు.

శ్లో॥ రవిరపిన దహతితాదృగ్యా దృగ్దవాతివాలుకానికరః।
అన్యస్మాల్లబ్ధపదోనీచః ప్రాయేణ దుస్సహోభవతి॥ ౨౬

తా॥ సూర్యునివల్ల వేడిమిపొందినయిసుక యెంతవేడిమినితరులకు గలుగజేసునో అంతవేడిమిని సూర్యుడుగూడా గలుగజేయడు యితరులవల్ల నధికారమును పొందిన దుర్జనుడు నెవరిని దగ్గిరచేరనివ్వక యిసుకవలెనేబాధకరుడుగా నుండును.

శ్లో॥ గుణినాంగుణేషు సత్స్వపి పిశునజనో దోషమాత్రమాదత్తే।
పుష్పేఫలేవిరాగీ క్రమేళకః కంటకౌఘమివ॥ ౨౭

తా॥ గుణవంతుని యొక్క గుణములనేకములుండను దుర్జనుడు దోషమాత్రమునే గ్రహించును యెట్లనగా వొంటె అనేక ఫలములు పుష్పములుండను ముండ్లతోకూడిన వాటినే తినుచున్నది.

శ్లో॥ అహో దుర్జన సంసర్గా న్మానహానిః పదేపదే।
పావకో లోహసంగేన ముద్గరై రభిహన్యతే। ౨౮

తా॥ అగ్నిపరిశుద్ధమయినను యినుము మొదలైన లోహములతో చేరినందున సుత్తి మొదలైన యాయుధములచే యెట్లు బాధింపబడునో నటులనే దుర్జనుని సహవాసము చేత జనులకప్పుడప్పుడవమానము కలుగుచుండునుగదా యేమిఆశ్చర్యము.

శ్లో॥ అకరుణత్వ మకారణ విగ్రహంపరధనే పరయోషితిచ స్పృహా।

సుజన బాంధుజనేష్వ సహిష్ణుతా
ప్రకృతి సిద్ధమిదంహి దురాత్మనాం॥ ౨౯

తా॥ దయ లేకుండుట కారణము లేకనే కలహించుట యితరుల ద్రవ్యమందును అన్య స్త్రీలయందును ఆశించుటయును సత్పురుషులయందు నోర్పు లేకుండుటయును యివియన్నియు దుర్జనులకు స్వభావసిద్ధము లైన లక్షణములు.

శ్లో॥ అతిమలినే కర్తవ్యే భవతిఖలా నామతీవ నిపుణాధీః।
తిమిరేపి కౌశికానాం రూపం ప్రతిపద్యతే దృష్టిః॥ ౩౦

తా॥ దుర్జనులకు అధికమయిన పాపకార్యము చేయుటయందే బుద్ధికి చాతుర్యము గలిగి యుండును గుడ్లగూబలకు చీకటియందె దృష్టి రూపము నెటులపొందునో నటులని భావము.

శ్లో॥ స్తోకేనో న్నతిమాయాతి స్తోకేనా యాత్యధోగతిం।
అహోనుసదృశీవృ త్తిస్తులాయష్టేః ఖలస్యచ॥ ౩౧

తా॥ దుర్జనుడు త్రాసుకువలెనే యించుకంత విశేషముచేతనే పొడవగును యించుకంత అవిశేషముచేతనే తగ్గిపోవును గదా.

శ్లో॥ నిష్ణాతోపిచ వేదాంతే సాధుత్వం నైతిదుర్జనః।
చిరమగ్నో జలనిధౌ శైలరాడివ మార్దవం॥ ౩౨

తా॥ పెద్దపర్వతము బహుకాలముగా సముద్రమందు మునిగియున్నను మృదుత్వము నేరీతినపొందదో నాలాగుననే దుర్జనులు నెల్లప్పుడున్ను వేదాంతమందు మునిగియున్నను సత్పురుషుల సామ్యమును పొంద నేరరు.

శ్లో॥ అపివే త్రిపదక్షరాణి చేదుపదేష్టుం యతతేస్వయం హరం।
వసనాశన మాత్రమస్తి చేద్ధనదాదప్యతి రిచ్యతేఖలః॥ ౩౩

తా॥ దుర్జనులు ఆరక్షరములు నేర్చినట్టైతే యీశ్వరునిగురించి యుపదేశించుటకు స్వయంగా ప్రయత్నించుదురు వాడుకట్టనుగుడ్డ తినుట కన్నము మాత్రమున్నట్టయితె కుబేరునిగూడా నతిక్రమించును.

శ్లో॥ అహో॥ ప్రకృతి సాదృశ్యం శ్లేష్మణో దుర్జనస్యచ।
మధురైః కోపమాయాతి కటుకైనైవ శామ్యతి॥ 34

తా॥ ఓహో! దుర్జనునికిన్ని శ్లేష్మవ్యాధికిన్ని స్వభావముగా సామ్యము చెప్పుచునుగదా శ్లేష్మరోగము మధురపదార్థములచే వృద్ధిపొందును కారపదార్థములచే శాంతియగును దుర్జనుడున్ను అటులనే మధురభాషణములచేత మెగిరికోపగించుకొనును కఠినపు మాటచేతనణగును.

శ్లో॥ ఈషల్లబ్ధ ప్రవేశోపి స్నేహవిచ్ఛేద కారకః।
కృతచ్ఛిద్రో భాజనేనక్తి ఖలోమంథన దండనవత్॥ 35

తా॥ మజ్జిగకుండలో యించుకంత ప్రవేశించినను మజ్జిగకు వెన్నకు నున్న అన్యోన్యమునుపోగొట్టి వేరుపరచి కుండలో శబ్దము కలగచేసినదై ఆడుచున్న కవ్వమువలె దుర్జనుడు కొంచెపాటి యించుకంత ప్రవేశముకలుగునో నచటి వారిని అరచేటట్లుచేసి వారి స్నేహమును పోగొట్టియాడును.

శ్లో॥ త్యజతిచగుణాన్ సుదూరంతను మపిదోషం నిరీక్ష్య గృహ్ణాతి।
ముక్తాలంకృతకేశాన్ యూకామివ వానరః పిశునః॥ 36

తా॥ వానరము ముత్యములచేత పుష్పములచేత నలంకరింపబడిన వెంట్రుకలను చూడడం విడిచిపెట్టి పేనులను వెతికినట్లుగా దుర్జనుడు మంచిగుణములను దూరముగనిడి అల్పమైనదోషమును మాత్రమే గ్రహించునని భావము.

## —(*) మూర్ఖవర్ణనం. (*)—

శ్లో॥ శక్యోవారయితుం జలేనహుత భుక్ఛత్త్రేణ సూర్యాతపో।
నాగేంద్రో నిశితాంకుశేన సమదోదండేన గోగార్దభః
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్ర ప్రయోగైర్విషం।
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్యనాస్త్యౌషధం॥ 37

తా॥ నీటిచే అగ్ని, గొడుగుచేత ఎండ, అంకుశముచేత గజము కఱ్ఱచేత మదించిన వృషభము మొదలయినవి, మందులచేత వ్యాధియు,

మన్త్రి ప్రయోగములచేత విషము, ఇట్లు అన్నిటిని అణుచుటకు శాస్త్రమందు యేర్పడిన మందున్నదిగాని మూర్ఖునికేమియు నౌషధములేదు.

శ్లో॥ యస్యనాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రంతస్య కరోతికిం।
లోచనాభ్యాం విహీనస్యదర్పణఃకింకరిష్యతి॥ ౩౮

తా॥ ఎవనికి తనదైనబుద్ధిలేదో వానికి శాస్త్రమేమిచేసును నేత్రములు లేనివానికి అద్దము యేమిజేయ బోవును

శ్లో॥ మూర్ఖోపి మూర్ఖం దృష్ట్వాచ చందనాదతి శీతలః।
యదిపశ్యతి విద్వాంసం మన్యతే పితృఘాతకం॥ ౩౯

తా॥ ఒకమూర్ఖుడు మరివకమూర్ఖుని చూచినట్లైతే చందనముకంటె చల్లనివాడై సంతోషించును విద్వాంసునిచూచినయెడల తనపితృహత్యచేసినవాడని యెంచి నిండా అసృష్టిబడును.

శ్లో॥ అంతస్సార విహీనస్య సహాయః కింకరిష్యతి।
మలయేపి స్థితోవేణుః వేణురేవనచందనః॥ ౪౦

తా॥ అంతరంగమందు బలములేనివానికి సహాయమేమి కలుగును మలయ పర్వతమందున్నను వెదురుచెట్టు చందనపు వృక్షమవునా.

శ్లో॥ ముక్తాఫలైఃకిం మృగపక్షిణాఞ్చ మృష్టాన్నదానం కిము గర్దభానాం। అంధస్యదీపో బధిరస్య గీతం మూర్ఖస్య కిం ధర్మకథా ప్రసంగః॥ ౪౧

తా॥ మృగములకు పక్షులకు ముత్యములచేత నేమి, మంచి అన్నపానాదులు గాడ్దెలకేమి, గ్రుడ్డివానికి దీప మందుకు చెవిటివానికి గానమేల మూర్ఖునికి మంచి కథల ఉపన్యాస మేమిపలము.

శ్లో॥ వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథాజడే
నహిఖలు తయోర్జ్ఞానే శక్తిం కరోత్యప హంతివా।
భవతిచ పునర్భూయాన్ భేదః ఫలం ప్రతి తద్యథా
ప్రభవతి తథాబింబ గ్రాహే మణిర్నమృదాఞ్చయః॥ ౪౨

తా॥ గురువు బుద్ధిశాలినైన శిష్యునకు, జడునకు అటులనే మ..ు

డైన శిష్యునియందును విద్యనువిస్తరించి చెప్పుచున్నాఁడు వారిద్దరియొక్క, జ్ఞానవిషయమందు బలమునుకలుగజేయుచున్నాఁడుతగ్గించుచున్నాఁడనెడ దిలేదు. అయితేఫలమునందు బహుభేదముగల్గుచున్నది అదెట్లనిన ప్రతిబింబము గ్రహించెడి విషయములో అద్దము మొదలయిన మణులు యేర్పడును గాని మట్టిముద్ద యేర్పడదు అటుల సచ్ఛిష్యునికి విద్యచక్కగా నేర్పడును మూఢుని కేర్పడదని భావము.

శ్లో॥ మూర్ఖత్వం సులభం భజస్వకుమతే మూర్ఖస్యచాష్టాగుణాః
నిశ్చింతో బహుభోజకోతి ముఖరో రాత్రిందివం స్వప్నభాక్
కార్యాకార్య విచారణాంధబధిరో మానావమానే సమః।
ప్రాయేణామయవర్జితో దృఢవపుర్మూర్ఖ స్సుఖం జీవతి॥ ౪౩

తా॥ ఓరి దుష్టమతి గలవాఁడా సులభముగా మూర్ఖతనమును పొందుము యేలనసగా మూర్ఖునికి యెనిమిదిగుణములు యెట్లంటే చింతలేనివాఁడుగా అతితిండితినెడువాఁడుగా అప్రియములు పలికెడువాఁడుగా రాత్రిపగలు నిద్రబొయ్యెడువాఁడుగా కార్యాకార్య విచారణయందు గుడ్డివాఁడుగా చెవిటివాఁడుగా మానావమానమందు సమమయినవాఁడుగా యిట్టి యెనిమిదిగుణములతో కూడినవాఁడై సుఖముగా జీవించుచున్నాఁడు అనికవి పరిహాసము చేయుచున్నాఁడని భావము.

శ్లో॥ మూర్ఖచిహ్నాని షడితిగర్వో దుర్వచనం ముఖే।
విరోధీవిషవాదీచ కత్యాకృత్యం నమన్యతే॥ ౪౪

తా॥ గర్వము, ముఖమందు పరుషవాక్కు, విరోధము కల్గియుండుట, విషముగా పలుకుట, చేయతగినదానిని చేయకూడనిదానిని తెలుసుకొనక యుండుట యిట్టి ౬ గుణములు మూర్ఖునియొక్క చిహ్నములని భా.

శ్లో॥ అరణ్యా రుదితంకృతం శవశరీరము ద్వర్తితం
స్థలేబ్జమవరోపితం సుచిర మూషరే వర్షితం।
శ్వపుచ్ఛమవనామితం బధిరకర్ణజాపః కృతో
ధృతోంధముఖదర్పణో యదబుధోజన స్సేవితః॥ ౪౫

తా॥ మూఢజనులను సేవించడము అడవియందేడ్చినట్లున్ను శవశరీరమును పిశికినట్లున్ను జలములేనిచోట పద్మమేర్పరచినట్లున్ను ఊషర క్షేత్రమందు వర్షించినట్లున్ను కుక్కతోకను వంచినట్లున్ను గడ్డివానికి అద్దముపట్టినట్లు చెవిటిచెవున జప్పినట్లు అగునని భావము.

శ్లో॥ నమద్యంమాదకం తాదృక్కాంతానాపిచ కాంచనం।
యథేవమవివేకిత్వం ప్రత్యక్షేణానుభూయతే॥ ౪౬

తా॥ ప్రత్యక్షముగా అనుభవింపబడుచున్న యీమూఢతనము యెంత మదమును కలుగజేయుచున్నదో అంత మదమును కల్లును బంగారము వనితయున్ను కలుగజేయలేవని భావము.

—(*) సముపదేశః. (*)—

శ్లో॥ యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతో
యావచ్చేంద్రియ శక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్.
సందీప్తే భవనేతు కూపఖననే ప్రత్యుద్యమః కీదృశః। ౪౭

తా॥ ఎంతవరలో యీశరీరము రోగము లేకనుండునో ముసలితనము యెంతమట్టుకు దూరముగయుండునో ఇంద్రియపటుత్వమెంతమట్టుకు చెడకయుండునో యెంతవరలో ఆయుస్సు క్షీణించకయుండునో అంతలో విద్వాంసునిచే తనయొక్క శ్రేయమునకయ్యెడు ప్రయత్నము చేయతగినది యిల్లు మండుచుండగా భావిత్రవ్వుటకు యత్నము చేయుట ఏమిలాభము.

శ్లో॥ ధైర్యం యస్య పితాక్షమాచ జననీశాన్తిశ్చిరంగేహినీ
సత్యం సూనురయం దయాచ భగినీభ్రాతా మనస్సంయమః।
శయ్యా భూమితలం దిశోపివసనం జ్ఞానామృతం భోజనం
ఏతేయస్య కుటుంబినో వదసఖే కస్మాద్భయం యోగినః॥ ౪౮

తా॥ ధైర్యము తండ్రి, ఓర్పుతల్లి, ఇంద్రియజయము భార్య, సత్యము కుమారుడు, దయతోడబుట్టినది, మనోజయము తోడబుట్టినవాడు, భూమి

పడకదిండ్లు,వస్త్రము,జ్ఞానమనే అమృతము ఆహారము యేగృహస్థునకివి బంధుజనులుగా నేర్పడినవో ఆయోగికి యెవనివల్ల భయము కలుగును ఓమిత్రుడా చెప్పుమా.

—(*) ధనఘనికపద్ధతి. (*)—

శ్లో॥ నవిద్యయానైవ కులేన గౌరవం
జనానురాగో ధనికేషు సర్వదా।
కపాలినామౌళి ధృతాపి జాహ్నవీ
ప్రయాతి రత్నాకర మేవ సత్వరం॥ ౪౯

తా॥ విద్యవచ్చినను సత్కులమందుబుట్టినను వీటివల్ల నేమిన్ని ప్రయోజనములేదు జనులకనురాగము ధనికులయందెల్లప్పుడునుండును యెట్లనగా గంగానది యీశ్వరుని తలయందు ధరింపబడినదైనను రత్నములకు ప్రభువైన సాగరమును గూర్చే త్వరగాపోవుచున్నది.

శ్లో॥ వయోవృద్ధా స్తపోవృద్ధా జ్ఞానవృద్ధా స్తథాపరే।
తేసర్వే ధనవృద్ధస్య ద్వారేతిష్ఠంతి కంకరాః। ౫౦

తా॥ వయస్సుచేత వృద్ధులు తపస్సుచేత వృద్ధులు జ్ఞానముచేత వృద్ధులున్ను యింకా యిటువంటి పెద్దలందరును ధనవంతుని యొక్క ద్వారమందు పరిచారకులయి యున్నారని ధనమును కవి కొనియాడుచున్నాడు.

శ్లో॥ ధిగస్త్వేతాం విద్యాం ధిగపికవితాం ధిక్సుజనతాం
వయోరూపం ధిగ్ధిగపిచ యశోనిర్ధనవతః।
అసాజీయానేక స్సకలగుణహీనోపి ధనవాన్
బహిర్యస్య ద్వారే తృణలవనిభాస్సంతి గుణినః॥ ౫౧

తా॥ ధనములేనివాని విద్యనుగురించి పాండిత్యమునుగురించి సౌజన్యమునుగురించి వయస్సు రూపము కీర్తి వీట్లనుగురించి యేమిన్ని ప్రయోజనములేదు. ఛీ॥ యెవనియొక్క వాకిలియందు గుణవంతులు గడ్డిపర

కలవలె నలక్ష్యముగా నిలుచుచున్నారో అట్టి ధనవంతుడు గుణహీనుడై నను వీడొకడే జయించును.

శ్లో॥ వరం హాలాహలం పీతం సద్యః ప్రాణహరం విషం।
నద్రష్టవ్యం ధనాఢ్యస్య భ్రూభంగ కుటిలం ముఖం॥ ౫౨

తా॥ అప్పుడే ప్రాణముల నపహరించెడి హాలాహలమనే విషమును పానంచేసినను మంచిదే కాని కనుబొమ్మలు ముడుచుటచే వంకరలైన ధనికునియొక్క ముఖము మాత్రము చూడతగినది కాదని భావము.

శ్లో॥ వాక్చక్షుః శ్రోత్రలయం కురుతే నరస్యకో దోషః।
గరల సహోదర జాతా నమారయతి యచ్చతచ్చిత్రం॥ ౫౩

తా॥ నోటిని మాట్లాడనివ్వక కన్నులచూడనివ్వక చెవులవిననివ్వక చేసెడెది లక్ష్మియే చేయుచున్నదిగాని నరుని కేమి దోషము, అయితే క్షీరాబ్ధి మథనమందు విషముతోకూడా పుట్టిన యాలక్ష్మి మనుజుని చంపించదు అనెడిదియేదో అదిహాశ్చర్యమని తాత్పర్యము.

శ్లో॥ లక్ష్మీవన్తో నజానంతి ప్రాయేణ పరవేదనాం।
శేషేధరా భరక్లాంతే శేతే నారాయణ స్సుఖం॥ ౫౪

తా॥ సంపదగలవారు తరుచుగా నితరుల కష్టమును తెలుసుకొనచాలరు అనంతుమ భూమిని ధరించుటచే బడలిక నొందుచుండగా నారాయణుడా కష్టమునెంచక సుఖముగా నిద్రబోవుచున్నాడు.

శ్లో॥ ప్రాయేణ ధనినామేవ ధనలోభో నిరంతరం।
* *
యచ్చకోటి ద్వయోపేతం లక్షం ప్రార్థయతే ధనుః॥ ౫౫

తా॥ తరుచుగా ధనవంతులకే మెండుగా ధనమందాశగలిగియుండును విల్లు రెండుకోట్లు కలదైనను లక్షను గోరుచున్నది నటులనే ధనవంతుడు రెండుకోట్లు కలవాడైనను యింకొక లక్షను గోరుచున్నాడని తాత్పర్యము.

---

* (కోటియనగా విల్లుకొన. లక్షం విలుకానికి గురి.)

—(*) ధననిందా. (*)—

శ్లో॥ దాయాదాస్స్పృహయన్తి తస్కరగణాః ముష్ణన్తి భూమీభుజః
దూరేణచ్ఛలతో హరంతిహుత భుగ్భస్మీకరోతి క్షణాత్।
అంభః ప్లావయతే క్షితౌ వినిహితం యక్షాహరంతి ధ్రువం
దుర్వృత్తాస్తనయానయంతి నిధనం ధిక్ ధిక్ ధనం తద్బహు॥ ౫౬

తా॥ ధనమధికమైన జ్ఞాతులపహరింప కోరుతున్నారు చోరులు దొంగలించుకొని పోవుచున్నారు అగ్ని క్షణకాలములోనే దహించుచున్నది రాజులు దూరముగ గొనిపోయి నపహరించుచున్నారు నీళ్లు ముంచివేయుచున్నది భూమియందు దాచిపెట్టిన కానరాని యక్షులు కొనిపోవుచున్నారు దుష్టులయిన పుత్రులు నశింపజేయుచున్నారు. ఛీ॥ యెంత నింద్యమయిన పదార్థము.

శ్లో॥ బధిరయతి కర్ణ వివరం
వాచం మూకయతి నయన మంధయతి।
వికృతయతి గాత్ర యష్టిం
సంపద్రోగో యమద్భుతో రాజన్॥ ౫౭

తా॥ ఓరాజా సంపదయనెడి రోగము బహు ఆశ్చర్యకరమయినది యెట్లనగా వినుచున్న చెవులను వినపడనివ్వదు మాట్లాడెడి వాక్కును మాట్లాడనివ్వదు కంటినిచూడనివ్వదు దండమువలెనుండెడి శరీరమునకు వికారము నిచ్చుచున్నది గనుక సంపదవల్ల యివి కలుగుచుండునని భా॥

శ్లో॥ అర్జనీయతి యదర్జనే జనో
వర్జనీయజన తర్జనాదిభిః।
మంక్షునశ్యతి చిరాయ సంచితా
వాంఛితా జగతి కేన సంపదా॥ ౫౮

తా॥ ఏసంపదయొక్క సంపాదనయందు జనులు జాతిభ్రష్టులైన వారియొక్క (ద్వారములయందు) భయపెట్టడములచేత తెల్లబోవుచున్నారో లేక గడ్డి పరకవలె నలక్ష్యమవుచున్నారో బహు కాలముగా

చేర్చినదైనను శీఘ్రముగా చెడిపోవుచున్నయట్టి సంపదభూమిలో నైవ నిచే గోరబడి యేర్పరచబడినదోయని చింతించుచున్నాడు.

శ్లో॥ అనుభవతేద దత విత్తం
మాన్యాన్మానయత సజ్జనాన్భజత।
అతిపరుష పవన విలుళిత
దీపశిఖా చంచలా లక్ష్మీః॥ ౫౯

తా॥ సంపద గొప్పగాలిచేత కదలుచున్న దీపపు కొనవలె చంచలమయినది గనుక మనవద్ద నున్నంతలోన అనుభవించుడు పొరుగువారికి వ్వుడు పెద్దలను పూజించుడు సాధువుల నుపచరించుడు.

శ్లో॥ పండితోపి సుశీలోపి
ధనార్థీ తృణతా మియాత్।
యథాబి సార్థీహంసోపి
మధుపై రపి వంచ్యతే॥ ౬౦

తా॥ పండితుడైనను సస్వభావము గలవాడయినను ధనము నపేక్షించిన యెడల గడ్డి పరకతో సమానుడగును హంసము తామరతూండ్లను అపేక్షించినదై (పద్మమున్న చోట తుమ్మెదలు పోవుననుకొని కూడా పోవుచు పద్మమును గానక) వంచింపబడుచున్నది.

—(*) కృపణనిన్దా. (*)—

శ్లో॥ కృపణేన సమోదాతా
నభూతోన భవిష్యతి।
అస్పృశ న్నేవ విత్తాని
యః పరేభ్యః ప్రయచ్ఛతి॥ ౬౧

తా॥ ఇచ్చేవాడు లోభితో సమానుడయిన వాడు అయివుండడు కాబోడు ఏలననగా ద్రవ్యములను తాకకనే యెవడు తాను పోవుకాలమున పొరుగువారికి యిచ్చుచున్నాడో యట్టి కృపణునితో సమానుడకాడని భావము.

శ్లో॥ కృపణో ధన లాభేన
స్వాం భార్యాం నోపగచ్ఛతి।
అస్యాం యోజాయతే పుత్రః
సమేవిత్తం హరేదితి॥ ౬౨

తా॥ లోభి ధనమందాశచేత తన భార్యను పొంద చాలడు యేలనంటే యీభార్యయందు యేపుత్రుడయితే కలుగునో వాడు దాయభాగముచే తనవిత్తము నపహరించునని నామకరణం మొదలైనవాటిచే శెలవు చేయించునని తనభార్యను పొందడని భావము.

శ్లో॥ దానోపభోగ హీనేన
ధనేన ధనినో యది।
భవామః కింనతే నైవ
ధనేన ధనినో వయమ్॥ ౬౩

తా॥ ఇవ్వడము అనుభవించడము లేని ధనముచేతనే ధనవంతులని పేరు కలిగినట్లైతే అదేద్రవ్యముచేత మేమున్ను ధనవంతులము కామా యేమి, తాననుభవించక యితరుల కివ్వకనుండే ధనము వ్యర్థమనిభా.

శ్లో॥ మృత్యుశ్శరీర గోప్తారం
ధనరక్షం వసుంధరా।
దుశ్చారిణీవ హసతి
స్వపతిం పుత్ర వత్సలమ్॥ ౬౪

తా॥ శరీరమును కాపాడెడి వానిని మృత్యువున్ను ధనమును కాపాడెడి వానిని భూమిన్ని బిడ్డయందాశగల తనమగనినీ వ్యభిచార స్త్రీ వలె నగుచున్నది అనగా యెవనికో పుట్టిన బిడ్డను తన బిడ్డగా భావించి లాలన జేయుచున్నాడని భావము.

శ్లో॥. దృఢతర నిబద్ధ ముష్టేః
కోశ నిషణ్ణస్య సహజ మలినస్య।

*

కృపణస్య కృపాణస్యచ
కేవల మాకారతో భేదః ॥ ౬౫

తా॥ దృఢముగా పట్టుకున్న పిడికిలితో గూడి ద్రవ్యమున్న అరలయందెప్పుడు వసించుచున్న స్వభావముగాన పరిశుద్ధుడయిన కృపణుడికీ కత్తికిన్ని సాధారణముగా ఆకారమాత్రము భేదము.

శ్లో॥ యోనదదాతిన భుఙ్క్తే
సతివిభవే నైవతస్య తద్ద్రవ్యం ।
తృణమయ కృత్రిమ పురుషో
రక్షతి సస్యం పరస్యార్థే ॥ ౬౬

తా॥ సంపదయుండగ నెవడను భవించడో యితరుల కివ్వడో ఆ ద్రవ్య మాతనికి లేనేలేదు పైరుపంటలయందు దృష్టిదోష పరిహారమునకుగాను గడ్డి బొమ్మ పొరుగు వానికొరకు సస్యముల గాపాడుచున్నదేగాని తనకొరకు గాదు ఆబొమ్మవలెనే కృపణుడని భావము.

శ్లో॥ యదిభవతి ధనేన ధనీ
క్షితితల నిహితేన భోగరహితేన ।
తస్మాద్వయ మపి ధనినః
తిష్ఠతినః కాంచనో మేరుః ॥ ౬౭

తా॥ అను భోగము లేక భూమియందు దాచిన ద్రవ్యము చేతనే ధనవంతుడైన యెడల మేమున్ను ధనవంతులమే మేమున్ను భూమియందు మేరు పర్వతమును దాచుకున్నాము నీద్రవ్యమును నీవెటులననుభవించవో మేమున్నట్లనే ననుభవించమని పరిహసించుచున్నారని భావము.

శ్లో॥ జహాతి సహసాసనం ఝుడితి పృచ్ఛతి స్వాగతం
నమస్యతి ముహుర్ముహు ర్స్తౌతిమనోహరం భాషతే॥

---

* ( ఆకారమనగా రూపము కృపాణ శబ్దమందుపకారోత్తరాకారము. )

దదాతి కుసుమం ఫలం శిథిలయత్య భీష్టాం క్రియాం
అహెూన పరిచీయతే కృపణ వంచనా చాతురీ॥ ౬౮

తా॥ కృపణుని రీతి యే మనగా వచ్చిన యాచకుని చూచి తాను కూర్చున్న యాసనము నతనికి శీఘ్రము విడుచును కుశల ప్రశ్నను చేసును మాటిమాటికి నంజలి జేయును చెవులకింపుగా మాటలాడును పుష్పముల ఫలముల నిచ్చును ( ఇట్లుపచారముచే తృప్తిపరచి గొప్ప ఫలము నపేక్షించివచ్చిన యాచకుని యొక్క ) యిష్టకార్యమును అడగనివ్వకుండా చెరుచును ఓహెూ యాచకుని విషయమయి కృపణుని యొక్క చాతుర్య మైన కపటవంచన తగ్గి పోలేదే.

శ్లో॥ ద్వారం ద్వారం మటన్భిక్షుః
శిక్ష త్యేవం నయాచతే ।
అదత్వా మాదృశో మాభూః
దత్వాత్వం తాదృశో భవ ॥ ౬౯

తా॥ ప్రతి వాకిలిలోను తిరుగుచున్న యాచకుడు యాచించుచు న్నాడని కాదు మరి యేమనగా ఆయా యింటివారికి బుద్ధిగలుగుటకై శిక్షించుచున్నాడు యెట్లనగా యాచకులకివ్వక మావంటివారుకాబోకుడు యిచ్చి మీవంటివారుగానే యుండుడు మునుపిచ్చినను యిప్పుడు మీరివ్వక పోతే మావలెనే నగుదురు మునుపిచ్చినటు లిప్పుడిచ్చిన మీవలెనే మీరుందురని భావము.

—(*) యాచకనిందా. (*)—

శ్లో॥ తృణాదపి లఘుస్థూలా స్థూలాదపి చయాచకః ।
వాయునా కింననీతో సౌమా మయం యాచ యేదితి ॥ ౭౦

తా॥ ఎండిన గడ్డి పరకకంటే పత్తి లేసైనది పత్తికంటే యాచకుడు లేసైనవాడు (ఐతే) సుడిగాలి వీనినేల కొట్టుకునిపోలేదనగా నన్ను నన్ను యేదైనా అడుగునేమోయని శంకించికొని పోలేదో అని తీర్మానించుకున్నాడని భావము.

శ్లో॥ దక్షిణాశ ప్రవృత్తస్య ప్రసారిత కరస్యచ।
తేజస్తేజస్వినోఽర్కస్య హీయతేఽన్యస్య కాకథా॥ ౭౧

తా॥ కరము చాచుకుని దక్షిణాశతో ప్రవర్తించెడి ప్రకాశవంతుడయిన సూర్యునియొక్క గౌరవమున్ను తగ్గి పోవుచుండగా మరియు కనియొక్క గౌరవము తగ్గి పోవుననుటకు యేమి వ్యవహారము.

శ్లో॥ దేహీతివచనం శ్రుత్వాహృదిస్థాః పంచదేవతాః।
ముఖాన్నిర్గత్య గచ్ఛన్తి శ్రీహ్రీధీ ధృతికీర్తయః॥ ౭౨

తా॥ సంపదకు లజ్జకు బుద్ధికి ధైర్యమునకు కీర్తికి అధిష్ఠాతలైన అయిదుగురు దేవతలు దేహీ అనెడుమాటవిని నంతలోనే ముఖమునుండి బయలుదేరి పోవుచున్నారు.

శ్లో॥ కాక ఆహ్వయతే కాకాన్ యాచకోనతు యాచకాన్।
కాక యాచకయోర్మధ్యే వరం కాకోనయాచకః॥ ౭౩

తా॥ కాకి యేదైన భక్షించుటకై కాకుల నన్నిటిని పిలచుచున్నది యాచకుడు బ్రతుకు స్థలములకు పోవుచు నితరయాచకులను పిలవడు గనుక యింత దారిద్ర్యమున్నను బంధుప్రియము లేనందున యాచకుని కంటే వాయసమే నుత్తమంబని భావము.

—(*) దారిద్ర్యనిందా. (*)—

శ్లో॥ హేదారిద్ర్య నమస్తేస్తు ధన్యోహం త్వత్ప్రసాదితః।
లోకాన్పశ్యామ్యహం సర్వాన్నమాం పశ్యతికశ్చన॥ ౭౪

తా॥ ఓదరిద్రమే నీకు నమస్కారము నీయనుగ్రహము వలన నేను కృతార్థుడను యేలనగా యెల్ల జనులను నేనుచూచుచున్నానుగాని నన్నెవడు చూడడు.

శ్లో॥ దగ్ధం ఖాండవమర్జునేన బలినాది వ్యైర్ద్రుమైస్సేవితం

---

* (కరము అనగా చెయ్యి కిరణము - దక్షిణాశా - దక్షిణపు దిక్కు - దక్షిణయందు ప్రియము.)

దగ్ధా వాయుసుతేన రావణపురీ లంకాపున స్స్వర్ణ భూః।
దగ్ధః పంచశరోపి నాకపతి నా తేనాప్య యుక్తం కృతం
దారిద్ర్యం జనతాపకారక మిదం కేనాపి దగ్ధం నహి॥ ౭౫

తా॥ ఉత్తమ వృక్షములతోకూడిన ఖాండవవనము బలిష్ఠుడయిన యర్జునునిచే కాల్చబడినది బంగారపుదయిన లంగా పట్నము న్హాంజనేయునిచే కాల్చబడినది పరమశివుని చేతనున్ను మన్మధుడు దహింపబడెను గనుక జగత్తు కపకారము జేయకున్న పైచెప్పిన మాటిని కాల్చడము యన్యాయము, లోకమునకపకారము చేసెడిదారిద్ర్యము నెవరు దహించరు గదా.

శ్లో॥ ద్వావిమాంభసిక్షేప్యా గాఢంబ ధ్వాగళే శిలాం।
ధనినంచా ప్రదాతారం దరిద్రంచా తపస్వినం॥ ౭౬

తా॥ ధనముండి దీనులకివ్వనివాడు దారిద్ర్యమిచ్చి తపస్సుచెయ్యనివాడు గొంతున రాయికట్టి నీటినిద్రొయ్యదగిన వాడగును దారిద్ర్యమున తపస్సుచేయని యెడల దారిద్ర్యము నివృత్తికాదు జన్మము వ్యర్థము.

శ్లో। అర్థానసంతినచ ముంచతి మాందురాశా
దాతాన సంకుచిత దుర్లలితం మనోమే।
యాచ్నాహి లాఘవకరీ స్వవధేచ పాపం
ప్రాణ స్స్వయం వ్రజతు కింప్రవి లంబితేన॥ ౭౭

తా॥ ద్రవ్యమో కలగదు ఆశయునన్ను విడిచిపోలేదు యిచ్చేడువాడు కనపడలేదు చిత్తమో సంకోచము చేత పీకులాడుచున్నది అడగడమో చులకనయినది తననుతానే చంపుకొనడమందు పాపమేర్పడును నేలాడుటచేత నేమి ప్రాణములు తానుగానె పోనీయని తనకష్టమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇహలోకేపి ధనినాంపరోపి సుజనాయతే।
సుజనోపి దరిద్రాణాం తక్షణా ద్దుర్జ నాయతే। ౭౮

తా॥ ఈలోకమందు ధనవంతుల కన్యుడున్ను సొంత వానివలె

నాచరించుచున్నాడు దరిద్రులకు సొంతవారయినను అప్పుడే యన్యులై వీరి విషయమున జెడ్డ వారగుచున్నారు.

శ్లో॥ పరీక్ష్య సత్కులం విద్యాం శీలం శౌర్యం సురూపతాం।
విధిర్దదాతినిపుణః కన్యామివ దరిద్రతాం॥ ౭౯

తా॥ బుద్ధిమంతుడైన బ్రహ్మ మంచికులమును విద్యను సుస్వభావమును పరాక్రమమును మంచిరూపమును పరీక్షించి (యున్నవని) తెలుసుకుని దారిద్ర్యమనెడి కన్యనిచ్చుచున్నాడు.

శ్లో॥ మారోదీర్పిరమేహి వత్సగుదతో దృష్ట్వాద్య బాలానిమాన్
నాయాతస్తవ వత్సదాస్యతి పితా గ్రైవేయకం వాససీ।
శ్రుత్వైవం గృహిణీవచాం సినికటే కుడ్యస్య నిష్కించనో
నిశ్వస్యాశ్రులవ ప్లవప్లుతతనుః పాంథః పునః ప్రస్థితః॥ ౮౦

తా॥ ఒక దరిద్ర కుటుంబమునందు నేడుచుచున్న బిడ్డలనుజూచి తల్లి దీనవచనము లాడుచున్నది వో బిడ్డా వూరక ఏడవకుము వోతండ్రీ నావద్దికిరమ్ము మీతండ్రి యింకారాలేదు వచ్చినంతలో నీకు మెడకు హారమును అంగవస్త్రములు నిచ్చుచున్నాడు యని తల్లి బిడ్డలకు దీనముగ వచనములాడు కాలమున కుటుంబరక్షణమునకై దేశాంతరగతుడయిన తండ్రి వేసారి తిరిగి ద్రవ్యము చిక్కక పోయినను బిడ్డలను చూడవలెనని యాశతో యింటికివచ్చి లోపల పోవుటకు కాళ్లాడక మెల్ల మెల్లగ లోపల ప్రవేశించునవుడు పైచెప్పిన మాటలను గోడవద్దను వుండి విని నిట్టూర్పు విడిచి కన్నీరుచేత మునిగినవాడయి సంపాదనకుగా వచ్చిన దోవతోనే మరలపోయెను.

శ్లో॥ అయేలాజానుచ్చైః పథివచన మాకర్ణ్య గృహిణీ
శిశోః కర్ణాయత్నాత్సుపిహితవతీ దీనవచనా।
మయిక్షీణో పాయేయద కృతదృశావ శ్రుశబలే
తదన్తః శ్శల్యం మేత్వమివపున రుద్ధర్తు ముచితః॥ ౮౧

తా॥ బొరుగుల పేలాల నమ్మెడివాడు వీధిన నమ్ముచుండగా దరి

ద్రకుటుంబమునందున్న తల్లి (ఓ బారుగులా యనెడి మాటనువిని) సమీ
పమందున్న బిడ్డయొక్క చెవులకు చిన్నబుచ్చుకొన్న మూతితో కూడా
మూశినది నేను సంపాదించుట కుపాయము తెలియని నా విషయమున
నేకారణమున కంట కన్నీరు గలిగినదో అట్టి నా యొక్క మనశ్శల్యము
నొత్తివేయుటకు నీవు తగినవాడవుగదాయని స్నేహితునివద్దకు వచ్చి వా
నితో జెప్పుకొను చున్నాడు.

శ్లో॥ కంథాఖండమిదం ప్రయచ్ఛయదివాస్వాంకే గృహాణార్భకం
రిక్తం భూతలమత్రనాథ భవతః పృష్ఠే పలాలోచ్చయః।
దంపత్యోః రితిజల్పతో ర్నిశియదాచోరః ప్రవిష్టస్తదా
లబ్ధం కర్పటమన్యత స్తదుపరిక్షిప్త్వా రుదన్నిర్గతః॥ ౮౨

తా॥ ఒక పేద కుటుంబమునందు దంపతులిద్దరిన భర్త భార్యను
జూచి నీవుకట్టుకొన్న పాతపేలికనిమ్ము లేనియెడల బిడ్డనుతొడయందుం
చుకొనుము యని చెప్పగా నతని భార్య వట్టి భూమియందుండుట న్యా
యముకాదు గనుక నీవెనుక వుకయున్నదని సూచన జేసెను యిట్లు
దంపతులు రాత్రి బిడ్డను చేతయుంచుకొని నాదులాడుచునపుడు దొంగిలిం
చ నొకదొంగ నచటికివచ్చి బిడ్డను పండపెట్టుటకు పాతపేలిక లేని యీ
కష్టస్థితినిజూచి బిడ్డయందు దయతో తనకు మరియొకచోట చిక్కిన పా
త పేలికను బిడ్డపైకప్పి దారిద్ర్యమును గురించి యేడుచుచు వచ్చిన మా
ర్గమునసే వెళ్లిపోయెను.

శ్లో॥ వృద్ధోనః పతిరేషమంచకగత స్థూణావశేషం గృహం
కాలోభ్యర్ణ జలాగమః కుశలినో వత్సస్య వార్తాపినో।
యత్నా త్సంచిత తైల బిందు ఘటికా భగ్నేతి పర్యాకులా
దృష్ట్వాగర్భ భరాలసాం నిజవధూం శ్వశ్రూశ్చిరం రోదితి॥ ౮౩

తా॥ ఇదియొక దరిద్రకుటుంబమునందు వృత్తాంతము భర్తయో
వృద్ధుడై పడకలో నేయున్నాడు యింటియందు గోడలు మొదలైనవిలేక
స్తంభములు మాత్రము మిగిలియున్నవి కాలమా సమీప నదీ ప్రవాహ

మువచ్చేడికాలముగానున్నది. పూరికిపోయిన చిన్నవాని కుశలవృత్తాంతము తెలియలేదు బహుకాలముగా ప్రయత్నముజేసి సంపాదించిన చమురుపోసుకొనె కుండ పగిలిపోయెనని ఖిన్నురాలై మోయలేని గర్భముచే కదలకుండునట్టి తనకోడలినిజూచి అత్తగారు అపరిమితముగా నేడుచుచున్నది.

శ్లో॥ రాత్రౌజానుర్దివాభానుః కృశానుస్సంధ్యయోర్ద్వయోః।
పశ్యశీతం మయానీతం జానుభానుకృశానుభిః॥ ౧౪

తా॥ ఓమిత్రుడా చలికాలమందు రాత్రి మోకాళ్లచేతనున్ను పగలు సూర్యునిచేత రాపగటిసంధ్యలయందు నగ్నిచేతను చలిపోగొట్టుకొనబడినది. వస్త్రహీనతచేత నిటులచెప్పబడెను

శ్లో॥ అయంపటో మేపి తురంగభూషణం
పితామహాద్యై రుపభుక్తయౌవనం।
అలంకరిష్యత్యథపుత్రపౌత్రకా
మయాధునా పుష్పవదేవ ధార్యతే॥ ౧౫

తా॥ ఈవస్త్రముమాతండ్రి యొడలుకు బహుయలంకారముగానుంటూయుండెను అటువెనుక మాతాతలు మొదలైనవారు వారియౌవనకాలమంతయు దీనితోనె చెల్లబుచ్చిరి నాబిడ్డలను మనమలనుగూడా అలంకరింపజేసును ఇప్పుడు నేనున్ను పుష్పమువలెను వాడకుండునట్లుగా ధరించుకొంటున్నాను.

శ్లో॥ క్రోశన్తశ్శిశవస్సవారి సదనం పంకావిరాత్రిం దివం
రాజాకుప్యతినిమ్నగా ప్రవహతేధూమేన పూర్ణంగృహం।
బంధోర్స్మారక పత్రికాఽగతవతీ సూతే తదాగారపి
శిష్యారంభణతి ప్రియా గృహగతో బంధుశ్చధిక్ సంస్కృతిం॥

తా॥ బిడ్డలేడుచుచున్నారు యింట్లోకూర్చుండుటకు వల్లలేక నీరు నిండినది రాత్రిపగలు వానగురియుచున్నది రాజుకప్పమునకుగాను కోపించుచున్నాడు. నదిప్రవహించుచున్నది యింట్లో తడికట్టెలచేపొగనిండి

నది బంధువులనుండి చనిపోయిన జాబువచ్చినది అప్పడావు యీనుతు న్నది భార్యనిష్ఠూరముగా పలుకుచున్నది బంధు వింటికి సంప్రాప్తుడై నాడుగనుక సంసారమెంతకష్టముగానున్నదని నిందించుచున్నాడు.

—(*) మిత్రప్రకరణం. (*)—

శ్లో॥ పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినం।
వర్జయేత్తా దృశంమిత్రం విషకుంభం పయోముఖం॥ ౮౭

తా॥ ప్రత్యక్షముకానిచోట కార్యము చెరుపువాడున్ను ప్రత్యక్ష మందు మంచిమాటలాడువాడున్ను నైనస్నేహితుని పైనపాలు లోపల విషమునుయున్నకుండనువలెనే విడువవలయును.

శ్లో॥ తత్రమిత్ర నవస్తవ్యం యత్రనాస్తి చతుష్టయం।
ఋణదాతాచ వైద్యశ్చ శ్రోత్రియ స్సజలానదీ॥ ౮౮

తా॥ నెచ్చోటనప్పిచ్చేడివాడును వైద్యుడున్ను వేదముచదివినవా డును యెప్పుడునెండని నీళ్ళుగలనదిన్ని యీనాలుగున్నులేవో నచ్చోట నివసింపగూడదు.

శ్లో॥ యస్యమిత్రేణ సంభాషా యస్యమిత్రేణ సంస్థితిః।
మిత్రేణ సహయోభుఙ్క్తే తతోనాస్తీహపుణ్యవాన్॥ ౮౯

తా॥ ఎవనికి స్నేహితునితోకూడా మాటలాడడము స్నేహితు నితోకూడాయుండడము మిత్రునితోకూడా యవడు భుజించునో నట్టి వానికంటె భూలోకములో వేరేపుణ్యవంతుడు కనుపడడు.

శ్లో॥ స్వామిని గుణాన్తరంగే గుణవతి భృత్యేనుకూలిని కళత్రే।
మిత్రేనసదోపకారిణని వెద్యదుఃఖం సుఖీభవతి॥ ౯౦

తా॥ గుణవిశేషము తెలుసుకొన్న యజమానుడియందును సుగుణ వంతుడైన సేవకునియందును అనుకూలురాలైన భార్యయందును ఎల్ల ప్పుడునుపకరించుచున్న స్నేహితునియందును దుఃఖమును తెలిపించి సుఖ వంతుడౌతున్నాడు.

శ్లో॥ స్వాభావికంతు యన్మిత్రం భాగ్యేనైవాభి జాయతే।

తదకృత్రి మసౌహార్ద మాపత్స్వపినముంచతి॥ ౯౧

తా॥ స్వాభావికముగా నెవడు స్నేహితుడో అట్టివాడదృష్టము చేతనేకలుగుచున్నాడు అట్టికపటములేని స్నేహమున ఆపదలయందును గూడ నతడువిడువచాలడు.

శ్లో॥ నమాత రినదారేషు నసోదర్యేనచాత్మని
విశ్వాసస్తా దృశఃపుంసాం యోహిమిత్రే స్వభావజే॥ ౯౨

తా॥ పురుషులకు స్వాభావికముగా నేర్పడిన మిత్రునిమెందెంత నమ్మికయో అంతనమ్మిక తల్లియందునుభార్యయందును కూడబట్టినవాని యందును తనయందును లేదు.

—(❊) సంతోషప్రశంసా. (❊)—

శ్లో॥ అకృత్వా పరసన్తాప మగత్వా ఖలనమ్రతాం।
అనుత్సృజ్య సతాంవర్త్మ యత్స్వల్ప మపితద్బహు॥ ౯౩

తా॥ ఇతరుల కుపద్రవముజేయక దుర్జనులకువంగక సత్పురుషుల మార్గమువదలక విభవమువెంతకొంచమైనను అది అధికమేను.

శ్లో॥ వయమిహపరితుష్టా వల్కలై స్త్వంచలక్ష్మ్యా
సమయిహపరితోషో నిర్విశేషో విశేషః।
సహిభవతి దరిద్రో యస్యతృష్ణావిశాలా
మనసిచ పరితుష్టేకోర్ధవాన్ కోదరిద్రః॥ ౯౪

తా॥ మేము నారచీరల చేతనే సంతోషించితిమి నీవుసంపదచేత సంతోషించితివి మన ఉభయులకు సంతోష మయినది హెచ్చుతక్కువ లేక సమమయినది యెవరికాశ గొప్పగానున్నదో ధనవంతుడైనను వాడేదరిద్రుడు మనస్సు తృప్తిపొందినయెడల ద్రవ్యవంతుడెవడు దరిద్రుడెవడు గనుక సుఖదుఃఖములు మనస్సుచేత కల్పించుకొన్నవనిభావము.

శ్లో॥ పంచమెహని షష్ఠేవా శాకంపచతిస్వేగృహే।
అనృణీచా ప్రవాసీచ సవారి చరమోదతే॥ ౯౫

తా॥ అధికదారిద్ర్యముచేత కూరకాయలుకానక అయిదవదినము

దుగాని యారవదినమందుగాని తనయింటిలోన కూరగాయలువండినను యెవడునిలకడవంతుడై ఋణములేనివాడైనయెడల వాడె సంతోషించుచున్నాడు.

శ్లో॥ అప్రార్థితాని దుఃఖాని యథైవా యాన్తిదేహినాం।
సుఖాన్యపి తథాయాన్తి దైన్యమత్రాతి రిచ్యతే॥ ౯౬

తా॥ మనుష్యులకు దుఃఖములుకోరకనే నెటులసంప్రాప్తమగుచున్నవో సుఖములుయారీతిగానె మనముకోరకనె వచ్చుచున్నవి ఇట్లుండగానీవిషయములో దీనత్వము జెంది యల్లాడుటయొకటె మిగులుచున్నది.

శ్లో॥ సర్వాస్సంపత్తయస్తస్య సంతుష్టం యస్యమానసం।
ఉపానద్గూఢపాదస్య నను చర్మావృతైవభూః॥ ౯౭

తా॥ యెవనియొక్క మనసు సంతోషమునుచెందినదో యట్టివానికే సర్వసంపదలున్నవి మచ్చలచే మూయబడిన పాదముగలవానికి భూమియంతయు చర్మముచే కప్పబడినదిగానే అవును.

శ్లో॥ ఆరోగ్యం విద్వత్తాసజ్జనమైత్రీ మహాకులేజన్మ।
స్వాధీనతాచపుంసాం మహదైశ్వర్యం వినాప్యర్థం॥ ౯౮

తా॥ రోగములేకుండుట పాండిత్యము సత్పురుషులతోస్నేహముపొరుగువానికి స్వాధీనుడు కాకుండడము ఈ విపురుషులకు ద్రవ్యములేకపోయినను యిదేగొప్ప ఐశ్వర్యము.

శ్లో॥ యోమగర్భగతస్యాపవృత్తిం కల్పితవాన్విభుః॥
శేషవృత్తివిధానాయా సకింసుప్తో ధవామృతః॥ ౯౯

తా॥ జంతుజాలములతో గూడిన గర్భమందున్నకాలమందే నాకు యేప్రభువు జీవనమునుగలుగజేసెనో నట్టిప్రభువుమిగతకాలమంతబ్రతుకు సంగతికై నతనునిద్రించుచున్నాడామృతుడైనాడా గనుక సర్వకాలములయందు రక్షించును.

—(*) గుణప్రకరణం (*)—

శ్లో॥ గుణినిగుణజ్ఞో రమతేనా గుణశీలస్య గుణిని పరితోషః।

అళిరేతి వనాత్పద్మం నదదుఃరస్స్వేక వాసోపి॥ ౧౦౦

తా॥ గుణజ్ఞులు గుణవంతుల యందే నాసక్తులౌదురు సద్గుణములు లేనివానికి గుణవంతునియందు సంతోషము కలుగచాలదు యెట్లనగా వనమునుండి తుమ్మెదనైనది పద్మమును వెతకి యనుసరించుచున్నదిగాని పద్మముతోకూడియున్న కప్పలుచేరవు.

శ్లో॥ వస్తుష్వగ్నిర్మిళిత్వైవ భాసతేనతు కేవలః।
గుణైస్సర్వజ్ఞకల్పోపి సీదత్యేకో నిరాశ్రయః॥ ౧౦౧

తా॥ గుణములచేత సర్వజ్ఞుడైనను ఆశ్రయంలేనియెడల వుపద్రవపడుచున్నాడు యెట్లనగా అగ్నినైనను పదార్థములతో చేరితేగాని ప్రకాశించదుగదా.

శ్లో॥ గుణయుక్తేప్యధో యాతిరిక్తః కూపేయథాఘటః।
నిర్గుణేపి భృతః పశ్యజనైశ్శిర సిధార్యతే॥ ౧౦౨

తా॥ గుణవంతుడైనను యేమిలేనివాడైన యెడల కిందికి పోవును యెట్లనగా భావియందు కుంభము గుణముతోకూడినను నీళ్లులేనియెడల బావిలో కిందుకు బోవుచున్నది గుణములేకపోయినను నీరున్నయెడల తలలో నుంచుకొని పోవుచున్నారు.

శ్లో॥ గుణైరుత్తుంగతాం యాతినోచ్చైరాసన సంస్థితః।
ప్రాసాద శిఖరారూఢః కాకః కింగరుడాయతే॥ ౧౦౩

తా॥ గుణములచేత పొడవును పొందుచున్నాడుగాని వున్నతమైన యాసనములచేత కాదు కాకి మిద్దెమీద యెక్కినను గరుత్మంతుడగుచున్నాడా.

శ్లో॥ గుణేషుక్రియతాం యత్నః కిమాటోపైః ర్భయంకరైః।
విక్రీయన్తేన ఘంటాభిర్గావః క్షీరవివర్జితాః॥ ౧౦౪

---

❋ (గుణమనగా దారము.)

తా॥ గుణములు గలుగుటయందు ప్రయత్నముచేయుడు భయంకరములయిన యాభాటములచేత ప్రయోజనమేమి ఆవులకుపాలులేని యెడల గొంతున ఘంటలున్నవని వెలకు పుచ్చుకొనుచున్నారా వేషమెట్లున్నను గుణమున్నయెడల గ్రహించుచున్నారని భావము.

శ్లో॥ గుణవంతః క్లిశ్యన్తే ప్రాయేణ
భవంతి నిర్గుణాః స్సుఖినః।
బంధన మాయాంతి శుకాః
యథేష్ట సంచారిణః కాకాః॥ ౧౦౫

తా॥ తరుచుగా గుణవంతులు యుపద్రవమును పొందేకావలయును గుణహీనులు సుఖముగానున్నారు యెట్లన కాకులు స్వేచ్ఛగా సంచరించుచున్నవి చిలుకలు పంజరమునందు కట్టుబడినవై పెంచెడివారికి స్వాధీనతతో యుండవలసినవి.

శ్లో॥ గుణేప్యస్తి శ్వేతు కోదండం గుణహీనే విహంగికా।
క్రీడోపలాని రత్నానినరో దుర్గంధ భస్త్రికా॥ ౧౦౬

తా॥ గుణమున్నయెడల విల్లనిపేరుగల దౌచున్నది లేనియెడల కావడిబద్ద యగుచున్నది నటులనే గుణమున్నయెడల రత్నను లేనియెడల ఆడుకునే రాళ్లుగా నగుచున్నవి మనుష్యునికి గుణమున్నయెడల నరుడని లేనియెడల కంపుగలిగిన తోలుతిత్తి అగుచున్నాడు.

—(*) ధీరప్రశంసా. (*)—

శ్లో॥ కదర్థితస్యాపి హిధైర్య వృత్తేర్న
శక్యతే ధైర్యగుణః ప్రమాష్టుం।
అధోముఖస్యాపి తనూనపాతో
నాధశ్శిఖాయాతి కదాచిదేవ॥ ౧౦౭

తా॥ దరిద్రుడైనను ధైర్యవంతునియొక్క ధైర్యగుణమును శోధించుటకు తగరు అగ్నితలకిందుగానుండినను జ్వాలకిందికిరాక పైకే నెటుల బోవుచున్నదో నటులని భావము.

శ్లో॥ నిందంతు నీతినిపుణాయది వాస్తువంతు
లక్ష్మీస్సమా విశతుగచ్ఛతు వాయథేష్టం।
అద్యైవవామరణ వస్తుయుగాంతరేవా
న్యాయాత్పథః ప్రవిచలంతి పదంనధీరాః॥ ౧౦౭

తా॥ న్యాయవంతులు నిందించుగాక కొనియాడుగాక సంపదలు గలుగని గలుగకపోని మరణమున్ను కలుగనీ గలుగకపోవు గాక ధీరులు న్యాయమార్గమునుండి వక అడుగయినా చలించరు.

శ్లో॥ సహపరిజనేన విలసతిధీరోగహనాని తరతిపునరేకః।
గిరిరేకేన సమాథోః మథనకృతా సహసురై రమృతం॥ ౧౦౮

తా॥ ధీరుడు పరిజనులతోడ ప్రకాశించును వక కాలమందు వకడు గానుండినను దాటకూడనిదానిని దాటును క్షీరాబ్ధిమథనమందు విష్ణువు మందరపర్వతమును తానొకడేమైతెను అమృతము దేవతులతో కూడా మథించి పానంచేసెను గనుక ధీరుడు వకడయ్యును ప్రకాశించును.

—(*) తేజస్విప్రకరణం. (*)—

శ్లో॥ హస్తీస్థూలతను స్సచాంకుశవశో కింహస్తిమాత్రోంకుశః
వజ్రేణాభిహతాః పతన్తిగిరయః కింశైలమాత్రఃపదిః।
దీపేప్రజ్వలితే వినశ్యతితమః కిందీపమాత్రం తమః
తేజోయస్య విరాజతేసబలవాన్ స్థూలేషుకఃప్రత్యయః॥ ౧౧౦

తా॥ యేనుగు స్థూలమయినను అంకుశమునకు స్వాధీనమగును ఆ యంకుశము యేనుగంత పొడవులావుతో నున్నదా వజ్రాయుధము చేత కొండలు రెక్కలు విరిగి కిందపడినవి వజ్రాయుధము కొండంత యున్నదా దీపము ప్రకాశించుచుండగా చీకటిపోవుచున్నది దీపమంతయగునా చీకటి గనుక యెవనికి తేజస్సు ప్రకాశించుచున్నదో వాడే బలవంతుడు కాని లావు పొడవుతోనుండెడివానియందు కార్యసాధకమని యేమినమ్మిక వుండును.

శ్లో॥ బాలస్యాపి రవేపాదాః పతన్త్యుపరిభూభృతాం।

*తేజసా సహజాతానాం వయః కుత్రోప యుజ్యతే ॥ ౧౧౧

తా॥ బాలుడయినను సూర్యునియొక్క పాదములు భూభృత్తుల పైబడుచున్నవి తేజస్సుతోకూడాబుట్టినవారికి వయస్సెక్కడ నుపయోగింప బడుచున్నది.

—(*) ఉదారప్రశంసా. (*)—

శ్లో॥ నైవపరం నవినశ్యతి తనురపి యాశ్రీనివేశితా సత్సు।
అవశిష్యతేహిమాం శోస్సైవకలాయాస్థిరా శంభో॥ ౧౧౨

తా॥ సత్పురుషుల యందుంచబడిన సంపద కొంచమయినను చెడిపోదు చంద్రుని వకకళా పరమశివుని యందుంచబడినది గనుక కృష్ణపక్షమునందు నశించక మిగులుచున్నది సత్పాత్రమందిచ్చే ధనము సార్థకముగునని తాత్పర్యము.

శ్లో॥ యద్దదాసి విశిష్టేభ్యో యచ్చాశ్నాసి దినేదినే।
తత్తేవిత్తమహంమన్యే శేషం కస్యాపిరక్షతి॥ ౧౧౩

తా॥ యోగ్యులకు దేనినిచ్చుచున్నావో ప్రతిదినమందు దేనిననుభవించుచున్నావో అదే నీయొక్క ద్రవ్యము కాని మిగత నున్నది యెవడి కోసమో రక్షించు చున్నానని భావము.

శ్లో॥ దాతవ్యం భోక్తవ్యం సతి విభవే సంగ్రహో న కర్తవ్యః।
పశ్యామి మధుకరీణాం సంచిత మర్థం హరం త్యన్యే ॥ ౧౧౪

తా॥ ఐశ్వర్యముండుకాలముననే ఇతరులకివ్వ తగినది తాననుభవించతగినది యింతేగాని మిగత పెట్టకూడదు తుమ్మెదలు తాము పానముచేయక అక్కడక్కడ సంపాదించి దాచు కొన్నమకరందమును జనులేలాగునను గ్రహించుకొని పోవుచున్నారు గనుక యనుభవించడ ముచితమని తాత్పర్యము.

---

(భూభృత్తులనగా కొండలకు రాజులకున్ను అర్థము.)
(పాదము కిరణములు పాదములు.)

శ్లో॥ యదాసీనోపి సేవ్యస్యా న్నిష్ఫలోన మహానపి ।
జలార్థిభిర్జలం హిత్వా పశ్యకూపం నిషేవతే॥ ౧౦౫

తా॥ నీచుడైనను ఇచ్చేటివాడే కొలవతగినవాడు గొప్పవాడైనను ఇవ్వనివాడు కొలవతగనివాడు దాహముకొన్నవాడు దగ్గర సముద్రమును విడిచి దూరముగానుండే బావినిగురించి పోవుచున్నాడు.

శ్లో॥ కర్ణస్త్వచం శిబిర్మాంసం జీవంజీమూతవాహనః।
దధౌదధీచిరస్థీని నాస్త్యదేయం మహాత్మనాం॥ ౧౦౬

తా॥ కర్ణుడుపైచర్మమును శిబిచక్రవర్తి మాంసమును జీమూతవాహనుడు జీవమును దధీచి యెముకలను ఇచ్చెను గనుక మహాత్ములు ఇవ్వకూడనిదొకటియున్నదా.

శ్లో॥ దానంభోగోనాశ స్తిస్రోగతయో భవంతి విత్తస్య।
యోనదదాతిన భుంక్తే తస్యతృతీయా గతిర్భవతి॥ ౧౦౭

తా॥ ధనమునకు నిచ్చుట యనుభవించుట చెడిపోవుట ఈప్రకారముగా మూడుగతులున్నవి యెవడుయిచ్చేడివాడుకాడో యెవడనుభవించడో వానియొక్క ద్రవ్యమునకు మూడవగతియే గలుగుచున్నది.

—(*) కలిమహిమా. (*)—

శ్లో॥ నదేవే దేవత్వం కపటపటవస్తాపసజనా
జనోమిథ్యావాదీ విరళతనువృష్టిర్జలధరః।
ప్రసంగోనీచానా మవనిపతయో దుష్టమనసో
జనాభ్రష్టానష్టా అహహ కలికాలః ప్రభవతి॥ ౧౦౮

తా॥ దేవునియందు నిగ్రహానుగ్రహసామర్థ్యములేదు. ఋషులు కపటముతో కావివస్త్రములను ధరించినవారైరి జనులు అబద్ధమును చెప్పెడివారుగానున్నారు మేఘముల్పవృష్ట్యతివృష్టితో గూడినదగుచున్నది నీచులయొక్క ప్రసంగము లధికములై యున్నవి రాజులు చెడ్డతలంపుగలవారుగానున్నారు ఓహోజనులందరు చెడి నశించిపోవుచున్నారు గదా గనుక కలికాలముప్రభావముతో నుంటున్నది.

శ్లో॥ శ్రుతిభ్రష్టానష్టా స్మృతిరపి పురాణంవిగళితం।
గతాలోపంసర్వే ప్రచురతర వేదాన్తనివహాః।
ఇదానీంవామైకా విబుధవచనా న్మోక్షపదవీ।
నజానేకో హేతుస్సతబతక వేశేషమహిమా॥ ౧౮౯

తా॥ వేదముచెడిపోయినది ధర్మశాస్త్రము కనుపడలేదు పురాణమువదిలిపోయినది ప్రసిద్ధములయిన వేదాన్తములన్నియులోపించి పోయినవి మోక్షమార్గము పండితులవల్లనే తెలియుచున్నదిగాని అనస్థానములేదు అయ్యయ్యో యేమిహేతువనోతెలియదు కలియుగము యొక్క ప్రభావముగానేయుండును.

శ్లో॥ నిర్వీర్యా పృధివీనిరోషధిరసానీచా మహత్త్వంగతా।
భూపాలా నిజకర్మ ధర్మరహితా విప్రాఃకుమార్గేరతాః।
భార్యాభర్తృ విరోధినీ పరరతా పుత్రాః పితుర్ద్వేషిణః।
హాకష్టం ఖలువర్తతే కలియుగే ధన్యానరా స్సజ్జనాః॥ ౧౨౦

తా॥ భూమ్మితేనో సారములేనిదై ఓషధులయొక్క రుచి లేనిదిగాయున్నది అధములు మహత్త్వమునుపొందుచున్నారు రాజులువారివారియొక్క స్వధర్మమునువదిలినవారలైనారు బ్రాహ్మణులుచెడుమార్గములయందాసక్తులు, భార్యపరునియందాసక్తిగలదై భర్తకువిరోధవంతురాలగుచున్నది ఈ మారులు తండ్రిని ద్వేషించుచున్నారు గనుక ఆహాకలియుగమునందు యిట్టికష్టము ప్రవర్తించు చున్నదిగదా గనుకసత్పురుషులేకృతార్థులు.

శ్లో॥ సన్తఃక్వాపినసన్తి సన్తియదివాదుఃఖేన జీవన్తితే।
విద్వాంసోపినసన్తిసన్తి యదివామాత్సర్య యుక్తాశ్చతే।
రాజానోపినసన్తిసన్తి యదివాతృష్ణా ధనగ్రాహిణః।
దాతారోపినసన్తిసన్తి యదివానేవానుకూలాఃకలౌ॥ ౧౨౧

తా॥ కలియుగమునందు సత్పురుషులెక్కడలేనేలేరు వుండినయెడ లకష్టముతోనే బ్రతుకుచున్నారు పండితులు యెక్కడకనపడరు కనబడే

నయెడల నౌకరి కొకరు కలహించుకొనువారుగానే యున్నారు యీవి
గలవారెచ్చటనుదొరకరు దొరికినయెడల అనుసరణ వల్లనే అనుకూలు
లవుతున్నారు ప్రభువులెక్కడచిక్కరు చిక్కినయెడల పారుగువారిద్రవ్య
ము నపహరించెడివారుగానే యున్నారుగదా గనుక యోగ్యత చూడ
రని భావము.

శ్లో॥ సీదన్తి చాగ్నిహోత్రాణి గురుపూజా ప్రణశ్యతి।
కుమార్యశ్చ ప్రసూయన్తే ప్రాప్తే కలియుగే సదా॥ ౧౨౨

తా॥ కలియుగమువచ్చిన దగుచుండగా అగ్నిహోత్రములు చెడి
పోవుచున్నవి ఆచార్యపూజలు నశించి పోవుచున్నవి బాలికలేప్రసవించు
చున్నారుగదా.

శ్లో॥ రాక్షసాః కలిమాశ్రిత్య జాయన్తే బ్రహ్మయోనిషు।
బ్రాహ్మణానేవబాధన్తే తత్రాపి శ్రోత్రియాన్ కృశాన్॥ ౧౨౩

తా॥ రాక్షసులు కలియుగము నాశ్రయించి బ్రాహ్మణులయందు
పుట్టి బ్రాహ్మణులనే బాధించుచున్నారు అందులోనురిక్తులైన వైదికుల
నే అధికముగా బాధించుచున్నారుగదా.

శ్లో॥ ప్రాతర్స్నాన్త కృత్వాప్లవోపి రజకస్పృష్టాన్ జడో రాసభైః
రూఢాన్ధారయతే పటాననుదినం ధృత్వా బహిర్గచ్ఛతి।
గత్వా మ్లేచ్ఛముఖాశుచీన్ స్పృశతిచ స్పృష్టోపన స్నాత్యహో
నస్నాతోప్యఘ భుఙ్త ఏవచ పలో భుక్త్వాపి నప్రీడతే॥ ౧౨౪

తా॥ కలియుగమునందు, స్నానము చేయకపోయినను చాకలవా
నిచే తాకబడి గాడిదెలచేత మోసుకరాబడిన గడ్డలను ధరించుచున్నా
డు ఆగుడ్డలతోనే బైట దిరుగుచున్నాడు తిరిగినను స్నానము చేయడు
స్నానము చేయక పోయినను ఆగడ్డలతోనే మూఢుడై అన్నమును భు
జించుచున్నాడు భుజించినను సిగ్గెపడడు మనస్సునగూడ శంకించడనిభా.

శ్లో॥ శాస్త్రైర్గ్రీవతి శాస్త్రము జ్ఝతిపరం శూద్రాహృతైరింధనైః
స్నాత్వాచామతి దేవతాస్స్నపయతి స్వైర్గంపచతోయదనః।

ఉచ్ఛిష్టాన్నవిభోజి యాతియవనై రుచ్చావచైః సంగతం
మాతంగాన్నికటం గతాన్నగణయన్మార్గానుహూగ్గాహతే॥

తా॥ శాస్త్రములను పెరుగువారలకుపదేశించి అందుచేత నే తాను బ్రతుకుచున్నాడు అయినను దానినేనమ్మక విడుచుచున్నాడు శూద్రునిచే తేబడిన నీళ్లచేత స్నానము చేయుచున్నాడు ఆనీళ్లచేతనే ఆచమనము చేయుచున్నాడు దేవతలకభిషేకము జేయుచున్నాడు యిష్టప్రకారముగా వండుచున్నాడు యెంగిలివల్ల భయపడడు జాతిభ్రష్టులతో సహవాసముచు పొందుచున్నాడు చండాలులయొక్క సమీపమును జెంది వాళ్ల పద్ధతిని నిందించక ఆ మార్గమందే మాటి మాటికి ప్రవేశించుచున్నాడు.

శ్లో॥ సీచైర్దుర్యవనైశ్చ శిక్షితపవానిశ్శంక మాలోకితం
భుక్తైః పక్షైః విదూషకైః స్సహనరై రిజ్ఞాత వేదాక్షరైః।
మద్యాస్వాదన మత్తచిత్తజనతాం మోహాయభేహానితః
కర్మాణ్యారభతేశ్రుతిస్మృతివచో దూరాణ్యసారాణ్యహో॥

తా॥ జాతిభ్రష్టులచే వాకయక్షరమైన వేదము తెలియని వారిచే పక్షులోపలికి రాకూడనివారిచే కుక్కలచే చూడబడిన యన్నమును శంకలేకనే తినుచున్నాడు కల్లుద్రావుటచే మదించిన చిత్తముగల జనులయొక్క మనస్తృప్తికై వేదశాస్త్రవిరోధములైన కర్మముల నారంభించుచున్నాడు. —(*) తృష్ణానిందా. (*)—

శ్లో॥ తృష్ణే దేవిఏవ ప్రున్యం ధైర్యవిప్లవకారిణి।
విష్ణుస్త్రైలోక్య పూజ్యోపి యస్త్వయావామనీకృతః॥ ౧౨౭

తా॥ ఆహా ధైర్యమును పోగొట్టెడి ఓ ఆశాదేవి నమస్కారము త్రైలోక్యమందు పూజ్యుడైనను గొప్పవాడయినను విష్ణువుచేతనే గదా పొట్టివాడాయెను అనగా వామనావతారమందు భూమి నాశించుటచే పొట్టివాడాయెనని గొప్పవారికైనను యాశయుండుటచే చిన్నతనము గలుగునని భావము.

శ్లో॥ భ్రాన్తం దేశమనేక దుర్గవిషమంప్రాప్తం నకించిత్ఫలం
త్యక్త్వాజాతికులాభిమాన ముచితం సేవాకృతానిష్ఫలా।
భుక్తం మానవివర్జితం పరగృహేష్వా శంకయాకాకవత్
తృష్ణాజృంభతి పాపకర్మనిరతా నాద్యాపిసంతుష్యతి॥ ౧౨౮

తా॥ అనేకమెరకపల్లములతోగూడిన దేశమునుచుట్టితిని యేమి ఫలమును పొందనైతిని జాతికులాభిమానమును విడిచి ప్రయోజనము లేకనే అనేకులకుపచారముజేసితిని కాకివలె మానములేకనే పరగృహములయందు భుజించితిని యిప్పుడైనా ఓయాశా సంతోషించవా.

శ్లో॥ యత్ఖాతం నిధిశంకయాక్షితితలం ధ్మాతాగిరేర్ధాతవో
నిస్తీర్ణస్సరితాం పతిర్నృపతయో యత్నేన సంతోషితాః।
మన్త్రారాధన తత్పరేణ మనసానీతాశ్శ్మశానేనిశాః
ప్రాప్తః కాణవరాటకోపనమయాతృష్ణేధు నాముంచమాం॥

తా॥ నిక్షేపము దొరుకునని యాశచేత భూమినంతయు త్రొవ్వితిని బంగారము చేయుటకై అనేకగంధకాది వస్తువులను కాల్చితిని వ్యాపారమునకయి సముద్రమును దాటితిని అనేకరాజుల సంతోషింపజేసితిని మన్త్రములను జపించుచు అనేకరాత్రులు శ్మశానమున బోగొట్టితిని యిన్నిజేసి నప్పటికిన్ని గుడ్డిగవ్వయయినా లభించలేదు ఓయాశయిప్పుడయిన నన్ను విడువుము.

శ్లో॥ అపిమేరూపమం ప్రాజ్ఞమపిశూర మపిస్థిరం।
తృణీకరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమం॥ ౧౩౦

తా॥ మేరువంతవాడైనను బలవంతుడయినను పండితుడైనను సత్పురుషుండైనను శూరుడైనను చంచలము లేనివాడయిన నుత్తమ మనుజుని యాశవకటే నిమిషములో గడ్డిపరకవలె జేయుచున్నది.

శ్లో॥ ఆశాయాయే దాసాస్తే దాసాస్సర్వలోకస్య।
ఆశాయేషాం దాసీతేషాం దాసాయతే విశ్వం॥ ౧౩౧

తా॥ ఆశకెవరు దాసులో వారులోకమంతటికి పనివారలే ఆశ

యెవరికి స్వాధీనమో వారికి లోక మంతయును స్వాధీనమగును.

శ్లో॥ తేనాధీతం శ్రుతం తేన తేన సర్వమనుష్ఠితం।
యేనాశాః పృష్ఠతః కృత్వా నైరాశ్యమవలంబితం॥ ౧౩౨

తా॥ ఎవనిచేత యాశ వెనుకకుత్రోసి వైరాగ్యము నవలంబించబడినదో వానిచేతనే అన్నిచదువబడెను అన్నియువినబడెను సర్వము అనుష్ఠించబడెను.

శ్లో॥ నిస్స్వో వష్టి శతం శతీ దశశతం లక్షం సహస్రాధిపః
లక్షేశః క్షితిరాజతాం క్షితిపతిశ్చక్రేశతాం వాంఛతి।
చక్రేశః స్సురరాజతాం సురపతిర్బ్రహ్మాస్పదం వాంఛతి
బ్రహ్మా శైవపదం శివో హరిపదం త్వృష్ణావధిం కోగతః॥ ౧౩౩

తా॥ ద్రవ్యములేనివాడు నూటి నపేక్షించును నూరుగలవాడు వెయ్యినపేక్షించును వెయ్యిగలవాడు లక్షనుగోరుచున్నాడు లక్షయుండెడివాడు జమీను నపేక్షించుచున్నాడు జమీన్దారుడు మండలాధిపత్యమును మండలాధిపతి ఇంద్రాధిపత్యమును ఇంద్రుడు బ్రహ్మపదమును బ్రహ్మ శివపదమును శివుడు విష్ణుస్థానమును గోరుచున్నాడుగనుక ఆశయొక్క తుదను తెలిసినవాడెవడు.

శ్లో॥ ఆశానామ నదీ రాజ స్వపరీతాహి శృంఖలా।
యయా బద్ధాః ప్రధావంతి ముక్తాస్తిష్ఠంతి పంగువత్॥ ౧౩౪

తా॥ బలముతోకూడిన ఆశయనెడి యిహలోక విధముగా నేర్పడిన విపరీతమయిన సంకెళ్లు యేలననగా యాశయనే సంకెళ్లచేత కట్ట బడినవారై పరువులెత్తుచున్నారు యీసంకెళ్లచేత వదలినవారు కుంటివారివలెనొకచోట నేయుంటున్నారని భావము.

శ్లో॥ తృష్ణే త్వమపి తృష్ణాంధా త్రిషు స్థానేషు పూజ్యసే।
వ్యాధితేష్వనపత్యేషు జరాపరిణతేషు చ॥ ౧౩౫

తా॥ ఓ ఆశే నీవున్ను ఒకయాశచేతనే గుడ్డిదానవైతివి యేలననగా వ్యాధిగలవారు బిడ్డలులేనివారు ముసలివారియందు పూజింపబడుచు

న్నావు అనగా యీముగ్గురి కధిక యాశయున్నదని భావము.

శ్లో॥ గిరిర్మహాన్ గిరేరబ్ధిర్మహానబ్ధే ర్నభో మహత్।
నభసోపి మహద్బ్రహ్మ తతోప్యాశా గరీయసీ॥ ౧౩౬

తా॥ కొండపెద్దది కొండకంటె సముద్రము పెద్దది సముద్రము కంటె ఆకాశముపెద్దది ఆకాశముకంటె బ్రహ్మముపెద్దది బ్రహ్మముకంటెను యాశనిండాపెద్దది యని భావము.

శ్లో॥ ఆశైవ రాక్షసీ పుంసామాశైవ విషమంజరీ।
ఆశైవ జీర్ణమదిరాధిగాశా సర్వదోషభూః॥ ౧౩౭

తా॥ ఆశయనెడిదే యొకరాక్షసి యాశయనెడిదే యొకవిషపూలగొత్తు ఆశయనెడిదే జీర్ణించిన కల్లు సర్వదోషములకు ఆధారమైన యీయాశ యెంతనింద్యమైనదని భావము.

శ్లో॥ క్షుత్తృడాశాః కుటుంబిన్యో మయి జీవతి నాన్యగాః।
తాసామాశా మహాసాధ్వీ కదాచి న్మాంనముంచతి॥ ౧౩౮

తా॥ ఆకలి దాహము ఆశయనెడి యీమూడున్ను నాభార్యలు నేను బ్రతికియుండగా మరియొకరిని జేరవు అందునకడపటిదైన యాశయనే భార్య బహుపతివ్రత నన్నెన్నడును విడిచిపెట్టి పోనేపోదుగనుక ఆశ బహు గొప్పదియని భావము.

శ్లో॥ ఆశానిష్ఠాః ప్రతిష్ఠాః కిలమమమహిళాస్తాసుమార్యాంకదాచిత్।
యాప్రాంత్యాసా ప్రదద్యాదిహకిమపితథా మధ్యమాసాపరత్ర।
ఆద్యాసానోభయత్రాప్య హహతదపికింసక్తతాంయామితస్యాం।
యాప్రౌఢ్యాదప్రగల్భే ప్రతిదివసముఖే తేకదర్థీకరోతి॥ ౧౩౯

తా॥ ఆశయనెడిది జపనిష్ఠయనెడిది కీర్తియనెడిది యీమూడున్ను నాకుభార్యలు ఆముగ్గురిలో పల కడపటి భార్యయైనది యేదేని సౌఖ్యమును నిచ్చును జపనిష్ఠయనెడి రెండవభార్య పరలోక సౌఖ్యము నిచ్చును ఆశయనెడి మొదటిభార్య యీ రెండులోకములయందును యే మిన్నివ్వదు అందుచేతను నాకుచింతలేదు యెవరైతె తనప్రౌఢతనముచేత

యేమి తెలియనీ ఆయిద్దరుభార్యలను పీడించుచున్నదో అట్టిదానియందా సక్తుఁడౌటనుగురించి చింతించుచున్నాను.

శ్లో॥ కలావంత మపిస్వచ్ఛం సద్వృత్త మపశీతలం।
లోభభక్షయం ప్రయాత్యేవ పూర్ణచంద్రం తథామదః॥ ౧౪౦

తా॥ కళతోఁగూడినను శుద్ధమైనవాఁడైనను మంచి నడవడికతోఁగూడినను కోపములేకున్నను మదము పూర్ణ చంద్రునివలెనే ఆశ నాశము జేయుచున్నది.

శ్లో॥ తృష్ణాభుజంగీదంశేప మూర్ఛవిభ్రాంతచేతసః।
నౌషధ్యోనచ మన్త్రాస్స్య శ్శరణాయ మణయోపిన॥ ౧౪౧

తా॥ ఆశయనే పాముగరచుటచేత కలకలచారిన మనస్సుగలవానికి ఆవిషమునణచుటకై మూలికలున్న మన్త్రములున్న రత్నములున్న లేవని భావము.

—(*) దైవప్రకరణం. (*)—

శ్లో॥ దైవంఫలతి సర్వత్ర నవిద్యానచచ పౌరుషం।
సముద్రమథనాల్లేభే హరిర్లక్ష్మీం హరోవిషం॥ ౧౪౨

తా॥ అంతట భాగ్యము ఫలించునుగాని పాండిత్యము పరాక్రమము ఫలించదు. యెట్లనగా హరిహరు లిద్దరు క్షీరాబ్ధినిచిలికినను విష్ణువు లక్ష్మిని, శివుడు విషమును బొందెనని భావము.

శ్లో॥ ప్రాప్తవ్యమర్థంలభతేమనుష్యో దేవోపితంలంఘయితుంనశక్తః।
తస్మాన్నశోచామినవిస్మయో మే యదస్మదీయంనహితత్పరేషాం॥

తా॥ మనుష్యుడు పొందదగిన ఫలమును పొందనే బొందును దానిని మార్చుటకు దేవుడున్ను శక్తుడుకాడు అందువలన నేను కావలయు

* (శీతలమనగా చల్లదనము) (సద్వృత్తమనగా వర్తువ)
(స్వచ్ఛమనగా తెలుపు)

నని యేకవను యేర్పడినదని నాకు హాశ్చర్యములేదు. యేదినాదైయున్న
దో అదిపొసుగువాని కేర్పడదు.

శ్లో॥ మాధావమా ధావవినైవదైవంనోధావనం సాధనమ స్త్రిలక్ష్మ్యాః।
చేద్ధావనంసాధనమ స్త్రీలక్ష్మ్యాః శ్వాధావమానోనలభేతలక్ష్మీః॥

తా॥ అదృష్టంవినాగా పరుగెత్తకుము సంపదనుపొందుటకు పరు
గెత్తటమే సాధకమైనదా అట్లయినయెడల నిత్యము పరుగులెత్తుచున్న
కుక్కయైనది లక్ష్మినిపొందలేదే.

శ్లో॥ దైవే విముఖతాం యాతేనకోప్యస్తి సహాయవాన్।
పితామాతాతధాభార్యా భ్రాతావాధ సహోదరః॥ ౧౪౫

తా॥ దైవము విపరీతమగుచుండగా తల్లితండ్రిభార్య అన్నదమ్ము
లు మొదలయినవారు సహాయము జేయుచున్నారా లేదని భావము.

శ్లో॥ భూయిష్ఠం ద్రవిణాత్మజం జనయితుం లిప్సావతాచేతసా
నార్యాః పఞ్చమయా క్రమేణకులజాః కాలే సముద్వాహితాః।
సద్విద్యాకవితా విదేశవసతి స్సేవాతదా భ్యర్థనా
దైవేనప్రతిబంధకేన యుగపద్వంధ్యా స్సమస్తాఃకృతాః॥ ౧౪౬

తా॥ ద్రవ్యమనే కుమారుని కనుటకు ఆశతోగూడిన మనస్సుచేత
మంచి కులమునందు పుట్టిన ఐదుగురు భార్యలు క్రమముగా నాచేత
వివాహము చేసుకొనబడిరి వారెవరనగా మంచివిద్య కవిత్వము విదేశ
వాసము ఒకరినిగొలుచుట యాచించుట యీయయిదుగురున్ను దురదృ
ష్టముచే పైబిడ్డనుకనక గొడ్రాలులైరి.

శ్లో॥ సచ్ఛిద్రో మధ్యకుటిలః కర్ణస్స్వర్ణస్య భాజనః।
ధిగ్దైవనిహతం నేత్రం పాత్రం కజ్జల భస్మనః॥ ౧౪౭

తా॥ రంధ్రముతోగూడినను నడుమ వొంకరైనను చెవియైనది బం
గారమునకు పాత్రమయినది యేదోషములేకను దురదృష్టముతోగూడిన
నేత్రమయినది కాటుకపట్టికి పాత్రమయినదిగదా.

శ్లో॥ భాగ్యవంతం ప్రసూయేథాః మాశూరం మాచ పండితం।
శూరాశ్చ కృతవిద్యాశ్చ వనే సీదన్తి పాండవాః॥ ౧౪౮

తా॥ భాగ్యవంతుని గానే కనంపి పరాక్రమవంతుని విద్వాంసుని కనబోకుము శూరులైనను పండితులయినను పాండవులు అడవియందు దుఃఖపడుచున్నారుగదా.

శ్లో॥ అంభోధిస్థలతాం స్థలంజలధితాం ధూళీలవశ్శైలతాం
మేరుర్మృత్కణతాం తృణంకులిశతాం వజ్రం తృణప్రాయతాం।
వహ్నిశ్శీతలతాంహిమం దహనతా మాయాతియస్యేచ్ఛయా
లీలాదుర్లలితా ద్భుతవ్యసనినే దైవాయతస్మైనమః॥ ౧౪౯

తా॥ యేదైవముయొక్క తలంపుచే సముద్రము నీరులేనిస్థలమగుచున్నది స్థలము సముద్రమగుచున్నది దుమ్ము కొండయగుచున్నది కొండ మట్టిముద్ద యగుచున్నది గడ్డిపరక వజ్రాయుధమగుచున్నది వజ్రాయుధము తృణప్రాయమగుచున్నది అగ్ని చల్లనగుచున్నది మంచు నిప్పగుచున్నది వేడుకగా యిట్లు సాధ్యముగా చింతించుచున్న విధి కొరకు నమస్కారము.

శ్లో॥ అరక్షితం తిష్ఠతిదైవరక్షితం సురక్షితం దైవహతం వినశ్యతి।
జీవత్యనాథోపవనే విరక్షితః కృతప్రయత్నోపి గృహేవినశ్యతి॥

తా॥ మనచేత గాపాడకపోయినను దైవముచేత కాపాడినయెడల చెడకయుంటున్నది మనచేతకాపాడినను దైవముచేకొట్టబడిన చెడిపోవుచున్నది నాథుడులేకపోయినను వనమందు రక్షించబడి జీవించుచున్నాడు యెంత ప్రయత్నము జేసినను గృహమందు నశించనే నశించుచున్నాడుగదా.

శ్లో॥ దాతాబలిః ప్రార్థయితాచవిష్ణుర్దానం భువోవాజిముఖస్యకాలః । నమోస్తుతస్యై భవితవ్యతాయై యస్యాః ఫలం బంధనమేవజాతం॥ ౧౫౧

తా॥ యిచ్చేటువాడు బలియాచించెడువాడు విష్ణువుభూమిదాన

ము అశ్వమేధ యాగకాలము యిట్లున్నను యిచ్చేటివానికి బంధన మనే ఫలమేర్పడెను గనుక అట్టివిధికి నమస్కారము.

శ్లో॥ యస్మనోరథ శతైరగోచరం నస్పృశంతికవయోపి గిరాయత్ ।
స్వప్నవృత్తిరపి యత్రదుర్లభాలీలయైవవిదధాతి తద్విధిః॥ ౧౫౨

తా॥ కోరికలచే గోరని కవులు వర్ణింపని కలలోనుగూడ చూడనిదియెదో దానిని విధివేడుకగా గలుగజేయుచున్నాడు.

శ్లో॥ మాతాయస్య ధరాధరేంద్ర దుహితాతాతో మహేశస్తథా
భ్రాతాక్రౌంచ విదారక స్సురపతి సేనాగ్రగ ష్షణ్ముఖః।
ఖ్యాతో విఘ్నవిదారణే పితృసఖో దేవో ధనానాం పతిః
తద్దుర్దైవబలేన కుత్రఘటతే నాద్యాపి పాణిగ్రహః॥ ౧౫౩

తా॥ తల్లి పర్వతరాజు కూతురు తండ్రి మహాదేవుడు అన్నయమ్మ డో దేవసేనాధిపతి తానోసమస్తవిఘ్నముల నివారించెడువాడు ధనాధిపతి తనతండ్రికి మిత్రుడు ఇట్లుండియు దురదృష్టముచేతనేగదా యిప్పటికిన్ని వినాయకునికి వివాహము ఘటించబడనేలేదు.

శ్లో॥ కాంశ్చిత్తుచ్ఛయతి ప్రపూరయతివా కాంశ్చిన్నయత్యున్నతిం
కాంశ్చిత్పాతవిధౌ కరోతిచపునః కాంశ్చిన్నయత్యాకులాన్।
అన్యోన్యప్రతిపక్ష సంహతిమిమాం లోకస్థితిం బోధయన్
ఏషః క్రీడతికూపయన్త్రఘటికాన్యాయ ప్రసక్తోవిధిః। ౧౫౪

తా॥ దైవము యిరువైపుల నీరుతోడెడి రాట్నమువలె కొంత జనులను అల్పులను కొందరిని గొప్పవారినిగాను కొంతమందిని పాపులుగాను కొందరిని వ్యాకులవంతులుగాను యిటుల పరస్పరము విరుద్ధమైన లోకమార్గమును తెలిపించుతూ విహరించుచున్నది.

శ్లో॥ సదసి విదుర భీష్మ ద్రోణశార ద్వతానాం
పతిభిరమరకల్పైః పఞ్చభిః పాలితాపి।
అహహ పరిభవస్య ద్రౌపదీ పాత్రమాసీత్
బలవతిసతిదైవే బంధుభిః కిం విధేయం॥ ౧౫౫

తా॥ విదురభీష్మద్రోణ కృపాచార్యులు మొదలగువారి సభయందు పాండవులయిదుగురితో గూడినదైనను ద్రౌపది అవమానమునకే పాత్రమాయెను గనుక అయ్యయ్యో దైవముబలమైనట్టయితే బంధువులచేత నేమి చేయదగును.

శ్లో॥ పిబంతిమధుపద్మేషు భృంగాః కేసరధూసరాః।
హంసాశ్శైవాలమశ్నంతి ధిగ్దైవమసమంజసం॥ ౧౫౬

తా॥ తుమ్మెదలు పద్మములయందలి మకరందమును పుప్పొడితోనలంకరింపబడినవై పానము జేయుచున్నవి హంసలైతే పాచితీగెలను తింటున్నవి గనుక దైవము మంచిదిగాదు.

—(*) పశ్చాత్తాపః (*)—

శ్లో॥ విద్యానాధిగతాకళంకరహితా విత్తంచనోపార్జితం।
శుశ్రూషాపి సమాహితేన మనసా పిత్రోర్నసంపాదితా।
ఆలోలాయతలోచనాయువతయః స్వప్నేపినాలింగితాః।
కాలోయం పరిపిండలోలుపతయాకాకైరివ ప్రేషితాః॥ ౧౫౭

తా॥ పాపములేని విద్యనో చదవబడలేదు ద్రవ్యమున్ను సంపాదించబడలేదు తల్లిదండ్రుల కుపచారమున్ను వొప్పుకున్న మనస్సుతో సంపాదించబడలేదు చంచలములైన విశాలములైన నేత్రములుగల స్త్రీలు స్వప్నమందున్ను ఆలింగనము చేసుకొనబడలేదు (గనుక) కబళములయందాశచే కాకులచేతవలె యీకాలమంతయు పోగొట్టబడెనది.

శ్లో॥ ధనవానితిహిమదో మేకిం గతవిభవో విషాదముపయామి।
కరనిహితకందుకసమాః పాతోత్పాతా మనుష్యాణాం॥ ౧౫౮

తా॥ ధనవంతుడనియేమి నాకుమదము ఐశ్వర్యముపోయిన నేను (అప్పుడే) దుఃఖమును పొందుతున్నాను మనుష్యులయొక్క ఐశ్వర్యములు చేతనున్నచెండు సమానములై పడుట యెగరుటలతో గూడినవి గదా హెచ్చుతక్కువలు గలిగినవనిభావము.

శ్లో॥ ఆయుర్వర్ష శతంనృణాం పరిమితం రాత్రౌతదర్ధంగతం।
తస్యార్ధస్య పరస్యచార్ధమపరం బాలత్వ వృద్ధత్వయోః।
శేషంవ్యాధి వియోగదుఃఖ సహితం సేవాదిభిర్నీయతే।
జీవేవారితరంగ చంచలతరే సౌఖ్యంకుతః ప్రాణినాం॥ ౧౫౯

తా॥ జనులకాయుర్దాయము సాధారణముగా నూరుసంవత్సరములు యేర్పడియున్నవి అందునసగము యాభై సంవత్సరములు రాత్రియందు నిద్రతో వ్యర్థమగుచున్నది మిగత యాభై సంవత్సరములలో రెండుభాగములుచేయగా అందునొకభాగము యిరువదియైదుసంవత్సరములు బాల్యములోను వృద్ధాప్యములోను వ్యర్థమగుచున్నది మిగత సగము వ్యాధిచేతను భార్యా వియోగాదులచేతను దుఃఖము గల్గినదై సేవకావృత్తి మొదలగువాటిచేతనున్ను పోద్రుపోగొట్టబడుచున్నదిగనుక ప్రాణము అలలవలె కదలుచుండగా ప్రాణులకు సుఖమెక్కడివి.

శ్లో॥ బ్రహ్మజ్ఞాన వివేకనిర్మలధియః కుర్వన్త్యహోదుష్కరం।
యన్ముంచన్త్యుప భోగవంతిధనాన్యే కాంతతోని స్పృహాః।
నప్రాప్తాని పురానసంప్రతినచ ప్రాప్తౌదృఢప్రత్యయః।
వాంఛామాత్ర పరిగ్రహాణ్యపి పరిత్యక్తుం నశక్తావయం॥ ౧౬౦

తా॥ యేకారణమువలన స్వభావముతో ఆశలేనివారై అనుభోగములతోకూడిన ధనమునువిడుచున్నారో ఆకారణమువలన అంత చెయ్యనశక్యమైనపనిని బ్రహ్మజ్ఞాన విచారముచేత శుద్ధమైనమనసుతోకూడినవారుచేయుచున్నారే ఆహాఅట్టిపనులుమాచేతమునుపున్ను యిప్పుడును పొందబడలేదు యిప్పుడున్న బ్రహ్మజ్ఞానసంబంధమైనయొకదృఢమైన నమ్మికయున్నుకలగలేదు ఆశపర్యంతం పొందదగినవాటి నన్నిటినివిడుచుటకు మేము శక్తులము కాక బోతిమి అనగా ఆశించడమే ఫలం వేరే ఫలంలేదు.

శ్లో॥ ఆయుష్యంజలబిందులోల చపలం ఫేనోపమ జీవితం।
అధాణఃపాదరజస్సమా గిరినదీవేగోపమంయావనం।

ధర్మంయోనకరోతి నిశ్చలమతిస్స్వర్గార్గలోద్ఘాటనం।
పశ్చాత్తాపయుతో జరా పరిగతశ్శోకాగ్ని నాదహ్యతే॥ ౧౬౧

తా॥ ఆయుస్సుయొక్క తత్వము నీటిబిందువునందలి కదలుటవలె చంచలముతో గూడినది ప్రాణములరీతి నురుగువంటిది ద్రవ్యము కాలి దుమ్ముతో సమానమైనది యౌవనము కొండ శెలయేటి వేగముతో సమానమైనది గనుకస్థిరచిత్తముగలవాడు స్వర్గలో, మందలి గడియతెరుచుటమైనధర్మమును యెవడుచేయడో వాడు ఆవెనక పాపమునుపొంది ముసలితనముచేత అవమానింప బడి శోకమనే నిప్పుచే కాల్పబడుచున్నాడు.

శ్లో॥ క్షణంబాలో భూత్వాక్షణమపి యువా కామరసికః।
క్షణంవిత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణ విభవః।
జరాజీర్ణైరంగైర్నట ఇవవళీ మండితతనుః।
నరస్సంసారాన్తే విశతి యమధానీం యవనికాం॥ ౧౬౨

తా॥ క్షణకాలముబాలుడుగావుండి క్షణకాలము కామశాస్త్రమందు రసికుడైన యౌవనవంతుడుగాయుండి క్షణం ద్రవ్యహీనుడై క్షణమైశ్వర్యములతోకూడినవాడై ముసలితనముచే చెడిన అవయవములతో ముడతలచేత ప్రకాశించెడి శరీరము గలవాడై నటునివలె సంసారముయొక్క కడపటికాలమందు యమలోకమనే తెరలోపలిస్థానమును నరుడు ప్రవేశించుచున్నాడు.

—(*) ఉద్యోగప్రశంసా. (*)—

శ్లో॥ ఉద్యోగఃఖలుకర్తవ్యః ఫలంమార్జాలవద్భవేత్।
జన్మప్రభృతి గౌర్నాస్తి పయఃపిబతి నిత్యశః॥ ౧౬౩

తా॥ ప్రయత్నముచెయ్యతగినదవును ఫలము పిల్లికివలెఅగును పిల్లి జనించినదిమొదలు పశువులేదు నిత్యమున్ను పాలు ద్రావుచున్నది అనగా పిల్లి చౌర్యమునైనా జేసి పాలుత్రాగివద్చునుగనుక ప్రయత్నమువల్లనే ఫలముకలుగును.

శ్లో॥ ఉద్యమేనహిసిధ్యన్తి కార్యాణి నమనోరథైః।
నహిసుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖేమృగాః॥ ౧౬౪

తా॥ ప్రయత్నములచేత కార్యములు సిద్ధించుచున్నవిగాని కోరిక లచేతసిద్ధించవు నిద్రబోవుచున్నసింహముయొక్క ముఖమునందుమృగములు ప్రవేశింపవు గనుక ప్రయత్నముచేసే కావలయును.

శ్లో॥ ఉద్యమస్సాహసంధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః।
షడేతే యత్రవర్తంతే తత్రదేవ స్సహాయకృత్॥ ౧౬౫

తా॥ మెచ్చటప్రయత్నము తెంపు ధైర్యము సుబుద్ధియు బలము పరాక్రమముయీయారున్ను యెవనియందుండునో అచ్చటదైవము గూడసహాయము జేసును.

శ్లో॥ ఆలస్యంహి మనుష్యాణాం శరీరస్థో మహారిపుః।
నాస్త్యుద్యమసమోబంధుః కృత్వాయం నావసీదతి॥ ౧౬౬

తా॥ మనుష్యులకు నాలస్యమనెడిది శరీరమందున్న పెద్దశత్రువు దేనినిజేసి తేచెడడో అటువంటి ప్రయత్నమునకు సమానమైన బంధువు వేరేలేదు.

శ్లో॥ నదైవ మితిసంచింత్య త్యజేదుద్యోగమాత్మనః।
అనుద్యమేనక స్తైలం తిలేభ్యః ప్రాప్తుమిచ్ఛతి॥ ౧౬౭

తా॥ విధిప్రకారం జరుగునని చింతించి తనయొక్కప్రయత్నమును విడిచిపెట్టకూడదు ప్రయత్నములేకనే నువ్వులలోనుంచి తైలమునుపొం దనిచ్ఛయించునా ఇచ్ఛయించడని భావము

శ్లో॥ కామపిశ్రియమాసాద్య యస్తద్వృద్ధౌనచేష్టతే।
తస్యాయతిషునశ్రేయః బీజభోజి కుటుంబవత్॥ ౧౬౮

తా॥ యెవడుయేదోవకసంపదనుపొంది దానివృద్ధి విషయములో ప్రయత్నముచేయడో వానివున్నతమైనదశలయందు మరుసంవత్సరంపంటకు దాచుకున్నవిత్తులనుతినెడి కుటుంబమునకువలె క్షేమనుకలుగదు.

## —(*) కర్మవిషయం. (*)—

శ్లో॥ ధనానిభూమౌ పశవశ్చగోష్ఠే భార్యాగృహద్వారిజనశ్శ్మశానే।
దేహశ్చితాయాం పరలోకమార్గే కర్మానుగోగచ్ఛతి జీవఏకః॥

తా॥ భూమియందు ధనములు కొట్టమందు ఆవులును యింటివాకిట భార్యయును శ్మశానమందలి బంధుజనులును చితియందు దేహమును యివియన్నియును విడవబడుచున్నవి పరలోకమార్గమందు కర్మమునను సరించి జీవుడొకడే పోవుచు ఇ్నాడు.

శ్లో॥ యథాధేను సహస్రేషు వత్సోవిందతి మాతరం।
తథాపూర్వ కృతంకర్మ కర్తార మనుగచ్ఛతి॥ ౧౭౦

తా॥ అనేకఆవులలోపల గూడ తల్లినియెట్లుపొందునో ఆప్రకారముగా జన్మాంతరమందుజేసిన కర్మ తననునుసరించుచున్నది.

శ్లో॥ యస్మాచ్చయేన చయథా చయదాచయచ్చ
యావచ్చయత్రచ శుభాశుభమాత్మకర్మ।
తస్మాచ్చతేన చతథాచ తదాచతచ్చ
తావచ్చతత్రచవిధాతృవశాదుపైతి॥ ౧౭౧

తా॥ ఏకారణము వలన దేనితో నెప్పుడెటుల నేదెంతవట్టుకునెక్కడ శుభాశుభ కర్మము చేయబడినదో ఆకారణమువలన దానితో నపుడటుల యంతమట్టుకచ్చట దానిని దైవమువలన పొందుచున్నాడు.

శ్లో॥ ఆకాశముత్పతతు గచ్ఛతువాదిగంతం
అంభోనిధిం విశతు తిష్ఠతువాయథేచ్ఛం।
జన్మాంతరార్జిత శుభాశుభకృన్నరాణాం
ఛాయైవనత్యజతి కర్మఫలానుబంధః॥ ౧౭౨

తా॥ జీవుడు అకాశమునకెగిరినను అనేకదిక్కులకు పోయినను సముద్రములోప్రవేశించినను వానియిష్టప్రకారంవున్నను జన్మాంతరమందు సంపాదించబడిన పాపపుణ్యరూపకమైన కర్మమును జేయుచుండెడి మనుజులకు కర్మముయొక్క ఫలము నీడరీతిగా వదలకుండుననిభావము.

శ్లో॥ స్థాల్యాం వైదూర్యమయ్యాం పచతి తిలకణాన్ చందనైరింధ
నాద్యైః సౌవర్ణైర్లాంగలాద్యైర్విఖనతి వసుధామ
ర్క మూలస్య హేతోః । ఛిత్వా కర్పూరఖండాన్ వృతి
మిహకురుతే కోద్రవాణాం సమంతాత్ ప్రాప్యేమాం
కర్మభూమిం నచరతి మనుజో యస్తపో మందభాగ్యః ॥ ౧౭౩

తా॥ ఎవడు అదృష్టము లేనివాడై యీ కర్మభూమిని పొంది తపస్సును ఆచరించడో అట్టివాడు వైడూర్య మణులచే చెక్కబడిన పాత్రయందు నువ్వులను వేశి చందనపుకట్టెలచేత మంటవేస్తూవండును, జిల్లేడువేరు కొరకు బంగారు నాగలిచేత భూమిని దున్నును ఆరిగెకోసరమై పచ్చకర్పూరముపొడిచేసి ఆవరణముకట్టును. అనగా అల్పకార్యమునకై గొప్పసాధకములను వ్యర్థముచేసును, గొప్పసాధకములచే తపస్సుమొదలైన గొప్పపనులు చేయడమే బాగని భావము.

శ్లో॥ సుఖస్య దుఃఖస్య నకోపిదాతా పరోదదా తీతి కుబుద్ధి
రేషా । అహంకరోమీతి వృథాభిమాన స్స్వకర్మ సూ
త్రగ్రథితో హిలోకః॥ ౧౭౪

తా॥ సుఖమునున్ను దుఃఖమునున్ను యిచ్చేడివాడు యెవ్వడులేడు మరివకడు యిచ్చు ననేబుద్ధి దుర్బుద్ధియేయగును సర్వము నేను చేయుచున్నాననేమాట వ్యర్థముగా గర్వముచే చెప్పబడినదే వాడివాడి కర్మమనే దారముచేత కట్టబడినవాడేగదా మనుష్యుడు.

—(*) మానప్రకరణం. (*)—

శ్లో॥ ఆత్మనో ముఖదోషేణ బధ్యంతే శుకసారికాః।
బకాస్తత్ర నబధ్యన్తే మౌనం సర్వార్థ సాధకం॥ ౧౭౫

తా॥ తన వాగ్దోషము చేతనే చిలుకలున్ను గోరంకి పక్షులున్ను పంజరమందు బంధించబడుచున్నవి. అచ్చట కొంగలు కట్టుబడ జాలవుగనుక సర్వకార్యములకు సాధకమైనది మౌనమేయని భావము.

శ్లో॥ స్వాయత్తమే కాంతగుణం విధాత్రా
వినిర్మితం ఛాదన వజ్ఞతాయాః ।
విశేషత స్సర్వవిదాం సమాజే
విభూషణం మౌనమ పండితానాం॥ ౧౭౬

తా॥ అజ్ఞానమున కావరణమైనటువంటి తన స్వాధీనమైన అంత రంగ గుణము బ్రహ్మచేత నిర్మింప బడినది అదేదనగా మౌనమామౌన మే సర్వజ్ఞులయొక్క సభయందు చదువుకోనివారికి విశేముగా అలంకారమగుచున్నది అజ్ఞులు సభయందు మాట్లాడక నుండడముచేతనే అజ్ఞానము బైటపడదు.

శ్లో॥ భద్రంభద్రం కృతంమౌనం కోకిలైర్జలదాగమే।
వక్తారో దర్దురాయత్ర తత్రమౌనం సమాచరేత్॥ ౧౭౭

తా॥ వర్షాకాలమందు కోకిలలచేతఅరవక వూరకయుండుట మంచిది యెచ్చట కప్పలరచుచున్నవో నచ్చట మౌన మవలంవించ వలశినదే.

—(※) సత్సాంగత్యం. (※)—

శ్లో॥ మహానుభావ సంసర్గః కస్యనోన్నతి కారకః।
రథ్యాంబుజాహ్నవీసంగా త్త్రిదశైరపి వంద్యతే॥ ౧౭౮

తా॥ సర్వోత్తముల సంబంధము యెవనికి గొప్ప తనమును గలుగ జేయదు వానచే వీధులలో బారుచున్న నీరు గంగలో గలసిన దేవతలచేత గూడ పూజింపబడుచున్నది గదా.

శ్లో॥ యథోద యగిరౌద్రవ్యం సన్నికర్షేణ దీప్యతే।
తథా సత్సన్నిధానేన హీనవర్ణోపి దీప్యతే॥ ౧౭౯

తా॥ ఉదయపర్వతమందు సూర్యసంపర్కముచేత అక్కడ నుండెడివస్తువులు యెట్లు ప్రకాశింప బడుతున్నవో నటులనే సాధువుల యొక్క సంబంధముచేత తక్కువజాతివారును ప్రకాశించుచుదురు గదా.

శ్లో॥ కీటోపి సుమనస్సంగా దారోహతి సతాంశిరః।
అశ్మాపియాతిదేవత్వం మహద్భిస్సుప్రతిష్ఠితం॥ ౧౮౦

తా॥ తుమ్మెదలున్ను పుష్పముయొక్క సంబంధము చేత సజ్జనుల యొక్క శిరస్సు నెక్కుతున్నవి రాళ్లును సజ్జనులచేత ప్రతిష్ఠితమైనందు వల్ల అవిన్ని దేవత్వమును పొంది పూజింపబడుచున్నవి.

శ్లో॥ మాతాప్యేకాపితాప్యేకః మమతస్యచ పక్షిణః।
అహం మునిభిరానీత స్సచానీతః కిరాతకైః॥ ౧౮-౧

శ్లో॥ గవాశ నానాం సశృణోతి వాక్యం
అహం హి విద్వాన్ పఠితం మునీనాం।
నతస్య దోషో నచమే గుణోవా
సంసర్గజా దోష గుణా భవంతి॥ ౧౮-౨

తా॥ ఒకయడవిన వకకంచెలో కట్టినగూటిలో రెండుచిలుకలు పెరుగుచుండగా గాలివానచే గూడుచెడిపోను నొక చిలుకపిల్లకంచెరు నావలబుషుల యాశ్రమమందుపడెను యింకొకచిలుక చెంచువారిచేత చిక్కెను రుషులచే నొకచిలుక పెంచబడుచున్నది కిరాతకులచే నొక చిలుక పెంచబడుచున్నది యిట్లుండ వకదినమున వక విప్రుడు ద్రవ్యము నెత్తుకొని యడవిన పోవుచుండగా బోయవారుండెడి చోటుకనుపడను నచటవారిచేపోషింపబడునా చిలుకవిప్రునిజూచి కిరాతకునిబిలచిమూట నెత్తుకొనివచ్చెడి వానిని హింసించినయెడైనను చిక్కుననిచెప్పెను అది విని యీ బ్రాహ్మణుడు భయపడి పరుగులెత్తిపోయి కొంత దూరమున నొకయాశ్రమముజేరెను నచ్చట ఋషులచేపెంచబడు నాచిలుక, వచ్చిన బ్రాహ్మణుని జూచి యతిథి సత్కారము జేయుమని తనవారిని పిలిచి చెప్పెను అంత బ్రాహ్మణుడు చిలుకవద్దికివెళ్లి నమస్కరించి వో శుకరాజమే బోయగుడిశెలలో నొకచిలుక నన్ను చంపుమనియరచెను నీవ్వనన్నిలాగున పూజింపుమనిచెప్పెదవు వకజాతివారైన మీయిద్దరికి వ్యత్యాస గుణముగలుగుటకేమని యడిగినంతలో నాచిలుకయితనినిజూచి బ్రాహ్మణోత్తమా నిన్ను హింసించుమన్న చిలుకకు నాకు తల్లినొకతె తండ్రియు నొకడె నేను ఋషులచేతీసుకరాబడినదాననైవారియొక్క మాటలువినుచు

వారిగుణముల నవలంబించితిని నిన్ను హింసించమన్న చిలుక కిరాతకుల చే పోషింపబడి వారిగుణముల నవలంబించినది గనుక సుగుణ దుర్గుణ ములు సంపర్కము చేతనే కలిగెవిగానున్నవి.

శ్లో॥ నస్థాతవ్యం నగంతవ్యం క్షణమప్యధమైస్సహా।
పయోపి శౌండికీహస్తే మదిరాం మన్యతే జనః॥ ౧౮౩

తా॥ క్షణకాలమైనను దుర్జనులతోకూడా పోకూడదు నుండకూ డదు యెటులనగా కల్లునమ్మెడి దాసిచేత యున్న పాలును కల్లని జను లెంచుదురు.

శ్లో॥ తంతుస్సదంగ సంబంధా దుపవీతం బహూవహా।
సఏవా సత్ప్రవిష్టస్తు కౌపీనమితి నింద్యతే॥ ౧౮౪

తా॥ నూలు వృత్తమూంగ సంబంధమువలన యజ్ఞోపవీతమని ప లుమారు బహు మానింప బడుచున్నది యానూలె యధమమైన యంగ సంబంధముచే కౌపీనమని నిందించ తగినదిగా నున్నది.

శ్లో॥ పాపాపహస్తా పనివార కశ్చ
కోపాపహస్తాప సతాప్రదాతా।
చిత్తోల్ల సన్మత్త గుణ ప్రభేత్తా
సత్సంగ మోది త్సతి కిం నలోకే॥ ౧౮౫

తా॥ సత్సహవాసము పాపమును కోపమును సంసారతాపత్ర యమునుపోగొట్టినదై మహర్షులయొక్క రీతిని గలుగజేసి చిత్తమందున్న రాజస గుణమును పోగొట్టినదై లోకమందు దేనిని నివ్వదు సర్వము నిచ్చునని భావము.

—(*) స్థానమాహాత్మ్యం. (*)—

శ్లో॥ ఆసీః పూర్వం విమలజలధౌ మండనం భూపతీనాం।
నారీణాంచ ప్రబల మకుటే కాంచనేన ప్రసంగాత్॥
తంత్రీబద్ధః కథమిదమహో కాచఖండేనసార్ధః
ఓతోఃకంఠే మరకతమణే కామవస్థాంగతోసి॥ ౧౮౬

తా॥ మొదట సముద్రమందు కలిగితివి అటువెనక బంగారముతో సంబంధమువలన రాజులయొక్కయు స్త్రీలయొక్కయు గొప్ప కిరీట మందు అలంకారముగానుంటివి ఆవలగాజుపూసలతో జేరి దారములో గూర్చ బడినదానవై పిల్లికంఠమందు ఓమరకతరత్నమా యేమికష్టదశ ను బొందుచున్నావు.

శ్లో॥ గుణైస్సర్వజ్ఞ కల్పోపి సీదత్యేకో నిరాశ్రయః।
అనర్ఘ్యమపిమాణిక్యం హేమాశ్రయ మపేక్షతే॥ ౧౮౭

తా॥ మంచిగుణములచేత సర్వజ్ఞునితో సమానుడయ్యును ఆశ్ర యములేనియెడల ఉపద్రవపడుచున్నాడు మాణిక్య మెంతవెలగలదైనను బంగారముతో చేరుట నపేక్షించుచున్నది.

శ్లో॥ మంక్యన్తే కుసుమైః కచాశ్శిరసిచేద్ధ్వస్తాః జహత్యేవతాః।
భర్తృష్టా భర్తృ పదాద్వధూర్య దివచో వైస్వర్యమేత్యేవహా।
స్రస్తా సాళి శిలాఽర్చకాద్యది ఫలగ్రావత్వమాపద్యతే।
తత్త్స్థాన విశేషతస్సులభతే వైచ్యంజనశ్చోన్నతిం॥ ౧౮౮

తా॥ వెంట్రుకలు తలయందున్నయెడల పుష్పములచే నలంకరించ బడుచున్నవి పతియున్నచోటునవాసము వనితవదలినయెడల జనాపవా దమును బొందనేపొందుచున్నవి సాళగ్రామము అర్చకునిచెయ్యి జారిన యెడల పలంరాయివలెనగుచున్నది గనుక ఆయాస్థానవిశేషముచేతనే జనులు హెచ్చుతగ్గులనుపొందుచున్నారు.

శ్లో॥ వారిజే వారిణాహీనే వైరిణో హ్యనుకూలినః।
నిజస్థాన విహీనేన దేవస్యాపి నభావుకః॥ ౧౮౯

తా॥ పద్మము తనచోటైన నీటినొదిలినవెనుక తనకనుకూలురైన సూర్యుడు వాయువు మొదలైనవారున్ను తనకు విరోధములగుచున్నారు గనుక దేవతకున్ను తనచోటువదలిన సుఖముగలుగదు.

—(*) లక్ష్మీస్వభావః. (*)—

శ్లో॥ లక్ష్మీకుమస్వ వచనీయమిదం దురుక్తమన్ధీభవంతి పురు

పాస్త్వదుపాసనేన। నోచేత్కథం కమలపత్ర విశాల
నేత్రో నారాయణస్స్వపితి పన్నగ భోగితల్పే॥ ౧౯౦

తా॥ ఓలక్ష్మీదేవీ నేనుచెప్పెడి యీచెడ్డమాటలనువిని కోపగించుకొనక క్షమించుము నిన్నుకొలచుటచేత జనులు కనులుగానని వారగుచున్నారు అట్లుగానియెడల తామర రేకువలె విశాలమైన నేత్రముగలిగిననారాయణుడున్ను ఆదిశేషునిచే గల్పింపబడిన పడకయందెల్లప్పుడున్ను నిద్ర నే బోవుచున్నాడు.

శ్లో॥ హేలక్ష్మి క్షణికే స్వభావచపలే మూఢే చపాపేఽధమే।
నత్వంచోత్తమ పాత్రమిచ్ఛసి ఖలే ప్రాయేణదుశ్చారిణి।
యే దేవార్చన సత్యశౌచ నిరతాయేచాపి ధర్మేరతాః।
తేభ్యోలజ్జసినిర్దయే గతమతిర్నీచో జనోవల్లభః॥ ౧౯౧

తా॥ ఓలక్ష్మి క్షణకాలములో మారెడుదాన చంచలస్వభావముతో గూడినదాన జ్ఞానహీనురాల పాపముతోగూడినదాన తక్కువైనదాన సత్పాత్రమునుగోరక సాధారణముగ చెడ్డనడతగల దుష్టునియందు ప్రియపడుచున్నావే యెవరు దేవపూజయందు సత్యమందు నాచారమందాసక్తిగలిగియున్నారో యెవరుధర్మమందు ప్రియముగలవారోనట్టివారికై సిగ్గును జెందుచున్నావు వోదయలేనిదానా బుద్ధిహీనుడైన అధముడు నీకు యజమానుడగుచున్నాడుగదా.

శ్లో॥ శూరంత్యజామి వైధవ్యాదుదారం లజ్జయాపునః।
సాపత్న్యాత్పండితమపి తస్మాత్కృపణ మాశ్రయే॥ ౧౯౨

తా॥ విధవ భావముండుటవలన పరాక్రమవంతుని విడుచుచున్నాను అక్కడక్కడ నన్నొప్పగించుటవలన దాతనువిడుచుచున్నాను సరస్వతియనెసవతి పోరాటంచేత పండితునివిడుచుచున్నాను గనుక పైచెప్పినవారికంటె కృపణుడునాకుపయుక్తుడని వానిని ఆశ్రయించుచున్నాను. (విధవభావమనగా) విగతోధవోయస్యాసః విధవః తనకంటె వేరుపరాక్రమవంతుడులేనందున తానే యజమానుడని భావము.

శ్లో॥ గుణేనం జనమాలోక్య నిజబంధనశంకయా।
రాజన్ లక్ష్మీః కురంగీ వదూరం దూరం పలాయతే॥ ౧౩

తా॥ గుణవంతుడైన మనుజునిజూచి తననుగూడా కట్టివేసునని శంకచేత ఓరాజా లక్ష్మి జింకవలె దూరముగా పరుగులెత్తుచున్నది.

శ్లో॥ పద్మేమూఢ జనేదదాసి హిధనం విద్వత్సుకిం మత్సరః।
నాహంమత్స రిణీనచాపి చపలా నైవా స్తిమూర్ఖేరతిః।
మూర్ఖేభ్యో ద్రవిణందదామి నిపుణంత త్కారణంశ్రూయతాం।
విద్వాన్ సర్వ జనేషుపూజితతనుర్మూర్ఖస్యనాన్యాగతిః॥ ౧౪

తా॥ఓలక్ష్మి మూఢులకొరకె ద్రవ్యమునిచ్చుచున్నావు విద్వాంసుల యందు నీకేమి విరోధము యని కవియడుగగా లక్ష్మిదేవి చెప్పుచున్నది నాకువిరోధములేదు చపలస్వభావములేదు మూర్ఖునియందు నాసక్తి యులేదు యెల్లప్పుడు మూర్ఖులకేధనమిచ్చుచున్నానె యాకారణమును వినుడు విద్వాంసుడు సర్వజనులయందును పూజించబడును మూఢునికి వేరేగతిలేదు గనుక వానికినిచ్చుచున్నాను.

శ్లో॥ రత్నాకరస్తవపితా కమలేనివాసో భ్రాతాసుధామయ తనుః పతిరాది దేవః। కేనాపరేణకమలె బతశిక్షితాని సారంగ భృంగకుటిలా నివిచేష్టితాని॥ ౧౫

తా॥ నీకు రత్నప్రభువైన సముద్రుడుతండ్రి పద్మమందు వాసము యమృతమయుడైన చంద్రుడు నీకు సహోదరుడు పరమాత్మనీకుభర్త జింకలవలె తుమ్మెదలవలె అతిచంచలములైన నీనడవడికెలను యెవరుగువా డెవడు వోలక్ష్మి నీకుశిక్షించి కలగజేసెను.

శ్లో॥ హర్తుర్బంధు జనాన్ధనార్థమనఘాన్ గంతుః పరస్త్రీశతం।
రంతుర్జంతు విహింసకైస్సహజనైస్సంతుష్యతో వంచకైః।
వక్తుస్తీక్ష్ణ మయుక్తమేవ వచనంపక్తుర్నితంచోదనం।
నిత్యంనృత్య సిమంధరేషుకమలె క్వత్యంతవైతన్మతం॥ ౧౬

తా॥ బంధుజనులను హింసించెడివానియొక్క, ధనముకై పాపము లేనివానివద్ద నపహరించపోయెడివానియొక్క, పరస్త్రీలను చేరెడువాని యొక్క, కపటవంతుడైన ప్రాణి హింసకులతోచేరి సంతోషించెడు వానియొక్క, పరుషముగా అసందర్భముగా పదరెడువానియొక్క, కృప ణునియొక్క, గృహములయందు కోలాహలముతో నెల్లప్పుడు క్రీడించు చున్నావె నీకీమత మచటనుండి రాబడినది.

శ్లో॥ పీతోగస్త్యేనతాతశ్చ రణతలగతో వల్లభోన్యేనరోషా।
దాబాల్యా ద్విప్రవర్యైస్స్వ వదనవివరేధారితావైరిణీమే।
గేహంమేఛ్ఛేదయంతి ప్రతిదివసమహో దేవపూజానిమిత్తం।
తస్మాత్ఖిన్నాసదాహంద్విజకులసదనంనాథనిత్యంత్యజామి॥ ౧౭

తా॥ అగస్త్య మహామునిచేత మాతండ్రియైన సముద్రుడు పాన ముచేయబడెను మరియొక విప్రుడు నాయజమానునికాలితో తన్నెను (అనగా భృగుమహర్షిచే తన్నబడెను) బాల్యము మొదలుకొని నాకు విరోధియైన యాడుది (అనగాసరస్వతి) భూసురులచేముఖమందుధరిం పబడెను నాయింటిని దేవపూజానిమిత్తమై ఛేదించి బ్రాహ్మణులుగొని పోవుచున్నారు (అనగా తామరపువ్వులను రేకులనుదీసి పూజింతురనుట) అందువలన ఖిన్నురాలై యెల్లప్పుడు బ్రాహ్మణుల యింటిని వదలు చున్నాను.

శ్లో॥ ఉత్సాహ సంపన్నమ దీర్ఘసూత్రం
క్రియావిధిజ్ఞం వ్యసనే ష్వసక్తం।
శూరంకృతజ్ఞం దృఢసువ్రతంచ
లక్ష్మీస్స్వయం యాతినివాసహేతోః॥ ౧౮

తా॥ ఉత్సాహముతో గూడినవాడును అమృతమైననుఆలస్యమైన విషమాను గనుక ఆలస్యములేకనే కార్యమును ముగించువాడును కా ర్యాకార్యములయొక్క రీతిని తెలిసిన వాడును దుఃఖములయందంటని వాడును పరాక్రమశాలియును చేసినవుపకారమును మరవనివాడును

దృఢమైన స్నేహముగలవాడునునగు నొకమనుజునిగూర్చి లక్ష్మి నచట వసించుటకై తానుగానేపోవును.

శ్లో॥ అవ్యవసాయి నమలసందైవ పరంసాహసాచ్చపరిహీనం।
ప్రమదాపతి మివవృద్ధం నేచ్ఛతి లక్ష్మీరుపస్థాతుం॥ ౧౯౯

తా॥ ఉద్యోగములేనివానిని మందుని దేవవిరోధిని తెంపులేనివానిని యాడుది వృద్ధుడైనమగనివలెనే లక్ష్మీదేవి దగ్గిరనుండుట కిచ్ఛయించదు.

శ్లో॥ ఆలస్యంస్త్రీసేవాసరోగతా జన్మభూమి వాత్సల్యం।
సంతోషో భీరుత్వం షడ్వ్యాఘాతా మహత్వస్య॥ ౨౦౦

తా॥ మందతనముసదా యాడుదానితో ప్రొద్దుబుచ్చుటయురోగముగలిగియుండుట పుట్టినచోటనే యుండవలయు నీయాశ అధికముగా తృప్తిపడడము నెందునను భయపడడము యీయారున్ను సంపదబొందుటకు విరోధములనిభావము.

శ్లో॥ యత్రాభ్యాగతదానమాన చరణ ప్రక్షాళనంభోజనం।
సత్సేవా పితృదేవతార్చన విధిస్సత్యంగవాం పాలనం।
ధాన్యానా మపిసంగ్రహోనకలహశ్చిత్తానురూపాప్రియా।
హృష్టాప్రాహ హరింవసామి కమలాతస్మిన్గృహేనిశ్చలా॥ ౨౦౧

తా॥ ఎచట నభ్యాగతులకొరకై యీవియు పూజపాదప్రక్షాళనతోగూడిన భోజనమును సాధు సాంగత్యము పితృదేవతల బూజించుట సత్యముగో సంరక్షణధాన్యములు భద్రపరచుట కలహము లేకుండుట మనస్సు కనుకూలమైనభార్యయు యివి యెక్కడనున్నవో నచట చంచలములేనిదాననై స్థిరముగ నుంటున్నానని లక్ష్మీదేవి విష్ణువుతో చెప్పెను.

శ్లో॥ కృష్ణఃక్రీడితవాన్గోభిరితిగో తుల్యబుద్ధిషు।
పక్షపాత వతీలక్ష్మీ రాస్తేదేవీపతివ్రతా॥ ౨౦౨

తా॥ కృష్ణుడు గోవులతోకూడా క్రీడించినాడని పక్షపాతముతో

గూడినలక్ష్మి పతివ్రతయైనందున గోవువలె మందబుద్ధులైనవారియందు వుంటున్నదని కవిపరిహాసించుచున్నాడు.

—(*) భోగాద్యస్థిరత్వం. (*)—

శ్లో॥ ఆయుర్వాయు చలత్ప్రదీపఇవసా సంపత్సుచక్రక్రమా।
భోగారోగ సమాకులా బహువిధాన స్థావరం యౌవనం।
చిత్తంమత్త పిశాచబద్ధ కపివత్కాయస్త్వపాయాశ్రయః।
తస్మాత్ప్రీష్మా పరాయణా భవతభోమా యామయేమారతాః॥

తా॥ ఆయుస్సామము గాలిచే కదలెడు దీపమువలెనుండెడిది సంపదయోచక్రమువలె హెచ్చుతగ్గుతో దిరుగెడిది కామాది భోగములో రోగములతో కూడినవి యౌవనము స్థిరమైనదికాదు మనస్సోకల్లుత్రావి పిశాచముపట్టిన కోతివలెనుండెడిది శరీరమో మోసమునుజెందే యున్నది గనుక వోజనులారా బ్రహ్మానందాసక్తిగలవారుగానుండుడు మాయామయమైన యీసంసారమందు ప్రియముగలవారు గాబోకుడు.

శ్లో॥ వైరాగ్యభాగ్యం హివిశేషభోగ్యం సంసారచక్రే హత సారవక్రే। జాయాది మాయాధికృతంత్వమేయాత్ప్రియా దవాయాధనమో స్త్వమోహం॥ ౨౦౪

తా॥ విరక్తియనెడి సంపదనే విశేషముగా అనుభవించ తగినది యేలననగా సారములేకపోయి వంకరైన సంసారమనేపేరుగల సంసారచక్రమందు మాయచేత నేర్పడిన భార్య మొదలగునవి నివృత్తిలేక మితములేనివి గనుక అజ్ఞానము పొందకనే యదుకులమందుద్భవించిన పరమాత్మకొరకు ప్రణామము కలుగని.

శ్లో॥ విషమాశ్వా ఇంద్రియాణి ఛిన్నోఽరశ్మిశ్చ మానసం।
బుద్ధిర్నియన్తా సందేహీరథీదేహీ కథంవ్రజేత్॥ ౨౦౫

తా॥ ఇంద్రియములనెడి గుఱ్ఱములు విపరీతగతి గలిగినవి మనస్సనేకళ్లెము తెగిపోయినది బుద్ధియనెడి సారధిగుఱ్ఱమును నడిపించడమందు సందేహముగలవాడు ఇట్లుండగా జీవుడనెరధిఉడెట్లు పోయిచేరును.

శ్లో॥ భోగేరోగభయంకులేచ్యుతిభయంవిత్తే నృపాలాద్భయం।
మానేదైన్యభయంబలే రిపుభయం రూపేతరుణ్యా భయం।
శాస్త్రేవాదభయంగుణే ఖలభయంకాయే కృతాంతాద్భయం।
సర్వంవస్తుభయాన్వితంభువినృణాం వైరాగ్యమేవాభయం॥ ౧౮౬

తా॥ సంభోగాదులయందు రోగభీతిన్ని కులమందు జాతిభ్రష్టత్వభయమున్ను ద్రవ్యమునందు అధికముగా కప్పములగట్టమని రాజులు గొనిపోదురనే భయమున్ను అభిమానమందు దైన్యముగలదనే భయమున్ను బలమందు శత్రుభయమున్ను సౌందర్యమందు స్త్రీలనేతభయమున్ను శాస్త్రమునందు వాదమువచ్చుననేభయమున్ను గుణమునందు దుర్జనునిచే భయమున్ను శరీరమందు యమునిచే భయమున్ను యిట్లు భూలోకమందు అన్నివస్తువులు భయముతో గూడినవేను వైరాగ్యమొకటే భయము లేనిది.

—(*) జరాప్రకరణం. (*)—

శ్లో॥ కృతాంతస్యదూతీ జరాకర్ణమూలే
సమాగత్య వక్తీతిలోకాశ్శృణుధ్వం।
పరస్త్రీ పరద్రవ్య వాంఛాంత్యజధ్వం
భజధ్వం రమానాథ పాదారవిందం॥ ౧౮౭

తా॥ యమునియొక్క దూతికయైన ముసలితనమువచ్చి చెవివద్ద చెప్పుచున్నది యేమనగా ఓజనులారా నామాటవినండిపర స్త్రీలయందు పరద్రవ్యమందాశవిడువుడు భగవంతుని పాదములనుభజింపుడు.

శ్లో॥ వ్యాఘ్రీవతిష్ఠతి జరాపరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవఇవ ప్రహరన్తి దేహం।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభః
లోకస్తథాప్యహిత మాచరతీతి చిత్రం॥ ౧౮౮

తా॥ ముసలితనము మనలను భయపెట్టుచూ పులివలెనున్నది. రోగములు శత్రువులవలె శరీరమును గొనిపోవుచున్నవి పగులుగల కుండ

నుం డెడినీటివలె ఆయుష్యము కారిపోవుచున్నది ఈరీతిగానున్నను జనము దుష్కృత్యము నాచరించుచున్నదనెడిది చిత్రము.

శ్లో॥ గాత్రంసం కుచితంగతి ర్విగళితా భ్రష్టాచ దన్తావళీ।
దృష్టిర్నశ్యతి వర్ధతే జధిరతావక్త్రంచలాలాయతే।
వాక్యంనాద్రియతేచ బాంధవజనై ర్భార్యాన శుశ్రూషతే।
హాకష్టం పురుషస్యజీర్ణ వయసః పుత్రోప్యమిత్రాయతే॥ ౨౦౯

తా॥ శరీరము ముడతలుపడి తగ్గిపోయెను దన్తపఙ్క్తి జారిపోయెను చూపుతగ్గెను చెవుడు వృద్ధిపొందుచున్నది ముఖము చొంగమయమాయెను మాటనుబంధువులుగూడా ఆదరించరు భార్య యుపచారము చెయ్యదు వోహోయంతకష్టము పుత్రుడుగూడా శత్రువగుచున్నాడు.

శ్లో॥ మలినైరలకై రేతై శ్శుక్లత్వం ప్రకటీకృతం।
తద్రోషాది వనిర్యాతా వదనాద్ర దనావళిః॥ ౨౧౦

తా॥ నలుపైన యీవెంట్రుకలచేత నాతెలుపుచూపింపబడెనని ఉరోషంచేతవలెనే దంతవరసన్నైనది ముఖమునందుండిక్రిందపడుచున్నది.

శ్లో॥ శ్రుతిశ్శిథిలతాంగతా స్మృతిరపి ప్రణష్టాధునా।
గతిర్విపథమాగతా విగళితా ద్విజానాంతతిః।
గవామపిచ సంహతిస్సముచితక్రియా తచ్చ్యుతా॥
కృతానుజరయాతయా కలియుగస్యసాధర్మ్యతా॥ ౨౧౧

తా॥ చెవ్వుచెడిపోయినది జ్ఞాపకము తప్పిపోయినది నడకతడబడి మారిపోయినది పలువరుస జారిపోయినది యింద్రియముల సమూహములు తగుధర్మములనుండి వదిలిపోయినవి యీప్రకారము ముసలితనముచేత కలియుగసమానమేర్పడినది గదా (అనగా) శ్రుతి = వేదము. స్మృతి=ధర్మశాస్త్రము. ద్విజానాం=బ్రాహ్మణులయొక్క. గవాం=ఇంద్రియములయొక్కయని రెండవయర్థము. అగుటచేతకవిసామ్యము.

శ్లో॥ వదనం దశనవిహీనం వాచోన పరిస్ఫుటా గతాశక్తిః।
అవ్యక్తేంద్రియశక్తిః పునరపిబాల్యం కృతంజరయా॥ ౨౧౨

తా॥ ముఖము దంతములులేనిది మాటలు తడబడుచున్నవి శక్తి యోలేదు ఇంద్రియపటుత్వము కనుపడలేదు గనుక ముసలితనముచేత మరల బాల్యము గలిగెను.

శ్లో॥ ఇయత్యా మపిసామగ్ర్యాం సుకృతం నకృతంత్వయా।
ఇతీవకుపితోదన్తా నంతకః పాతయత్యలం॥ ౨౧౩

తా॥ దేవునిచూచుటకుకన్నులు మంచిచరిత్రములువినుటకు చెవులు క్షేత్రమునకుపోవుటకు పాదములు యిటువంటిసామగ్రియుండను నీచేత పుణ్యముచేయబడలేదు గదా యనికోపించుకొనేమి యముడుదంత ములను పగలగొట్టినాడు యింతపనివీరికిచాలు.

శ్లో॥ శతమన్యుం దండధరం కుబేరమపిశూలినం తథాగదినం।
కురుతేజరానసాకిం కుర్యాన్నిరూప నామకమ్మనుజం॥ ౨౧౪

తా॥ పేరువూరులేని మనుష్యుని ముసలితనము యింద్రునిగా యమునిగా కుబేరునిగా శివునిగా విష్ణువుగాను చేయుచున్నది అట్టి యీ ముసలితనము యింకానేమిచేయదు. (అనగా) అధికకోపముగల వానినిగా చేతకొయ్యగలవానిగా శరీరముగలవానిగా శూలరోగముగలవానిగా యింకా అనేకరోగములతో గూడినవానిగా చేయుచున్నదని భా.

శ్లో॥ స్థూలప్రావరణోతివృత్తకథకః కాసాశ్రులాలావిలో
భగ్నోరః కటిపృష్ఠజానుజ ఘనోమ స్థోతిధీః వారయన్।
శృణ్వన్ ధృష్టవధూవచాం సిధనుషా సంత్రాస యన్వాయసా
నాశాపాశ నిబద్ధజీవ విభవో వృద్ధో గృహేగ్లాయతి॥ ౨౧౫

తా॥ ముతకగుడ్డ కప్పుకున్నవాడై జరిగిపోయిన పాతకథలను చెప్పుచు,దగ్గు, కన్నీరు,జొల్లు, వీటిచేత అభస్మారకుడైవదిలిన రొమ్మునడుము వీపు మోకాలు పిరుదులు మొదలయిన వాటితోకూడి జ్ఞానము లేక నతిథిజనులనడ్డగించుచు మదించిన యాడువారియొక్క కఠినపుమాటలను వినుచు కాకుల విల్లుచే భయపెట్టుచు ఆశయనేతాడుచే కట్టబడిన జీవముగలవాడై వృద్ధుడు గృహమందు లంపట జెందుచున్నాడుగదా.

## —(*) సంసారప్రకరణం. (*)—

శ్లో॥ అసారేఖలు సంసారే సారమేతచ్చతుష్టయం।
కాశ్యాం వాసస్సతాంసంగో గంగాంభో విష్ణుసేవనం॥ ౨౧౬

తా॥ ఫలములేని యీసంసారమందు నాలుగు సంగతులే ప్రయోజనములయినవి. యేవియనగా కాశిలోవసించడము సత్పురుషుల సహవాసము గంగాతీర్థము విష్ణువును సేవించడము.

శ్లో॥ అసారేఖలు సంసారే సారమే తానిషట్కిల।
గీతా గంగా గురుర్గోష్ఠి గాంగేయీచ గవార్చనం॥ ౨౧౭

తా॥ సారములేని యీసంసారమందు యీయారే ప్రయోజనముగలవి అవియేవియన గీతాపారాయణము గంగాస్నానము గురుశుశ్రూష సాధు సమాజము. (భారతము నందలి) భీష్ముని కథయు గోపూజయును.

శ్లో॥ క్వచిద్విద్వద్గోష్ఠి క్వచిదపిసురామత్త కలహః
క్వచిద్వీణావాదః క్వచిదపిచహాహేతిరుదితం।
క్వచిద్రమ్యా రామాక్వచిదపి జరాజర్ఝరతనుః
నజానేసంసారః కిమమృతమయః కిం విషమయః॥ ౨౧౮

తా॥ ఒకచోట పండితులసభ మరియొకచోట కల్లుదాగికలహించుకొనుట నొకచోట వీణావాదము యొకచోట కుయ్యోమొఱ్ఱో యనియేడ్చుట నొకచోట సుందరమైన స్త్రీయుండుట నింకొకచోట వృద్ధాప్యముచే తగ్గిపోయిన శరీరముండుట యిట్టివిషమముతోగూడిన సంసారమమృతమయమైనదా విషమయమైనదా నేనెరుగను.

శ్లో॥ కృచ్ఛ్రేణామేధ్యమధ్యే నివసితతనుభిః స్థీయతేగర్భగతైః
కాన్తావిశ్లేషదుఃఖ వ్యతికరవిషమేయావనే విప్రయోగః।
నారీణామప్య వజ్ఞావిలసతినియతం వృద్ధభావోప్య సాధుః
సంసారేరేమనుష్యావదతయదిసుఖంస్తోకమప్యస్తికించిత్॥ ౨౧౯

తా॥ కష్టముతో అశుద్ధముతోగూడిన గర్భమనేపల్లమందు మావి

మొదలగు త్రాళ్లతో కట్టుబడియుండడమున్ను భార్యమొదలగు వారియ డబాటుచేత యేర్పడిన విపరీతమయిన సంకటముతో కూడిన యౌవన మందు కష్టపడుతూ నుండడము వృద్ధాప్యమునందున్ను స్త్రీల యొక్క అవమానమున్ను నవశ్యముగా నేర్పడుచున్నది. గనుక నెప్పుడున్ను వృత్తమయినది కాదు యిట్లున్నందున వోమనుజులారా సంసారమందెప్పుడైనను యించుకంత సుఖమున్నదా చెప్పుడు.

—(*) బవజయోపాయః. (*)—

శ్లో॥ ప్రాణాఘాతాన్నివృత్తిః పరధనహరణేసంయమ స్సత్యవాక్యం।
కాలేశక్త్యాప్రదానం యువతిజనకథా మూకభావః పరేషాం।
తృష్ణాస్రోతో విభంగో గురుషుచవినయ స్సర్వభూతానుకంపా।
సామాన్య స్సర్వశాస్త్రే ష్వనుపహతవిధిః శ్రేయసామేషపంథాః॥

తా॥ ప్రాణబాధనుండి నివర్తింపజేయడమున్ను యితరుల ద్రవ్యము నపహరించుటయందు మనస్సను ప్రవేశింప జేయకుండుట సత్యముగా పలుకుట తగుకాలమునందు శక్తికొలదియిచ్చుట యితరులయొక్క యౌవన స్త్రీల చరిత్రమందు మూకవానివలె నుండుట ఆశయనే ప్రవాహము నాటంకపరుచుట గురువులయందు భక్తియుంచుట సర్వశాస్త్రముల యందు నిరాటంకమయిన అనుష్టానముండుట యివి మంచిగతుల కుపాయములు.

—(*) కాలః. (*)—

శ్లో॥ వ్యోమైకాన్త విహారిణోపి విహగా స్సంప్రాప్నువన్త్యాపదం।
బధ్యన్తేనిపుణైరగాధ సలిలాన్మత్స్యా స్సముద్రాదపి।
దుర్నీతం కిమిహాస్తి కింసుచరితం కస్థానలాభే గుణః।
కాలోహి వ్యసన ప్రసారిత కరో గృహ్ణాతి దూరాదపి॥ ౨౨౧

తా॥ పక్షులాకాశమునందు యేకాంతముగా తమపాటికి సంచరించుచున్నవైనను ఆపదను పొందుతున్నవి మత్స్యములు మహాలోతైన సముద్రములో నున్నవైనను సమర్థులచేత కట్టబడుచున్నవి యీమ

త్స్యములకు యీ పక్షులకు చెడ్డపని యేమున్నది మంచిపని యేమున్నది గొప్పస్థానము నాశ్రయించినందున నేమిలాభము కాల స్వరూపియైన వాడు చింతచేత చెయి చాచుకొన్నవాడై దూరమునుండిన్ని అన్నిటి ని గ్రహించుచున్నాడు.

శ్లో॥ సారమ్యా నగరీమహాన్ సనృపతి స్సామన్త చక్రంచ తత్।
పార్శ్వేతస్యచ సావిదగ్ధ పరిషత్తా శ్చంద్ర బింబాననాః।
వున్మత్త స్సచరాజ పుత్ర నివహాస్తే వందినస్తాః కథాః।
సర్వేయస్యవశాదగా త్స్మృతిపథంకాలాయతస్మైనమః॥ ౨౨౨

తా॥ ఆపట్టణము బహురమ్యమైనది. యారాజుగొప్పవాడు. అది మండలాధిపతుల సమూహము. నాసమూహమునకు ప్రకృనపండితుల యొక్క సభనున్నది. వారలు చంద్రబింబము వంటి ముఖముగల స్త్రీలు రాజపుత్ర సమూహము వెర్రిపట్టినది వారు రాజస్తోత్రము జేసెడివారు యిట్లంతయు యేకాలముయొక్క స్వాధీనమగుటచేత హెచ్చు తక్కువ లతోతలచుట కేర్పడినదో వట్టికాలస్వరూపికి నమస్కారము.

శ్లో॥ యత్రానేకే క్వచిదపి గృహేతత్ర తిష్ఠత్యథైకో
యత్రాప్యేక స్తదనుబహవ స్తత్రనైకోప చాంతే।
ఇత్థంచేమౌ రజనిదివసౌ దోలయన్ ద్వావివాక్షౌ
కాలః కాల్యా భువనపలకే క్రీడతి ప్రాణిసారైః॥ ౨౨౩

తా॥ ఏ యింటియందనేకులుండిరో అవెనకా యింటియందు వక డే యుంటున్నాడు యెచ్చోట వొక డుండెనో అనంతరం బహుమంది గలిగి కడపట యొకడైన లేకపోవుచున్నాడు యీప్రకారము రాత్రిపగ లునే వుయ్యాలకొలుసులను ప్రాణి సమూహముచేత పూగించుకొనుచు లోకమనే పలకయందు మాయయనే స్త్రీతోకూడా కాలపురుషుడు క్రీడించుచున్నాడు.

శ్లో॥ అశనంమే వసనం మేజాయాచమే బంధువర్గో మే।
ఇతిమేమే కుర్వాణం కాలవృకోహ న్తి పురుషాజం॥ ౨౨౪

తా॥ యీ భోజనపదార్థము నాదే వస్త్రమునాదే యీబంధుసమూహము నాదేయని సాదినాదియనిచేయుచున్న (చెప్పుచున్న) పురుషుడనే మేకను కాలమనెడి తోడేలుగొని పోవుచున్నది.

శ్లో॥ అప్సుప్లవంతే పాషాణా మానుషా ఘ్నంతి రాక్షసాన్।
కపయః కర్మ కుర్వంతి కాలస్య కుటిలాగతిః॥ ౧౧౫

తా॥ మునిగి పొయ్యెడి రాళ్లు నీళ్లలో తేలుచున్నవి రాక్షసులకాహారమయిన మనుష్యులు వార్లనేచంపుతున్నారు కోతులు పనిచేయుచున్నవి ఆహాకాలగతి యెంత వంకరైనది.

శ్లో॥ క్షమాశస్త్రం కరేయస్య దుర్జనః కింకరిష్యతి।
అతృణే పతితోవహ్నిః స్వయమేవోప శామ్యతి॥ ౧౧౬

తా॥ ఓర్పనెడి యాయుధముచేత యుండను దుర్జను డేమిచేయబోవుచున్నాడు కాలుటకుపయోగములైన గడ్డి మొదలయినవి లేనిచోట పడిననిప్పు తానుగానె చల్లారి పోవుచున్నది.

శ్లో॥ ఆజన్మసిద్ధం కౌటిల్యం ఖలస్యచ హలస్యచ।
సోఢుంతయోర్ముఖాక్షేప మలమేకైవ సాక్షమా॥ ౧౧౭

తా॥ దుర్జనుడికిన్ని నాగేటికిన్ని తాను పుట్టినది మొదలు వంకరనే ఆయిద్దరియొక్క ముఖమందున్న యాక్షేపము వోర్చుకొనుటకు క్షమయొకటెవినా యింకొకదానివల్ల కాదు.

శ్లో॥ నరస్యాభరణం రూపం రూపస్యాభరణంగుణః।
గుణస్యాభరణంజ్ఞానం జ్ఞానస్యాభరణంక్షమా॥ ౧౧౮

తా॥ పురుషునికి రూపమలంకారము రూపమునకు గుణమలంకారము గుణమునకు జ్ఞానమలంకారము జ్ఞానమునకు వోర్పలంకారము.

శ్లో॥ క్షమాబలమశక్తానాం శక్తానాం భూషణం క్షమా।

---

* (కౌటిల్యమనగా వంకర, చెడ్డతనము. క్ష్మా, భూమి)
(ఆక్షేపమనగా నిందించుట పొడుచుట)

క్షమావశీ కృతిర్లోకే క్షమయా కింనసాధ్యతే॥ ౨౨౯

తా॥ ఆశక్తులకోర్పు బలము శక్తులకోర్పు యలంకారము లోకమునుస్వాధీనముచేయునది క్షమాక్షమచేతనేమి సిద్ధించదు.

—(*) క్రోధనిందా. (*)—

శ్లో॥ శరన్మధ్యాహ్నకాలేపి క్రోధాంధ స్స్వతనూమపి।
యన్నజానాతి తత్రాస్య జ్ఞానవార్తైవకా భవేత్॥ ౨౩౦

తా॥ కోపముచేత కన్నుకనబడనివాడు శరదృతువునందలి మధ్యాహ్నకాలమందును తనయొక్క శరీరమునుగూడ యేకారణమువలన తెలుసుకోనడో అట్టికోపిష్ఠునియందు తెలివితోజేరినమాటమైనను కలుగునా (అనగా) కోపిష్ఠునకి జ్ఞానమే కలగదని భావము.

శ్లో॥ కింకుంభీ పాకఏవాయం కోపరూపేణ దేహినాం।
త్రైలోక్యేపి విపత్యర్థం అవతీర్ణో భవార్ణవే॥ ౨౩౧

తా॥ ఇదికుంభీపాకమనే నరకమాయేమి మనుష్యునియొక్క కోపమనే యాకారముతోగూడ ప్రకాశించుచున్నది, మూడులోకములందు నాపదగలుగజేయుటకై సంసారమనే సముద్రమునందు గలిగినది.

శ్లో॥ క్రోధముగ్ధధియాం పుంసాంసుఖం కాలత్రయేపిచ।
దృష్టంకదాప్యులూకానాం క్రీడనంఫుల్ల పంకజే॥ ౨౩౨

తా॥ క్రోధముచేచెడిపోయిన బుద్ధిగలిగిన వారికిసుఖము మూడుకాలములయందును లేనేలేదు. గుడ్లగూబలకెన్నడైనను తామరపూల వద్ద ఆడుచుండుట గనబడెనా లేదు.

—(*) క్షుధా. (*)—

శ్లో॥ ఆదౌరూప వినాశినీ కృశకరీ కామాంకురచ్ఛేదినీ।
పుత్రామిత్ర కళత్రభేద నకరీ గర్వాంకురచ్ఛేదినీ।
కామంమందకరీ తపఃక్షయకరీ ధర్మస్య నిర్మూలినీ॥
సామాంసంప్రతి సర్వరోగ జననీ ప్రాణాపహంత్రీ క్షుధా॥

తా॥ ఆకలియైనది ఆకారమును పాడుచేయుచున్నదిఅటువెనక

కృశింపచేయుచున్నది. కామోద్రేకమును అణచుచున్నది పుత్రులను శత్రువులకుటుంబమునుండి వలెవేరు చేయుచున్నది. గర్వమునే మొలకను కోయుచున్నది. మిక్కిలి జఠరాగ్నిని తగ్గించుచున్నది. తపస్సును క్షీణింపచేయుచున్నది. ధర్మమును చెరుచుచున్నది. ప్రాణముల పోగొట్టుచుండెడిదిన్ని అనేకరోగములు కలగజేయుచుండె. అట్టియాకలియైనది యిప్పుడునన్ను బాధించుచున్నదియని భావము.

శ్లో॥ నాస్తిక్షుధాసమందుఃఖం నాస్తిరోగక్షుధాసమః।
నాస్త్యాహార సమంసౌఖ్యం నాస్తిక్రోధ సమోరిపుః॥ ౨౩౪

తా॥ ఆకలితోసమానమైన దుఃఖము వేరేలేదు. ఆకలితోసమానమైనరోగము వేరేలేదు ఆహారమునకంటె వేరేసౌఖ్యములేదు. కోపమునకంటెవేరేశత్రువులేదు.

—(*) స్వభావము. (*)—

శ్లో॥ సర్వస్యహి పరిక్ష్యన్తే స్వభావానేతరేగుణాః।
అతిత్యహి గుణాన్ సర్వాన్ స్వభావో మూర్ధ్నివర్తతే॥ ౨౩౫

తా॥ అన్నిటికి స్వభావగుణములు పరిక్షింపబడుచున్నవి గాని వేరేగుణములు పరీక్షింపబడవు అన్నిగుణములను దాటి స్వభావగుణము తలయందు నిలిచియుండును.

శ్లో॥ నధర్మశాస్త్రం పఠతీతికారణం
నచాపివేదాధ్యయనం దురాత్మనః।
స్వభావఏవాత్ర తధాతిరిచ్యతే
యధాప్రకృత్యా మధురంగవాంపయః॥ ౨౩౬

తా॥ చెడ్డవానికి ధర్మశాస్త్రమును చదువుచున్నాడని ఏమిప్రయోజనములేదు వేదాధ్యయనమువల్లను ఏమిఫలములేదు వీడివిషయమున స్వభావగుణమే మిగులుచున్నది పాలకెల్లు స్వభావగుణముతీపో అటులనే దుష్టునికి వాడిచెడ్డగుణమే ప్రధానముగాయుండుననిభావము.

శ్లో॥ నిమ్నొన్నతంవక్ష్యతి కోజలానాం
విచిత్రభావం మృగపక్షిణాంచ।
మాధుర్య మిక్షౌ కటుతామరీచే
స్వభావతస్సర్వ మిదంహిసిద్ధం॥ ౨౩౭

తా॥ నీటియొక్క మిట్టా పల్లములను మృగముల యొక్క పక్షుల యొక్క విచిత్రరీతిని చెరుకుయందు మాధుర్యమును మిరియములయందు ఖారమును వకడానివల్ల కలిగెనని యెవడుచెప్పును. గనుక ఈగుణముల న్నియు స్వభావముగా నేర్పడినవేయని భావము.

శ్లో॥ వహ్ని స్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతేతత్క్షణాత్।
మేరుస్స్వల్ప శిలాయతే మృగపతే స్సంఘః కురంగాయతే।
వ్యాళో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే।
యస్యాంగే ఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి॥ ౨౩౮

తా॥ సమస్తలోకములయందు శ్రేష్ఠమైనస్వభావగుణమైన దెవని యొక్కశరీరమందు విజృంభించుచున్నదో అట్టివానికి అగ్ని జలమువలె న గుచున్నది మేరుపర్వతము గులకరాయివలెనగుచున్నది సింహములగుంపు లేళ్లగుంపువలె నగుచున్నది. సర్పము పూలమాలికవలె యగుచున్నది. విషమమృతమగుచున్నది.

—(*) పరోపకృతిః (*)—

శ్లో॥ నీరసాన్యపిరోచన్తే కార్పాసస్య ఫలానిచ (వత్) (పాఠా)।
యేషాంగుణమయం జన్మ పరేషాంగుహ్య గుప్తయే॥ ౨౩౯

తా॥ ఇతరులయొక్క రహస్యములను కాపాడుటకుగాను వేటి యొక్కపుటక, గుణమయమైనదో(అనగా గుణపూర్ణమైనదో)అట్టివి,ప త్తి పండ్లవలె రసంలేకపోయినను (అనగా ద్రవంలేకపోయినను) ప్రకా శించుచున్నవి మరియు అట్టిపత్తి ఫలములములుగూడ ప్రకాశించుచున్న వని భావము. (పత్తివిషయమున నూలుపోగులు.)

శ్లో॥ వృక్షాలాన్తిఫలానిపత్ర కుసుమస్థాణూనిఛాయాంత్వచం।
నాభించర్మ మృగాదతశ్చ కరిణో ముక్తాలతెం శుక్తికాః।
అశ్మోలూఖలఖల్వ ఘర్ఘరశిలాస్తం భార్చ్యబింబాన్యపి।
కుంభాదీనిచమృత్ పరోపకృతయే తత్స్రైణివసృజ్జత॥ ౨౪౦

తా॥ పరోపకారమునకుగాను వృక్షములు, ఫలములను ఆకులను పుష్పములను మొద్దులు మొదలైనకట్టెలను నీడను పైపట్ట నిచ్చుచున్నవి. అటులనే మృగములు జపకాలమందు కూర్చుండుటకు తోళ్ళను కస్తూరి నిచ్చుచున్నవి ఏనుగులు దంతముల నిచ్చుచున్నవి నత్తగుల్లలలో నొక విధములైన ముత్త్యపుచిప్పలు అలంకారమునకుగాను ముత్త్యముల నిచ్చుచున్నవి రాయిరోలు,కల్వము,తిరగలి,ద్వారపుకిందిరాయి,స్తంభములు,పూజించుటకుతగిన బింబముల,నిచ్చు మన్నవి. మృత్తికకుండలు మొదలైనవాటి నిచ్చుచున్నది గనుక ఓ|ప్రాణులారా పరోపకారమునకుగాను సిద్ధముగానుండుము.

శ్లో॥ వాసాయకేచిత్ వసనాయకేచిత్
ధూపాయలేపాయచ దీపనాయ।
పాత్రాయ భుక్త్యై పవనాయముక్త్యై
లోకోపకారాయ భవన్తి వృక్షాః॥ ౨౪౧

తా॥ కాపురముండుటకు కొన్ని చెట్లుపయుక్తములగుచున్నవి కొన్ని కప్పుకొనుటకు (అనగా పత్తిచెట్లు మొదలైనవి) ధూపమునకుగాను కొన్ని,వంటికిపూసుకొనుటకు కొన్ని,చమురై దీపమునకుగానుకొన్ని, పాత్రలకుకొన్ని,ఆహారమునకుకొన్ని,గాలికికొన్ని, మోక్షమునకుకొన్ని, ఏర్పడినవి ( అనగా ) విప్పచెట్లు మొదలైనవాటిచే తైలము చందనాది వృక్షములచే వాసనద్రవ్యములు మొదలైనవి చంద్రచెట్లుమొదలైనవాటిచే కమండలు మొదలైనవి వరిపంటమొదలైనవాటిచే ఆహారమును తాటి యాకులచేవిసనకఱ్ఱ మొదలైనవి ఆశ్వత్థము తులసి బిల్వము మొదలైన

వాటిచే పూజించుటలు కలుగుచున్నవి. గనుక వృక్షములన్నియు పరోపకారమునకుగానే పుట్టియున్నవని భావము.

శ్లో॥ వర్షంతి మేఘాః పశవః పయాంసి
స్వచ్ఛాని రత్నాన్య దధిః ప్రయచ్ఛతి।
గానాయ వీణాద్యుప సాధనానాం
దానాయ వేణుః బహుధోపకారీ॥ ౨౪౨

తా॥ మేఘములు వర్షించుచున్నవి పశువులు పాలను సముద్రుడు మంచిరత్నముల నిచ్చుచున్నారు దానార్థమై వెదురువీణ మొదలైన సాధనముల యొక్క నిచ్చుట కొరకు పరమోపకారముతో గూడినదైయుంటున్నది.

శ్లో॥ లోకోపకారాయ హరిః కిరిహీ
గ్రావా బభూవాథ మహాను భావః।
ఈశోపితస్మై కిలసారమేయః
జాతాః ప్లవంగా అపినాక సంగాః॥ ౨౪౩

తా॥ మహాను భావుడైన హరియు లోకోపకారమునకేగదా వరాహ రూపమును పొందెను. అదిగాక రాయిగాను నేర్పడెను అనగా (సాలిగ్రావము మొదలయిన రూపము) పరమశివుడున్న అందుకేగదా భైరవరూప మెత్తెను స్వర్గ మందుండెడి వారున్న భూమిన వానరులుగా పుట్టిరి.

శ్లో॥ లోమానివాహ్యే మవి నాశనాయ
క్షౌమాదివద్భాన్తిచ సచ్ఛిరస్సు।
ద్రవ్యాణి చాల్పాని పరోపకారైః
దివ్యాన్యనల్పాని భవన్తి సత్యం॥ ౨౪౪

తా॥ వెంట్రుకలున్న చలిని పోగొట్టుటకుగాను పీతాంబరములు మొదలయిన వాటివలె గొప్పవారి శిరస్సులయందును ప్రకాశించుచున్న

వి. అల్ప పదార్థములైనను పరోపకారముల చేత సత్యముగా గొప్ప పదార్థము లగుచున్నది.

శ్లో॥ నిష్ఠాపరావా (భువన*) ప్రవిష్టాః
శ్రేష్ఠాన భాగ స్తచ ధర్మ మార్గాన్।
సత్యో మునీనాంచ పరోపకారే
నిత్యానదీత్వం యయురేవ కాంచిత్॥ 284

తా॥ జపనిష్ఠాపరులయిన ఋషులున్ను పరోపకారప్రియులయి నందున లౌకికులై (లేకకుటుంబమందుచేరినవారై) ఉత్తమధర్మమార్గములను చెప్పిరి. కొందరు తాపసస్త్రీలు పరోపకారమందు స్థిరముగనున్నవారై నదీ రూపమును పొందిరి.

శ్లో॥ తృణంచాహం వరమన్యే నరాదనుప కారిణః।
ఘాసోభూత్వాపశూన్ పాతిభీరూన్ పాతిరణాంగణే। 285

తా॥ ఉపకారము చేయ్యని మనిజునికంటె గడ్డిపరకయైనా ఉత్తమమే ఏలననగా ఆహారమునై పశువులను కాపాడుచున్నది. యుద్ధ భూమియందు భయపడినవారిని. అనగా క్రిందపడినను దెబ్బతగలకుండునటుల కాపాడుచున్నది.

—(*) ప్రవాసః (*)—

శ్లో॥ అహోనుకష్టస్సతతం ప్రవాసః తతోతికష్టః పరగేహవాసః॥
కష్టాధికానీచజనస్య సేవాతతోతికష్టా ధనహీనతాచ॥ 286

తా॥ ఎల్లప్పుడు దేశమునుచుట్టుట ఓహో మిక్కిలి కష్టముగదా అంతకంటె కష్టము పొరుగిల్లున వసించడము. అంతకంటే కష్టమైనది అధములను కొలుచుట, అంతకంటె కష్టమైనది ధనము లేకుండుట.

శ్లో॥ తీర్థానామవలోకనం పరిచయస్సర్వత్ర విత్తార్జనం
నానాశ్చర్యనిరీక్షణం చతురతా బుద్ధిః ప్రశస్తాగిరః।

* (భవన పాఠా.)

ఏతేసన్తి గుణాః ప్రవాసవిషయే దోషోస్తి చైకో మహాన్
యస్మాన్ముగ్ధ మధురారుణాధరసుధాపానం వినాస్థీయతే॥ ౨౪౮

తా॥ దేశ సంచారమందు పుణ్యక్షేత్రములు తీర్థములు చూడడమున్ను అన్నిచోట్లలో పరిచయమున్ను ఒంతట ద్రవ్యమును సంపాదించడమున్ను అనేక వేడుకలను చూడడమున్ను, బుద్ధితీక్ష్ణమున్ను మంచి మాటలున్ను ఈగుణములన్నియున్నవి. ఐతే గొప్పదోషమున్న ఒకటి యున్నది. ఏదనగా బాలప్రాయపు కాంతలయొక్క మధురమై ఎరుపైన అధరామృతపానం వినాగా వుండడమేదో యదియని భావము.

శ్లో॥ ఆకించన్యాదతి పరిచయాజ్ఞాయయోపేక్షమాణః
భూపాలానామనను సరణాద్బిభ్యదేవాఖిలేభ్యః।
గేహేతిష్ఠన్ కుమతిరలసః కూపకూర్మస్స్వధర్మా
కింజానీతే భువనచరితం కింసుఖం చోపభుఙ్క్తే॥ ౨౪౯

తా॥ ఏమిలేకుండుటవలన అతిపరిచయమగుట వలన భార్యచేత తిరస్కరింపబడిన వాడున్ను రాజులయొక్క అనుసరణ లేకుండుటవలన అందరినుండి భయపడుచు భావిలోనున్న తాబేలులతో సమానుడైయింటియందే వసించుచు బుద్ధిలేక మందుడై దేనిని తెలుసుకొనుచున్నాడు. లోకమందేర్పడిన సుఖమును దేనిని అనుభవించుచున్నాడు.

శ్లో॥ వ్యాపారాంతర ముత్సృజ్య వీక్షమాణో వధూసుఖం।
యోగృహేష్వేవ నిద్రాతి దరిద్రాతి సదుర్మతిః॥ ౨౫౦

తా॥ మరియొకపనినివిడిచి స్త్రీసుఖమునే చూచుచున్నవాడై యెవడుగృహమందే నిద్రించుచున్నాడో వాడు దరిద్రుడే యగుచున్నాడు.

—(*) స్త్రీస్వభావః. (*)—

శ్లో॥ అనృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలోభతా।
అశుచిత్వం నిర్దయత్వం స్త్రీణాం దోషాస్స్వభావజాః॥ ౨౫౧

తా॥ స్త్రీలకుఅబద్ధముచెప్పట తెంపుచేయుట తంత్రము,మూఢతనము, అత్యాశ,అనాచారము,దయలేకుండుట, ఇవిస్వభావదోషములు.

శ్లో॥ స్త్రియోహ్య కరుణాః క్రూరాదుమర్షాః ప్రియసాహసాః।
ఘ్నన్త్యల్పార్థేఽపి విస్రబ్ధంపతిం భ్రాతరమప్యత॥ ౨౫౨

తా॥ స్త్రీలు దయలేనివారలై కఠినులై ఓర్పులేనివారై ఇష్టమైనదానియందు సాహసముతో కూడినవారై అల్పప్రయోజనమునకై నమ్మిన మగనినిగాని కూడబుట్టినవానినిగాని చంపుచున్నారు.

శ్లో॥ స్త్రియోహి నామఖల్వేతాః నిసర్గా దేవపండితాః।
పురుషాణాంతు పాండిత్యం శాస్త్రైణైవోప దిశ్యతే॥ ౨౫౩

తా॥ స్త్రీలు స్వభావముగానే పండితులుగదా పురుషులయొక్క పాండిత్యము శాస్త్రముచేతనే యేర్పడుచున్నది.

శ్లో॥ స్వాతన్త్ర్యం పితృమందిరేచ వసతిః యాత్రోత్సవే సంగతిః
గోష్ఠీపూరుష సంన్నిధాననియమః వాసోవిదేశేతథా।
సంసర్గస్సహపుం శ్చలీభిరసకృద్వృత్తే నిఃజాయాః క్షతిః
పత్యుర్వార్ధకమీప్సితంప్రవసనం నాశస్యహేతు స్త్రియః॥ ౨౫౪

తా॥ స్వాతన్త్ర్యమున్ను పుట్టింటనుండడమున్ను. తీర్థ యాత్రలయొక్క వేడుకయందు ఆసక్తిన్ని. సభల సమీపమందు పురుషులసమీపమందుండవలయుననే ఏర్పాటున్ను. (అనగా) సభలకుపోవడమున్నుపురుషుల సంపర్కమున్ను (లేక సభలకు పొయ్యే గొప్ప పురుషుల సంపర్కమున్ను) అటులనే పరదేశమందుండడమున్ను ఎల్లప్పుడున్ను జారస్త్రీలతో సహవాసము, స్వధర్మమునువిడువడమున్ను, భర్తకు వృద్ధాప్యమును కోరడమున్ను, ప్రయాణమున్ను, ఇవియన్ని స్త్రీయొక్క నాశనమునకు కారణములైనవి.

శ్లో॥ అగ్రాహ్యంహృదయం తథైవవదనం యద్దర్పణాన్తర్గతం
భావః పర్వతసూక్ష్మమార్గవిషమః స్త్రీణాం నవిజ్ఞాయతే।
చిత్తం పుష్కరపత్రతోయతరలం విద్వద్భిరాశంసితం
నారీనామ విషాఙ్కురై రివలతాదోషైస్సమంవర్ధితా॥ ౨౫౫

తా॥ స్త్రీలయొక్క బుద్ధిగ్రహించతగదు. ముఖమో అద్దమందు

కనపడెడిదేదో యది (అనగా పట్టుకొనుటకు సరిపడవని భావము) అభిప్రాయమో పర్వతమందలి చిన్నకాలిదోవవలె గోచరముకానిది మన స్సోతామరాకులోనున్న నీటివలె చంచలమయినది. యిట్లున్న స్త్రీ. విష పు మొలకలతో వలె దోషములతోకూడా వృద్ధిపొందబడినది.

శ్లో॥ సంమ్మోహయంతి మదయంతి విషాదయంతి
నిర్భత్సయంతి రమయన్తి విడంబయంతి।
ఏతాః ప్రవిశ్య సదయం హృదయం నరాణాం
కిం నామవామ నయనాన సమాచరంతి॥ ౨౫౬

తా॥ స్త్రీలు పురుషులయొక్క దయతోకూడిన మనస్సును పొంది మోహింపచేయుచున్నారు. మదమును కలగచేయుచున్నారు దుఃఖ మును కలగచేయుచున్నారు భయపెట్టుచున్నారు. ఆసక్తులను చేయు చున్నారు గనుక క్రూరమైన చూపుగల యీస్త్రీలు ఏమిచెయ్యరు.

శ్లో॥ అనంకురితకూర్చక స్తుసితోప లాద్యం పయః
సఏవధృతకూర్చక స్సలవణాం బుతక్రోపమః।
సఏవసితకూర్చకః క్వధితగుగ్గులోద్వేగకృత్
భవన్తిహరిణీదృశాం ప్రియత మేషుభావా స్త్రియః॥ ౨౫౭

తా॥ స్త్రీలకుప్రియులయందు మూడుభావములుంటున్నవి అవేవి యనగా భర్త మీసములు మొలవనివాడుగానున్నప్పుడు చక్కెరతోకూ డిన పాలువలెనుండును. అతడే మీసము కలిగినవాడైన యడల ఉప్పు చేర్చిన మజ్జిగవలెనుండును అతడే మీసములు నెరశినవాడయిన కొరివి కట్టెనవేశిన గగ్గిలమువలె భయంకరుడుగా నుండును.

శ్లో॥ జల్పన్తి సార్ధమన్యే నపశ్య న్త్యన్యం సవిభ్రమం।
హృదయేచింతయ న్త్యన్యం ప్రియఃకో నామయోషితాం॥ ౨౫౮

తా॥ ఒకనితోకూడా మాటలాడుచున్నారు. మరియొకనిని వేడు కగా జూచుచున్నారు. మనస్సన యింకొకని తలచుచున్నారు. గనుక స్త్రీలకు ప్రియుడెవడు.

శ్లో॥ స్త్రియోహిమూలం నిధనస్యపుంసః
స్త్రియోహిమూలం వ్యసనస్యపుంసః।
స్త్రియోహిమూలం నరకస్యపుంసః
స్త్రియోహిమూలం కలహస్యపుంసః॥ ౨౪౯

తా॥ పురుషుడియొక్క చెరుపుకున్ను దుఃఖమునకున్ను పాపమునకున్ను కలహమునకున్ను స్త్రీలే ఆధారము.

శ్లో॥ దర్శనాద్హరతేచిత్తం స్పర్శనాద్ధరతేధనం।
సంగమాద్ధరతేసత్వం నారీప్రత్యక్ష రాక్షసీ॥ ౨౫౦

తా॥ చూచుటవలన మనస్సును తాకుటవలన ధనమును చేరుటవలన బలమును అపహరించుచున్నది గనుక వనితయే ప్రత్యక్ష రాక్షసస్త్రీయైనది.

—(*) దుష్టస్త్రీలక్షణం. (*)—

శ్లో॥ యస్యభార్యా విరూపాచ కశ్మలాకలహ ప్రియా।
అధికాఽధిక భక్షాచసా జరాన జరాజరా॥ ౨౫౧

తా॥ ఎవనియొక్క భార్య వికారరూపముగలదిగా అమంగళకరములైన లక్షణములతోకూడినదిగా కలహమందు ఆశకలదిగాగొప్పశరీరము గొప్పతిండితోకూడినదిగా యుండినయడల అతనికదే భార్య ముసలితనము, ముసలితనము అనేది ముసలితనముకాదు (అనగా) మనుజుని వృద్ధాప్యమెట్లు బాధించుచున్నదో అట్లు భార్యబాధించునని భావము.

శ్లో॥ భర్తాయద్యపి నీతిశాస్త్రనిపుణో విద్వాన్ కులీనోయువా
దాతాకర్ణసమః ప్రసిద్ధవిభవ శృంగార దీక్షాగురుః।
స్వప్రాణాధిక కల్పితా స్వవనితా స్నేహేన సంలాలితా
తంకాన్తం ప్రవిహాయ సైవయువతీ జారంపతింవాంఛతి॥ ౨౫౨

తా॥ యజమానుడు న్యాయవంతుడుగాను పండితుడుగాను గొప్ప కులమందు బుట్టినవాడుగాను యౌవనవంతుడుగాను కర్ణుడితోసమునైన దాతగాను ప్రసిద్ధమైన ఐశ్వర్యముతో కూడినవాడుగాను శృంగా

రిగానుండి తనభార్యను తన ప్రాణముననకంటె అధికముగా చూచుదు
అతిస్నేహముతో లాలన చేయుచున్నవాఁడైనను అట్టిపురుషుని ఆభర్త
చే లాలనచేయింపబడు నా స్త్రీ విడిచి అన్యపురుషుని పొందుచున్నది.

శ్లో॥ పాణౌగృహీతాపి పురస్కృతాపి స్నేహేనసిత్యం పరివర్ధితాపి।
పరోపకారాయభవేదవశ్యం వృద్ధస్యభార్యాకరదీపికేవ॥ ౭౩

తా॥ ముసలివాఁడు తన భార్యను చేత పట్టుకున్నను ముందర నుం
చుకున్నను స్నేహముచే నిత్యము పెంచినను తన చేతనున్న దీపముచే
తనకెట్లు ప్రయోజనము లేదో అట్లతనికి యాభార్య ప్రయోజన పడక
పొరుగువారి కుపకారముననుగానె అవుచున్నది.

శ్లో॥ కార్యేసత్యపి జాతుయాతిన బహిర్నాప్యస్యమాలోకతే।
సాధ్వీరప్యను కుర్వతీ గురుజనం శ్వశ్రూంచ శుశ్రూషతే।
విశ్రమ్భం కురుతేచపత్యురధికంప్రాప్తేనిశీథేపునః।
నిద్రాణే సకలేజనే శశిముఖీ నిర్యాతిరంతుంవిటైః॥ ౭౪

తా॥ ఇదియొకవిధమైన జారస్త్రీలక్షణము ఎట్లనగా ఏమికార్య
మున్నను ఒకానొకప్పుడైనా వెలపటికిరాదు. ఇంకొకనిచూడదు. పతి
వ్రతలను అనుసరించి నడచుచున్నది మామగారు అత్తగారు మొదలైన
పెద్దవారినిగురించి శుశ్రూష చేయుచున్నది. భర్తకు అధికమైన నమ్మిక
కలగజేయుచున్నది ఇట్లున్ననుఅర్ధరాత్రిరావడముతోనే సర్వజనులునిద్రిం
చుచుండగా నీయాఁడుది విటులతోరమించుటకై బయలుదేరుచున్నది.

శ్లో॥ ఏషైవయోషితాంధన్యా శీలంచలభతేసుఖం।
దివాపతివ్రతాభూయాః నక్తంచ కులటాయతః॥ ౭౫

తా॥ ఏకారణమువలన పగటిని పతివ్రతగాను రాత్రి జారస్త్రీ
గాను అవుచున్నట్టియా స్త్రీ కృతార్థురాలు ఏలనగా మంచిగుణమును
పొందుచున్నది దానికి కావలసిన సుఖమునున్ను పొందుచున్నది.

---

* (స్నేహమనగా చమురు.)

శ్లో॥ బ్రహ్మైవ సత్యమఖిలం నహికించిదస్తి।
తస్మాన్నమేసఖి పరాపరభేదబుద్ధిః।
జారేతథానిజవరే సదృశోనురాగః।
వ్యర్థంకిమర్థ మసతీతి కదర్థయన్తి॥ ౧౬

తా॥ అంతయుబ్రహ్మమేగాని వేరేమేదిలేదు గనుకనే ఓసఖినాకు వీడువేరు వాడువేరుయని భేదబుద్ధిలేదు జారపురుషునియందును నాపురుషునియందును సమానమైన అనురాగమే ఇట్లుండను యెందుకొరకువ్యర్థముగా చెడ్డదియని విరోధించుకుంటారు.

శ్లో॥ పర్యంకస్స్వాస్తరణః పతిరనుకూలో మనోహరంసదనం।
తృణమివలఘు మన్యన్తే కామిన్యశ్చౌర్యరతిలుబ్ధాః॥ ౧౭

తా॥ మంచిమెత్త.దివ్యమైనమంచము అనుకూలుడైనభర్త,శ్లాఘ్యమైనఇల్లు వీటినన్నిటిని దొంగతనముగ సంభోగించ ప్రియముగల వ్యభిచారులు అల్పముగా గడ్డిపరకనువలె నెంచుచున్నారు.

శ్లో॥ దుర్దినసేఘనతిమిరే దుస్సంచారాసు నగరవీధీషు।
పత్యుర్విదేశగమనే పరమసుఖంజఘునచపలాయాః॥ ౧౮

తా॥ దట్టమైనచీకటితోకూడిన మేఘముచేత కప్పబడినదినమందు (లేక) రాజబాధ చోరబాధ రోగబాధలచే చెడుపైన దినమందుగాని తిరుగుటకశక్యమైన నగరపువీధులయందును భర్తకు పరదేశ ప్రయాణము సంభవించిన దగుచుండగా పిరుదులాడించుకొని తిరుగడె వ్యభిచారికి బహుసుఖమే.

## —(*) పతివ్రతాప్రకరణము. (*)—

శ్లో॥ యస్యభార్యా శుచిర్దక్షా భర్తార మనుగామినీ।
నిత్యంమధురవక్త్రీచ సారమానరమారమా॥ ౧౯

తా॥ యెవనియొక్క-భార్య పరిశుద్ధురాలుగానున్న, సమర్థురాలుగానున్న, యెల్లప్పుడుభర్తను అనుసరించెడిదిగానున్న, సతతము ప్రి

యవచనములాడెడిదిగానున్నవున్నదో అట్టిభార్యయేలక్ష్మి.లక్ష్మీదేవి లక్ష్మికాదు.

శ్లో॥ నిత్యంస్నాతా సుగంధాచ నిత్యంచ ప్రియవాదినీ।
అల్పభుక్మితవక్త్రీచ దేవతా సానమానుషీ॥ ౨౭౦

తా॥ ప్రతిదినముస్నానముచేయుచు పరిమళముతోగూడినదై। ఎల్లప్పుడు మితముగా మధురముగా మాటలాడుచు అల్పాహారముతో గూడినవనిత మనుష్యస్త్రీయైనను దేవతాస్త్రీయనిభావము.

*

శ్లో॥ అసారభూతే సంసారే సారభూతా పతివ్రతా।
ఇతిసంచింత్య వై శంభురర్ధాంగే పార్వతీందధౌ॥ ౨౭౧

తా॥ సారములేని యీసంసారమందుపతివ్రత (లేక స్త్రీ) యే సారమైనది ఇట్లనితలచే పరమశివుడు తనశరీరముయొక్క సహంభాగ మునందు పార్వతినిధరించెను.

శ్లో॥ పదన్యాసోగేహాద్బహిరహిఫణారోపణసమో।
నిజావాసాదన్యద్భవనమపరద్వీపతులితం।
వచోలోకాలభ్యం కృపణధనతుల్యం మృగదృశః।
పుమానన్యః కాంతాద్విధురివచతుర్థీసముదితః॥ ౨౭౨

తా॥ పతివ్రతకు ఇంటినుండి వెలపల యడుగుపెట్టడము సర్పము యొక్క పడిగెయందు అడుగుపెట్టుటవలెనుండును.తనయింటికంటెమరి యొకగృహమైనది ద్వీపాంతరముతో సమానమైనది (అనగా అంతదూరమనిభావెంచిపోదనిభా) మాటమైనది జనులకెవ్వరికి లభించదు ఎట్లన గా అతిక్రపణునియొక్క ధనమెట్లులభించదో నటుల. తనపురుషునికంటె మరియొక పురుషుడు చవితినాటిచంద్రుడెట్లు చూడతగనివాడో అరీతి యని భావము.

---

* (నితంబినీ పా.)

శ్లో॥ సాభార్యాయా ప్రియంబ్రూతే సపుత్రో యత్రనిర్వృతిః।
తన్మిత్రం యత్రవిశ్వాస స్సదేశో యత్రజీవ్యతే॥ ౨౭౩

తా॥ ఎవతె ప్రియమును పలుకుచున్నదో, ఆ స్త్రీయె భార్య ఎవడా నందమును కలగజేయుచున్నాడో అతడె పుత్రుడు యెవనియందు నమ్మిక యున్నదో అతను స్నేహితుడు యెచ్చట బ్రతుకున్నదో అదేదేశము.

శ్లో॥ అభ్యుత్థాన ముపాగతే గృహపతౌ తద్భాషణేనమ్రతా।
తత్పాదార్పిత దృష్టిరాసనవిధి స్సస్యోపచర్యాస్వయం।
సుప్తేతత్రశయీత తత్ప్రథమతో జహ్యాచ్చశయ్యామితి।
ప్రాచ్యైః పుత్రినివేదితః కులవధూ సిద్ధాన్తధర్మాగమః॥ ౨౭౪

తా॥ తనకొమారైకు నొకడు బోధించుచున్నాడు ఓపుత్రీవినుము యజమానుడు రావడముతోనే లేవడము అతనితో మాటలాడు సమయమున బహువినయముంచి మాటలాడడము అతని పాదములమీదనే దృష్టి యుంచుట అతని కాసనముంచుట తానుగానే అతనికిశుశ్రూష చేయుట యివిచేయుము. ఇదిగాక అతనునిద్రించిన వెనుక ఆపడకలోనేనీవునిద్రించుము అతనికంటెముందుగానే ఆపడకనువిడువుము. ఈప్రకారము ప్రాచీనులైనపెద్దలచేతపతివ్రతా స్త్రీలయొక్కసిద్ధాన్తధర్మము తెలిపింపబడెను.

శ్లో॥ లజ్జావశాచ్చనతమంధరదృష్టిపాతం।
మైత్చుంబితం కులవధూ వదనారవిందం।
తేషామనేక పురుషవ్రణితాధరేషు శక్తిః।
కథంభవతి వేశ్యవధూముఖేషు॥ ౨౭౫

తా॥ లజ్జచేత కిందుజూచుచున్న పతివ్రతా స్త్రీలయొక్క ముఖమును యెవరుముద్దిడుకొనుచున్నారో అట్టివారికి అనేకులచ్చే పుండుచేయబడిన పెదవులతోకూడిన వేశ్యలముఖములను ముద్దిడుకొనుటకు ఎట్లు శక్తికలుగుచున్నది.

శ్లో॥ రూపసంపన్నమగ్రామ్యం ప్రేమప్రాయం ప్రియంవదం।
కులీన మనుకూలంచ కళత్రం కుత్రలభ్యతే॥ ౨౭౬

తా॥ మంచియాకారముతోఁగూడి నాగరికత కలిగి ప్రేమయుంచి నదై ప్రియముగా మాటలాడుచు మంచికులమందుబుట్టి యనుకూలమైన కళత్ర మెచ్చట చిక్కును.

—(*) పుత్రప్రశంసా. (*)—

శ్లో॥ గృహేజానుచరః కేళ్యా మగ్ధస్మిత ముఖాంబుజః।
పుత్రః పుణ్యవతామేవ పాత్రీభవతి నేత్రయోః॥ ౨౭౭

తా॥ వేడుకచేత మందహాసముఖముతోఁగూడి యింటిని దోఁగిలాడెడుబిడ్డ పుణ్యవంతుల నేత్రములకు పాత్రమౌనేగాని పాపులకులభించదనిభావము.

శ్లో॥ అంతఃకరణ తత్వస్య దంపత్యో స్స్నేహసంశ్రయాత్।
ఆనన్దగ్రన్థి రేకోయ మపత్య మితికథ్యతే॥ ౨౭౮

తా॥ దంపతులయొక్క స్నేహవిశేషమువలన మనస్సనేఅంతఃకరణ తత్వమునకు ఆనందమనే ముడివైనది బిడ్డయనేభావము.

శ్లో॥ దిగ్వాస సంగతవ్రీడం జటిలం ధూళిధూసరం।
పుణ్యాధికాహి పశ్యన్తి గంగాధర మివాత్మజం॥ ౨౭౯

తా॥ దిగంబరుడై లజ్జలేనివాడై జడలతోఁకూడి దుమ్ముచే ధూసరవర్ణముగలబిడ్డను పరమశివునివలె అధికపుణ్యవంతులే చూచుచున్నారు. పరమశివుడున్నూ నాలుగు విశేషణములతోఁకూడిన వాడని భావము.

శ్లో॥ ఉరోరుహాదుగ్ధ విమిశ్రైః పయోభి
రాపూర్య కేళ్యాని జమాస్యగర్భం।
పూత్కృత్యయాతు ర్వదనేహసన్తం
తనూభవం పశ్యతికోపిధన్యః॥ ౨౮౦

తా॥ స్తనములనుండి చేపువచ్చి స్రవించుచున్న పాలచేతతననోరు కడుపునిండించి తల్లిముఖమునందు పూ అనిఉమ్మి వేశి నవ్వుచున్నబిడ్డను ఎవడోధన్యుడుచూచునుగాని కడమవారు చూడడనిభావము.

శ్లో॥ అహంకిమంబాకి మభీష్టతాపదే
తవేతి మాతుర్ధరితాత పృచ్ఛయా।
ప్రలోభతుల్యం ప్రవదంతమర్భకం
ముదాహసన్ జిఘ్రతిమూర్ధ్ని పుణ్యభాక్॥ ౫౧

తా॥ తండ్రి బిడ్డనుజూచి. అప్పానీకునేను ప్రియమా అమ్మప్రియమా అని తల్లి కెదురుగా తండ్రి అడుగుటచేత తండ్రిచూపించిన ఫలము మొదలైన పదార్థమును ఆశించిదానికి తగునట్లు చెప్పుచున్న బిడ్డను సంతోషముతో నవ్వుచు పుణ్యవంతుడైనవాడు, ఆబిడ్డ నెత్తి ముద్దిడుకొని తలవాసన జూసును.

శ్లో॥ నింద్యతేపితృభిస్తప్తైః నిరపత్యధనః పుమాన్।
అఫ్వనీనైరతిశ్రాన్తై రవకేశీవపాదపః॥ ౫౨

తా॥ బడలికనొందిన దోవనడిచెడి వారిచేత ఆకులు మొదలైనవి లేని గొడ్డుచెట్టువలె, తపించుచున్న పితృదేవతలచేత సంతానమనే ధనములేనివాడు నిందింపబడును.

—(*) కుపుత్రనిందా. (*)—

శ్లో॥ కింతేనజాతుజాతేన మాతృయావనహారిణా।
ఆరోహతినయస్స్వస్య వంశస్యాగ్రేధ్వజోయధా॥ ౫౩

తా॥ వంశమనెడు కొనయందు టెక్కెమువలె నెవడెక్కడో తల్లియావనమునుపోగొట్టెడు నట్టిపుత్రునిచేత నేమిప్రయోజనములేదు.

శ్లో॥ ఏకేనశుష్కవృక్షేణ దహ్యమానేనవహ్నినా।
దహ్యతేతద్వనంసర్వం దుష్పుత్రేణకులం తథా॥ ౫౪

తా॥ ఎండిపోయి అగ్నిచేత కాలుచున్న ఒంటిచెట్టు చేత ఆవనమంతనెట్లు కాలబడునో అటులనే దుర్మార్గుడైన పుత్రునిచేత వానితో చేరిన కులమంతయు కాలిచెడిపోను.

శ్లో॥ అజాతమృతమూర్ఖాణాం వరమాద్యౌనచాన్తిమః।
సకృద్దుఃఖకరావాద్యా వన్తిమస్తుపదేపదే॥ ౫౫

తా॥ పుట్టినవాడు. పుట్టిచచ్చినవాడు మూర్ఖుడు యీమువ్వురిలో పల మొదటియిద్దరుశ్రేష్ఠులు కడపటివాడు శ్రేష్ఠుడుగాడు. ఏలనగా ఆ యిద్దరు ఒక కాలమున సాధారణ దుఃఖమును కలగ జేయుచున్నారు. నీకడపటివాడు అప్పడప్పడు అనగా నెల్లప్పడు దుఃఖమును కలగజేయు చున్నాడు.

—(*) సత్పుత్రప్రశంసా. (*)—

శ్లో॥ ఏకేనవాసువృక్షేణ పుష్పితేన సుగంధినా।
వాసితంతద్వనంసర్వం సుపుత్రేణకులం తథా॥ ౨౮౬

తా॥ పుష్పించి పరిమళించుచున్న వకవృక్షముచేతనే ఆవనమంత యు నెట్లు పరిమళించునో నటులనే సుపుత్రునిచేత వానికులమంతయు పరి మళించును.

శ్లో॥ వరంగర్భస్రావో వరమపిచనైవాభిగమనం
వరంజాతః ప్రేతోవరమపిచకన్యావిజనితా।
వరంవన్ధ్యాభార్యా వరమపిచగర్భేషువసతిః
నచాఽవిద్వాన్ రూపద్రవిణగుణయుక్తోపి తనయః॥ ౨౮౭

తా॥ గర్భము జారిపోయినను మంచిదే. లేక సంభోగించకనుండడ మయినా మంచిదే పుట్టినతోడనే చచ్చినను మంచిదే వాని తల్లి కన్యగా నుండినామంచిదే (అనగా మాచకమ్మ) గొడ్రాలుగా నుండినామంచిదే లేక గజగర్భమునున్నను మంచిదే, సంపద మంచిరూపము గుణమున్నను పుత్రుడు విద్యాహీనుడు మాత్రముగా కూడదు.

—(*) రాజప్రకరణం. (*)—

శ్లో॥ రాజానంప్రథమంవిన్దేత్ తతోభార్యాం తతోధనం।
రాజన్యసతిలోకేస్మిన్ కుతోభార్యా కుతస్సుఖం॥ ౨౮౮

తా॥ రాజును మొదటపొందవలయును పిమ్మటభార్యను పిమ్మటధన మునుపొందవలయును రాజులేనియెడల యీలోకమందు భార్యనెక్కడిది ధనమెక్కడిది అనగా రాజరికములేనియెడల ఒకనిభార్యనింకొకడు ఒక నిద్రవ్యమును మరియొకడపహరించుకొనుటచే వ్యవస్థతప్పిపోవునని భా.

శ్లో॥ పర్జన్య ఇవభూతానామాధారః పృథివీపతిః।
వికలేపిహిపర్జన్యే జీవ్యతేనతు భూపతౌ॥ ౨౮౯

తా॥ భూతములకు మేఘమువలె రాజైనవాడు ఆధారము. అందునను మేఘము లేనియడలను లోకమంతయు కొంతకాలమైనా జీవించవచ్చును రాజు లేనియడల క్షణకాలమైనా జీవించతగదు.

శ్లో॥ బాలోపినావమంతవ్యః మనుష్య ఇతిభూమిపః।
మహతీదేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి॥ ౨౯౦

తా॥ బాలుడైనను రాజుమనుజుడని జనులచేత తిరస్కరించతగదు సర్వాధిష్ఠాతయైన దైవము యీనరరూపముతో కదాయుంటున్నది.

శ్లో॥ యస్యప్రసాదే పద్మాస్తివిజయశ్చ పరాక్రమే।
మృత్యుశ్చ భవతిక్రోధే సర్వతేజోమయోహిసః॥ ౨౯౧

తా॥ ఎవనియొక్క అనుగ్రహమందు లక్ష్మీదేవిన్ని పరాక్రమమందు విజయమున్ను కోపమందు మృత్యుదేవతయు నుంటున్నదో అట్టి రాజు సర్వదేవతా స్వరూపుడుగదా.

శ్లో॥ ఆజ్ఞాకీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానంభోగోమిత్ర సంరక్షణంచ।
యేషామేతే షడ్గుణానప్రవృత్తా
కోర్థస్తేషాం పార్థివోపాశ్రయేణ॥

తా॥ ఉత్తరవుచేయుట కీర్తినిసంపాదించుట బ్రాహ్మణులను రక్షించుట. ఈవిమంచి అనుభోగము స్నేహితులను కాపాడుట యెవరికి వేర్పడలేదో అట్టిరాజులకు రాజరికమువచ్చుటచే నేమిలాభము.

శ్లో॥ రాజన్ త్వద్దర్శనే నైవగళన్తిత్రీణి తత్క్షణాత్।
రిపోశ్శస్త్రం కవేర్దైన్యం నీవీబంధో మృగీదృశాం॥ ౨౯౩

తా॥ ఓరాజానీచూపుచేతనే మూడువిషయములప్పుడేవదిలిపోవుచున్నవి ఏవేవియనగా శత్రువుచేతనుండాయుధము కవినుండిదైన్యము స్త్రీలయొక్క కోకముడి అనగా శూరుడు దాతశృంగారియనిభావము.

శ్లో॥ రాజసేవా మనుష్యాణామ సిధారావలేహనం।
పంచానన పరిష్వంగో వ్యాలీవదన చుంబనం॥ ౫౪

తా॥ మనుష్యులకు రాజులనుకొలవడమైనది తేనెపూసిన కత్తికొనను నాకినట్లు సిమ్హమును ఆలింగనమును చేసుకున్నట్లు పాము మూతిని ముద్దిడుకొన్నట్లువును గనుక జాగ్రతగా వర్తించవలయునని భా.

శ్లో॥ అయుక్తంయుక్తం వాయదభిహిత మజ్ఞేన విభునా
స్తుయాదేతన్నిత్యం జడమపిగురుంతస్య వినుయాత్।
వివత్సుర్నైస్సృహ్యాం కధమపిసభాయాం మభినయేత్
స్వకార్యం సంతుష్టే క్షితిభృతి రహస్యేవ కధయేత్॥ ౫౫

తా॥ తగినదైనను తగనిదైనను మూఢుడై నప్పటికిన్ని రాజుచేత చెప్పబడిన దానిని స్తోత్రము చెయ్యవలసిన దేను మూఢుడైనను రాజుయొక్క గురువును పొగడవలయును. అతనివద్ద వసించవలయునని యిచ్ఛయున్న యెడల తన కాశలేని తనమును సభయందు అభినయించవలయును తన కార్యమును రాజు సంతోషించి నప్పుడు ఏకాంతమందే చెప్పవలయును.

శ్లో॥ సప్రతిబంధంకార్యం ప్రభురధిగంతుం సహాయవానేవ।
దృశ్యంతమసి నపశ్యతి దీపేనవినా సచక్షురపి॥ ౫౬

తా॥ రాజై నప్పటికిన్ని సహాయవంతుడైనయడల ఆటంకముతో కూడినదైనను వక కార్యమును తన వశమయ్యేట్లు పొందుటకు తగియున్నాడు యెట్లనగా చూడతగిన పదార్థమును చీకటిన నేత్రమున్నను దీపము లేనియడల ఎటుల తెలియదో అటులని భావము.

శ్లో॥ భోగినఃకంచుకాసక్తాః క్రూరాఃకుటిలగామినః।
సుదుష్టాః మంత్రసాధ్యాశ్చ రాజానఃపన్నగా ఇవ॥ ౫౭

తా॥ రాజులు భోగవంతులు (అనగభోగప్రియులు) కవచం అంగరకాలయందాసక్తులు - క్రూరస్వభావులు - కపటవంతులు - అధిక దుష్టులు ఆలోచనచేత సాధించతగినవారు గనుక సర్పములవంటివారు -

అనగా సర్పములకు - భోగము పడిగెకంచుకము కుబుసము - కుటిలము వంకర - మంత్రము గరుడాది మంత్రములు అనియర్థముచే సామ్యమేర్పడెను.

శ్లో॥ ఉత్ఖాతాన్ ప్రతిరోపయన్ కుసుమితాన్ చిన్వన్ లఘూన్వర్ధయన్
అత్యుచ్చాన్నమయన్నతాన్ సముదయన్ విశ్లేషయన్సంహతాన్।
క్రూరాన్ కణ్టకినోబహిర్నిరసయన్ప్లానాన్ పునస్సేచయన్
మాలాకార ఇవప్రపంచచతురో రాజాచిరంనన్దతి॥ ౨౯౯

తా॥ యెత్తివేసినవారికి బదులు పనివారిని పెట్టుచు సుఖముగానున్నవారినాడించి ఫలములనుపొందుచు,తక్కువవారిని పెంచుచు నిండాగర్వముపొడవువారిని తగ్గించుచు అణగిపోయినవారికి హెచ్చింపుచు (దురాలోచన చేకూడియున్నవారిని ఒకరికొకరి దూరముగానుంచుచు దుష్టులనురాజ్యకంటకులను బైటికిదోయుచు నొచ్చినవారికి తెంపుకలగజేయుచు నీప్రపంచమందు బహుచాతుర్యముతో రాజు, పూలతోటను పెట్టుకొన్ని పువ్వుల నమ్మెడివానివలె ఆనందించుచున్నాడు మాలాకారుని యర్థమున యెత్తివేశిన వాటికి వేరే చెట్లను పెట్టుట పట్టుకొనుటకు వైపులేని పొడుగు చెట్లను తగ్గించుట ఆవరించుకొని భయంకరములై ముళ్లతోగూడిన చెట్లను బైటపారవేయుచు దగ్గిరచేరియున్న చెట్లను దూరముగ నుంచుచు వాడినచెట్లకు నీరుపోయుచు అనిభావము. మిగత సమమె.

శ్లో॥ అకస్మాద్ద్వేష్టియో భక్త మాజన్మపరిసేవితం।
నవ్యంజనే రుచియస్యత్యాజ్యోనృపఇవాతురః॥ ౩౦౦

తా॥ ఏరాజు రాజలక్షణమందు ప్రియములేక పుట్టినదిమొదలుకొలువుకొలుచుచున్న పరిచారకుని హఠాత్తుగా ద్వేషించుచున్నాడో అట్టి రాజు ప్రాణముపొయ్యెడువాడివలె విడువతగినవాడే అనగా ఆతురిడి యర్థమున భక్తంఅన్నము. వ్యంజనం శాకపాకాదులు.

—(*) సేవకనిందా. (*)—

శ్లో॥ ఆహారేబడబానలశ్చ శయనేయః కుంభకర్ణాయతే।
సందేశేబధిరః పలాయనవిధౌ సింహస్సృగాలోరణే।
అన్ధోవస్తునిరీక్షణే౽థగమనే ఖంజఃపటుః క్రందనే।
భాగ్యేనైవహిలభ్యతే పునరసౌ సర్వోత్తమస్సేవకః॥ 30౧

తా॥ దుష్ట సేవకుడు, ఆహారమందు బడబానలమువంటివాడు అనగా అంతపదార్థము లనుగ్రహించును నిద్రించుటయందు కుంభకర్ణుడివలెనుండును మనమాటలు వినుటయందు చెవిటివాడుగా నుండును తినయింటికి పరుగెత్తుటకు సింహమువలె పరుగులెత్తును యుద్ధము వచ్చినప్పుడు నక్కవలెతంత్రమును జేసి తన్నుమాత్రం కాపాడుకొనును పదార్థములనుచూడమనిచెప్పినప్పుడు గుడ్డివాడుగా నుండును కొంచమునడువమనిచెప్పినప్పుడు కుంటివాడు గానుండును ఏడ్చుటయందు బహుదృఢముగలవాడుగానుండును గనుకతగుమైనబంటు మంచిభాగ్యమువల్ల నే లభించవలయును.

శ్లో॥ జీవన్తోపిమృతాః పంచవ్యాసేన పరికీర్తితాః।
దరిద్రోవ్యాధితోమూర్ఖః ప్రవాసీ నిత్యసేవకః॥ 30౨

తా॥ బ్రతికియున్నను మృతించినవారైదుగురని వ్యాసులచే తీర్మానింపబడెను పరమదరిద్రుడు మహావ్యాధితో కూడినవాడు మూఢుడు ఎల్లప్పుడు దోవనడచెడువాడు నిరంతరము కొలువు కొలిచెడువాడు.

శ్లో॥ శిరసాధార్యమాణోపి సోమస్సౌమ్యేనశంభునా।
తథాపి కృశతాంధత్తే కష్టః ఖలుపరాశ్రయః॥ 303

తా॥ పరమశివుడు తనతలతో చంద్రునిధరించినను చంద్రుడు చిక్కిపోవుచున్నాడు ఏలనగా యెంత గొప్పతనమున్నను పొరుగువారిని ఆశ్రయించి యుండడము కష్టముగదా॥

శ్లో॥ వరంవనం వరంభైక్ష్యం వరంభారోపజీవనం।
పుంసాం వివేకహీనానాం సేవయాన ధనార్జనం॥ 30౪

తా॥ వనవాసమైనా శ్రేష్ఠమే బిచ్చమెత్తడమైనా శ్రేష్ఠమే. మోత మోసుకొని జీవించడమైనా శ్రేష్ఠమేకాని జ్ఞానములేనిమనుష్యులవద్ద కొలువుకొలుచుటచే ధనసంపాదనమాత్రము కూడదు.

శ్లో॥ స్వాభిప్రాయ పరోక్షస్య పరచిత్తానువర్తినః।
స్వయంవిక్రీత దేహస్య సేవకస్యకుతస్సుఖం॥ ౩౦౫

తా॥తనఅభిప్రాయము దూరమందుగలవాడై ఇతరులమనస్సననుసరించినడుచుచు తానుగా నమ్ముకున్న శరీరము గలపరిచారకునికిసుఖమెక్కడిది.

శ్లో॥ చలేషుస్వామిచిత్తేషు సులభేషునేజనే।
యదిజీవన్త్యహోచిత్రం క్షణమప్యుపజీవినః॥ ౩౦౬

తా॥ యజమానుడిమనస్సే అతిచంచలముతో కూడినదికొందెము చెప్పెడువారో సులభముగాచిక్కుచున్నారు. ఇట్లుండను సేవకులుక్షణకాలము బ్రతికియుండుట బహుఆశ్చర్యము.

శ్లో॥ సేవాశ్వవృత్తిరైర్యైరుక్తానతైస్సమ్యగుదాహృతం।
స్వచ్ఛన్దచారీ కుత్రశ్వా విక్రీతాసుః క్వసేవకః॥ ౩౦౭

తా॥ సేవకవృత్తి శ్వవృత్తియని యెవరుచెప్పిరో వారుచక్కగా ఆలోచించి చెప్పలేదు ఏలనగా. ఇష్టప్రకారముగా సంచరించెడి శునకమెక్కడ, ప్రాణములనమ్ముకున్న సేవకుడెక్కడ.

శ్లో॥ మౌనాన్మూకః ప్రవచన పటుర్వాతు లోజల్పకోవా।
ధృష్టః పార్శ్వే వసతిచ సదాదూరతస్త్వప్రగల్భః।
క్షాన్త్యాభీరుర్యదినసహతే ప్రాయశో నాభిజాతః।
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః॥ ౩౦౮

తా॥ సేవకుడు మౌనముగానున్నయెడల మూగవాడని మాటలాడెదానిలో సమర్థుడైనయెడల వీడికిసమానం లోకమందు పదరెడువాడు లేడని. దగ్గరనే యున్నయెడల అహంకారియని వదిగియున్న యెడల వ్యర్థుడని ఓర్పుచేత భయపడేవాడిని పొరుగువారి సుఖములను ఓర్చనియెడల మంచిచోట పుట్టినవాడుకాడని ఇట్లునిందించుటచేత సేవక

వృత్తి బహులోత్తై యోగులకుకూడా గోచరముకానిది. గనుక బహు కష్టమనిభావము.

—(*) భిక్షుకగుణాః. (*)—

శ్లో॥ ఉచ్చైరధ్యయనం పురాతనకథా స్త్రీభిస్సహాలాపనం।
తాసామర్ఘ్య కలాలనం పతినుతి స్తత్పాకమిధ్యాస్తుతిః।
ఆదేశస్య కరావలంబనవిధిః పాండిత్యలేఖక్రియా।
హోరాగారుడ మంత్రతంత్రక విధిర్భిక్షోర్గుణా ద్వాదశ॥ ౩౦౯

తా॥ ఘట్టిగానామములను జెప్పుట. స్త్రీలతో జేరి మాటలాడుట. నడచిన పాతకధలను జెప్పుట, వారియొక్క బిడ్డలను బుజ్జగించుట, వారిభర్తలనుకొనియాడుట. వారివంటలను అబద్ధముగా పొగడుట. చెప్పినపని చేతులోవున్నదని జెప్పుట, పాండిత్యవిశేషములను వ్రాయుట ప్రశ్నమొదలైనవిచెప్పుట, సర్పాదివిషములనుతగ్గించుట, పిశాచములనుతోలుట, వైద్యతంత్రములను జేయుట, యిట్లుభిక్షమెత్తెడువారికి ౧౨ గుణములున్నవి.

శ్లో॥ ప్రాతక్షాళితలోచనాః కరతలె చంచత్పవిత్రాం కురాః।
తత్రస్థాన నివేశితోర్ధ్వ తిలకాశ్చేలాన్త బద్ధాక్షతాః।
కోజాతశ్చ మృతోధవాఽమృతతిధిః కస్యాలయే వర్త్తతే।
చేత్థంహర్షశతైర్యుతాః ప్రతిదినంధావన్త్యహో భిక్షుకాః॥ ౩౧౦

తా॥ ప్రాతఃకాలమందు కన్నులు కడుగుకున్నవారలై ఆయాస్థానమందుంచుకొన్న ఊర్ధ్వపుండ్రములతో కూడినవారై చేతలేతదర్భలెత్తుకొని వుత్తరీయముకొనను అక్షతలుకట్టుకున్నవారలై యెవడు పుట్టెను యెవడుపోయెను యెవని యింటియందు శ్రాద్ధము వచ్చుచున్నదని పూర్వాపరముల రెంటియందును అనేక సంతోషములతోకూడా భిక్షమెత్తెడువారు ప్రతిదినమిటుల పరుగులెత్తుచున్నారు.

శ్లో॥ అగ్రోభ్యభుక్తిమతాం ప్రయోగసమయే మన్త్రేషుపృష్ఠంగతః।
పాకాగారగతస్తుపాచక మనస్తోషాయ వాచస్పతిః।

ఉచ్చాయాంనిరతో రతోర్ఛకగణే పిండేషుదత్తాదరః।
నానాశ్రాద్ధగణైకచాలితమనా భట్టోత్తమోరాజతే॥ ౩౦౧

తా॥ భట్టోత్తముడనెడి వకభిక్షుకునిరీతి, భుజించెడివారిలో మొదటయుండును పూర్వాపరప్రయోగ సమయమందు మన్త్రములుచెప్పెడువారిలో అందరికి వెనకవుండును. పాకశాలకుపోయి ప్రవేశించినయెడల వంటవారియొక్క మనస్సంతోషమునకుగాను స్తోత్రముజేసెడు విషయములో బృహస్పతిగా నున్నాడు. (ఉచ్చయనగా దక్షిణయని వైదిక సాంకేతికశబ్దము) దక్షిణయందు బహు ఆసక్తుడు పిల్లవారి సమూహమందును బహు ఆసక్తుడు కబళములందు బహుప్రియముగలవాడు వక దినమున అనేకశ్రాద్ధములు చేరుటచే వ్యాకులబడ్డ మనసుతో కూడినవాడై ప్రకాశించుచున్నాడు.

—(*) మనః. (*)—

శ్లో॥ భిక్షాశనం తదపినీరస మేకవారం
శయ్యాచభూః పరిజనో నిజదేహమాత్రం।
వస్త్రం సుజీర్ణ శతఖండ మయీచకన్థా
హాహాతథాపి విషయాన్న జహాతిచేతః॥ ౩౦౨

తా॥ భిక్షాటనముచే అన్నములభించుట అదిన్నీ నెయ్యి మొదలైనవిలేనిదై తుపాకన్నము అదియు రెండుపూటలు చిక్కక ఒకవేళనేచిక్కడము. పడకయోభూమి ఉపచారముజేసెడు జనమోశరీరమేవస్త్రమో చినిగి నూరురంధ్రములు గలిగిన పాతపేలికఓహో యిట్లున్నను ఇంద్రియసౌఖ్యమును మనస్సువిడువలేదుగదా.

శ్లో॥ పరిభ్రమసికిం వృథాక్వచనచిత్త విశ్రామ్యతాం
స్వయంభవతి యద్యథాభవతి తత్తథానాన్యథా।
అతీతమపి నస్మరన్నపిచ భావిసంకల్పయ
న్నతర్కిత సమాగమా ననుభవస్వభోగా నిహ॥ ౩౦౩

తా॥ ఓమనస్సాయెక్కడ వ్యర్థముగా తిరుగుచున్నావు. ఒకచోట

విశ్రమించుము ఎ దెట్లు అవుచున్నదో అదియట్లు తానుగానే అవును వేరే విధముగా కాదు. నడిచినదానిని తలచకనడవబూన్వేదు దానిని ఊహించక వస్తూపోతూవుండే భోగములను అనుభవింపుము.

శ్లో॥ అగ్రేగీతం సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః
పశ్చాల్లీలావలయ రణితం చామరగ్రాహిణీ నాం।
యద్యస్త్యేవంకురు భవరసాస్వాదనే లంపటత్వం
నోచేచ్చేతః ప్రవిశసహసా నిర్వికల్పే సమాధౌ॥ ౩౧౪

తా॥ ఎదురుగా సంగీతము ఇరుప్రక్కలను దక్షిణముంనుండివచ్చిన సరసకవులున్నూ వెనకపక్క చామరములను పట్టుకున్న స్త్రీలయొక్క వేడుకమైన కంకణధ్వనిన్నీ యీప్రకారమున్నయెడల సంసారరసమును పానముజేసుటయందు శ్రమ జెందిన దానవుకమ్ము అట్లులేనియెడల ఓమనసా చంచలములేని నిష్ఠయందు ప్రవేశించుము.

శ్లో॥ హసతికదాచి ద్రౌతిభ్రాన్తం సదృశదిశః పరిభ్రమతి।
హృష్టం కదాపదుష్టం శిష్టందుష్టంచ నిందతిస్తౌతి॥ ౩౧౫

తా॥ మనస్సు ఒకప్పుడు నవ్వుచున్నది. ఒకప్పుడు యేడ్చుచున్నది. సమాన దిక్కులనుగురించి చుట్టుచున్నది. సంతోషించిన దానిని గురించి దోషముని నిందించు చున్నది. ఒకానొకప్పుడు శుద్ధమైన దానిని నిందించుచున్నది. దోషముతోకూడిన దానిని స్తోత్రముచేయుచున్నది.

శ్లో॥ కమపిద్వేష్టిసరోషం హ్యాత్మానం శ్లాఘతేకదాచిదపి।
చిత్తం పిశాచను భవద్రాక్షస్యా తృష్ణయా వ్యాప్తం॥ ౩౧౬

తా॥ ఎవనినైనా వకనిని రోషముతో కూడా విరోధించుచున్నది. (లేక) కోపముతో కూడిన తన్ను ఒకానొకప్పుడు కొనియాడుకొనుచున్నది. ఇట్లు ఆశయనే రాక్షసిచేత ఆవరింపబడ్డ మనస్సు పిశాచము వలె అయినది.

శ్లో॥ దంభాభిమానలోభైః కామక్రోధోరుమత్సరైశ్చైతైః।
ఆకృష్యతేసమభితః శ్వభిరివపతితా తనుర్మార్గే। ౩౧౭

తా॥ దోవలో బడ్డ కళేబరము కుక్కలచే నెట్లు లాగబడుచున్నదో ఆలాగనో మనస్సు గర్వముచేత అభిమానముచేత కృపణత్వముచేత ఆశచేత కోపముచేత విరోధముచేత లాగబడుచున్నది.

శ్లో॥ ప్రతిపదమఖిలాన్ లోకాన్ మృత్యుముఖం ప్రవిశతో నిరీక్ష్యాపి।
హాహతకంచిత్తమిదం విరమతినాద్యాపి విషయేభ్యః॥ ౩౧౮

తా॥ ఒకొక్క స్థానమున మృత్యుముఖమును ప్రవేశించుచున్న సర్వప్రాణులను చూచిన్ని పాడైన మనస్సైనది. ఇప్పుడైనా ఇంద్రియ విషయములనుండి అయ్యో మరలదుగదా.

శ్లో॥ నపుంసకమితి జ్ఞాత్వా తాం ప్రతిప్రేషితం మనః।
మనస్తత్రైవరమతే నిహతాః పాణినావయం॥ ౩౧౯

తా॥ మనస్సునపుంసక లింగమని పాణినివల్ల తెలుసుకొని ఆస్త్రీని గురించి అంపబడెను ఓహో ఆనపుంసకలింగమైన మనస్సున్ను ఆస్త్రీయందు రమించుచున్నది. వ్యాకరణంచేసిన పాణినిచేత మనము చెడిపోతెమి స్త్రీయందు మనస్సులయించిపోయినదిగదా.

శ్లో॥ రేచిత్తచిన్తయచిరం చరణౌమురారేః
పారంగమిష్యతిభవాన్ భవసాగరస్య।
పుత్రాః కళత్రమితరే సుహృదస్సహాయాః
సర్వం విలోకయసఖే మృగతృష్ణికేవ॥ ౩౨౦

తా॥ ఓమనస్సా పరమాత్ముని యొక్క పాదారవిందములను ఎల్లప్పుడుతలచుము తలచిన సంసార సముద్రముయొక్క ఆవలిగట్టును పొందగలవు భార్య బిడ్డలు స్నేహితులు ఇంకా యితరులైన పరిచారకులు యిట్లంతయును. ఓ స్నేహితురాలయిన మనసా యెండ మావులవలె చూడుము.

—(*) జిహ్వా. *)—

శ్లో॥ ద్వాత్రింశద్దశనద్వేషి మధ్యేభ్రమసినిత్యశః।
తదిదం శిక్షితంకేన జిహ్వే సంచార కౌశలం॥ ౩౨౧

తా॥ దంతములనే ౩౨ విరోధుల నడుమను నిత్యము తిరుగుచున్నావు. ఓనాలికా ఈశత్రుమధ్య సంచార నేర్పరి తనమెవనిచే శిక్షింపబడినది.

శ్లో॥ నమోస్తు రసనేతుభ్యం వచనైః పరుషైరలం।
నరకధ్వంసినం కృష్ణం నమామీతి వదాధునా॥ ౩౨౨

తా॥ ఓ జిహ్వా నీకు నమస్కారము యిక దూషించేడు పరుషవార్తలు చాలును. యిప్పుడైనను నరకమును నాశనమును చేయుచున్నకృష్ణుని నమస్కరించు చున్నానని చెప్పుము.

శ్లో॥ జిహ్వేన క్తి రదాన్ క్రమేణకటుకా
నన్యాన్ పదార్థాన్ బహూన్।
చూర్ణీ కృత్య దయాం మయి ప్రథయతాం
కింవో విధేయం మయా।
దన్తాన్ తాడయతేతి తే కటుతరైర్వాక్యై ర్యర్జనోహిస్తినః।
తస్మాత్ ప్రత్యుపకార తాత్ర రసనే పారుష్యహీనంవచః॥ ౩౨౩

తా॥ నాలికదంతములనుచూచి చెప్పుచున్నది. వోదంతములే అనేక కఠినమైనపాలకాయలు మొదలైన భక్ష్యాది పదార్థములనుపొడిచేసిచ్చి నాయందు బహుకరుణయుంచిన మీకు నేనేమి ప్రత్యుపకారమునుచేయుదును. అని చెప్పెను. దంతములునాలికనుచూచి చెప్పుతున్నది. ఓనాలిక నీచేతకఠినపుమాటలు నోటనుండిజారి రావడముతోనే లోకులుమమ్ములనుజూచి ఆపళ్లను పగలగొట్టుడనిచెప్పి మమ్ములను హింసించుచున్నారుగావున నీకుమేముజేసిన వుపకారమునకు ప్రత్యుపకారమైనది ఏది యనగా కఠినములేక పలకడమే అని బదులుజెప్పెను.

—(*) కర్ణః (*)—

శ్లో॥ స్థితేషు సర్వేష్వంగేషు కర్ణంతుద్వైన్యస్పృశ న్తికిం।
జ్ఞానాన్మోక్షు శ్శ్రుతే స్తద్ధి శ్రుతేః కర్ణస్తుపేటికా॥ ౩౨౪

తా॥ శరీరమందు అనేకఅవయవములుండను శుద్ధికోసరము ఆచ

మనమునకుబదులుగా ఏలచెవిని తాకుచున్నారు. అనగా జ్ఞానమువలన మోక్షము వినుటవలన జ్ఞానము వినడమునకు ముఖ్యఆధారమై పెట్టివుం టిదిగదా చెవి అందువలన సర్వ వేదాంత సారమున్నందున చెవులను తాకుచున్నారని భావము.

శ్లో॥ పండితోయామికర్ణాభ్యాం కుండలేచ నృపాదితి।
దదౌచకుండలేతాభ్యాం తదీయ్యోప కృతిఃస్మరన్॥ ౩౨౫

తా॥ చెవులచేత శాస్త్రతాత్పర్యము వినిని పండితుడనై రాజు వల్లకుండలములను పొందుతున్నానని చెవులయొక్క ఉపకారమును తల చుచు చెవులవల్ల వచ్చినకుండలములను చెవులకేయిచ్చివేసినాడు.

—(*) శిరః. (*)—

శ్లో॥ దైవప్రణామహేతోర్వా సాధుశ్లా ఘనతోపివా।
దైవందదాతి శిరసే కిరీటాదికముత్తమం॥ ౩౨౬

తా॥ దేవుని నమస్కరించిన హేతువువలన సాధువులను శ్లాఘిం చినందువలనను దైవమీసమయమందు ఆతలకు ఉత్తమములైన కిరీటా దుల నిచ్చుచున్నాడు.

శ్లో॥ దైవంనప్రణమేద్యచ్చసాధూన్న శ్లాఘతే మదాత్।
ఉత్కరం శిరసేదైవం యచ్ఛతీం ధనభారకం॥ ౩౨౭

తా॥ ఏతలదైవమును నమస్కరించదో సాధువులను మదమువలన కొనియాడదో ఆతలకు గొంతు వంగకుండు నటుల యీశ్వరుడు కట్టె మోపులు మొదలైన బలువుపదార్థములను తలలోవుంచి మోశేటట్టు చేసికష్టపెట్టుచున్నాడు.

శ్లో॥ ప్రణామాభ్యాససిద్ధ్యర్థం నిర్ణీతం మజ్జనంబుధైః।
తేనాపి తదసిద్ధిశ్చేత్ ముండనం సర్వదండనం॥ ౩౨౮

తా॥ నమస్కరించెడు వాడుక కలుగుటకై పెద్దలచేతస్నానమనె డు ఒకక్రియను తీర్మానించిరి. అందుచేతను ఆనమస్కరించెడుకార్యము సిద్ధికానియెడల అన్నిటికి దండనగా క్షౌరమును ప్రాయశ్చిత్తమునుగా

విధించినారు. అనగా స్నానమందు తలవంగుననిఅంతకంటె క్షౌరమం
దు తలవంగుననని పెద్దలకు తలవంచనియెడల పాపమని అదినివృత్తించుట
కై క్షౌరములు విధించినారని కవిచమత్కరించినాడు.

—(*) నేత్రం. (*)—

శ్లో॥ మూఢేభ్యో నృతమాకలయ్య మనసేనిఙా-యాకంయచ్ఛృతీ।
త్యాక్రోశేన విధిస్తదాహ్యా జనయత్ సూచ్యాన్యథాంకర్ణయోః।
నేత్రేపశ్యత ఏవసత్యమితీకిం దృగ్భ్యాంవ్యథాంనోదదౌ।
తస్మాద్దృష్టముదీరయే జ్జనసదాశృత్వాతథామావద॥ ౩౨౯

తా॥ చెవినైనది మూఢులవలన అబద్ధమును పొంద్కిమనస్సు కొ
రకు నడవనిసంగతిని నడిచినట్లు నిశ్చయమును యిచ్చుచున్నదనికోపంచే
త, దేవుడు ఆరెండుచెవుల కుట్టించడమనే సూదిచేత వుపద్రవమును
కలగజేసెను. నేత్రములు వాస్తవమునే చూచుచున్నవని వాటికిఅలాంటి
పీడనుయివ్వలేదు గనుక ఓజనమా చూచినదే చెప్పువిన్నదానిని చెప్ప
బోకుము.

—(వ) ముఖం. (*)—

శ్లో॥ శ్రోతుంఘ్రాతు మపీక్షితుం ప్రగదితుం పాతుంచభోక్తుంతథా।
సర్వాణ్యేవసు సాధనాని విధినా సంకల్పితాన్యాననే।
తస్మాదేవ కుటుంబివన్ముఖతలం సోష్ణీష పుండ్రాంకితం।
నానాడంబర గౌరవప్రభుపద శ్రీవాస ముఖ్యాశ్రయం॥ ౩౩౦

తా॥ వినుటకు వాసనజూచుటకు పలుకుటకు త్రాగుటకు తినుటకు
గాను సర్వసాధకముకైన చెవి మొదలగు నవయవములుబ్రహ్మచేత ము
ఖమునందేర్పరచ బడినవి. అందువలన పెద్దకుటుంబివలె తలపాగ వుం
డ్రములతోకూడినదై అన్ని ఆడంబరములకు అన్నిగౌరవములకు రాజ
లక్షణములకు లక్ష్మీవాసమునకు ముఖము ముఖ్యమైన అధారమాయెను.

శ్లో॥ ఆకారహీనేపి వికారపూర్ణే
లక్ష్మీర్ముఖేభాతి తతఃప్రభాతే।

యో వాస్వవక్త్రంముకురేనరీక్షతే
లక్ష్మ్యాసమగ్ర్యో భవితానచార్థః॥ 330

తా॥ తగు ఆకారము లేక వికారము చేసినందియున్న శుముఖమునందే లక్ష్మీ ప్రకాశించుచున్నది అందువలననే ప్రాతఃకాలమందు యెవడు అద్దమును తనముఖమును జూచుచున్నాడో ఆమనుజుడు సంపదతో కూడా ఉండగలడు దీనుడుకాడని భావము.

శ్లో॥ సత్యాని మన్యశౌర్యాణి చౌర్యం దాక్ష్యంసుశీలతాం।
విజానన్తి ముఖేనైవ సుధియోఽతద్గతాంధియం॥ 332

తా॥ సత్యమును పాండిత్యమును పరాక్రమమును దొంగతనమును నేర్పరితనమును మంచిస్వభావమును వాడివాడిబుద్ధిని బుద్ధిమంతులు ముఖముచేతనే తెలుసుకొనుచున్నారు.

—(*) వక్షః (*)—

శ్లో॥ యావచ్ఛ్రమః ఫలంతావ దితివాజ్మానృతాభువి।
తాడనం సహతేవక్షః హారాణి లభతేతతః॥ 333

తా॥ ఎంతశ్రమపడుతాడో అంతఫలమును పొందుతాడు అనే మాటభూమియందు అబద్ధముకాదు రొమ్ము శత్రువులవల్ల దెబ్బలను ఓర్చుకొనుచున్నది దానివల్ల వచ్చేడి బహుమానమైన హారములనుపొందుతున్నది.

శ్లో॥ అంతర్గతేతు సర్వాభే పరమాత్మని తద్బహిః।
భాసతేశ్రీ స్తదంగాని ముక్తాహారాణిచోరసి॥ 334

తా॥ మహాప్రకాశముతోకూడిన పరమాత్మ వక్షస్థలముయొక్క లోభాగమందున్నను ఆలోస్థానమునకు వెలపల (అనగా వక్షస్థలమున) ముత్యాలహారములు గంధము మొదలైన అంగములతో లక్ష్మీప్రకాశించుచున్నదని భావము.

శ్లో॥ మూర్ధాగంధ వహఃరదాశ్చ రసనాచాష్టాగళస్తాలునీ।
పాండిత్య ప్రకటీకృతౌ శ్రమయుతాస్యేతాని సర్వోద్యమైః।

పాణిః కంకణరూపకం ఫలమహో ప్రాపోన్నైశ్యభావశ్రమః।
గ్లానిః కస్యఫలంతు కస్యనితరాంచిత్రం విధేశ్చింతనం॥ ౩౩౫

తా॥ పాండిత్యప్రకటనమందు నడినెత్తి ముక్కు దంతములు నాలుక పెదవులు కంఠము దవడ గొప్ప ప్రయత్నములతో కూడా శ్రమ బుచ్చుకున్న వైనవి. ఇట్లుండను హస్తము పాండిత్యము వల్ల కలిగెడు తోడామొదలగు లాభములను పొందుతున్నది. కావునకష్టమొకనికి ఫలమొకనికి దేవుని ఆలోచన బహుఆశ్చర్యమైనది.

శ్లో॥ సఖ్యాయచైకాంసు జపాయచైకాం
శ్రాద్ధాయ దండాయ తథైవ చైకాం।
ధృత్వాంగుళీం భాతికరో విలాసీ
దానే నదండేన సుకంకణేన॥ ౩౩౬

తా॥ వివాహమునకు ఒకవ్రేలిని (అనగా చిటికెనవ్రేలుతో భార్య చెయిపట్టుకొని అగ్ని ప్రదక్షిణము చెయ్యవలయునని సంప్రదాయము. జపించుటకు పెద్దవ్రేలిని అనగా జపమునెంచుటకని భావము. శ్రాద్ధమునకు పవిత్రము నుంచుకొని చెయ్యవలయును గనుక అందుకొరకి కనామికను జనులవద్దయతని యధికారమును చూపించుచు నిగ్రహించుటకుతర్జనీయనెడు వ్రేలిని చెయ్యియైనది పొంది వేడుకతోకూడినదై యీవితో దండముతో కంకణముతో ప్రకాశించుచున్నదని చెయ్యిని కవి పొగడుచున్నాడు.

శ్లో॥ తీర్థాని తీర్థాని బహూని నిత్యం
సంచార్య సంచార్య పురాంఘ్రిణీమే।
జాతేధునా పూజ్యతమేచ సర్వైః
మాన్యేహికింనూ పురస్తాదుకైర్వా॥ ౩౩౭

తా॥ యీపాదములు ప్రతిదినం బహుక్షేత్రములును సంచరించి సంచరించి యిప్పుడు అందరిచేత పూజించతగినవై పుట్టినవిపాదములు యీఅందెలచే కడియములచే పాదుకలచేతపూజింపతగిన వవునాఏమి

కావునను పాదములకు పూజ్యత తీర్థాటనమేయనిభావము.

శ్లో॥ పాదైర్జలాని పీత్వాయం పాదపోభాతి పుష్పితః।
తథాపదాభ్యాం తీర్థాని గత్వాభాతి నరఃఫలీ॥ ౩౩౭

తా॥ వృక్షముపాదములచేత (అనగావేళ్లు) నీటినిత్రాగి పుష్పించినదై ప్రకాశించుచున్నది. అటులనే మనుజుడుకాళ్లచేత తీర్థములను గురించిపోయి ఫలములతోకూడా ప్రకాశించుచున్నాడు.

—(*) విద్వత్ప్రశంసా. (*)—

శ్లో॥ విద్వత్వంచ నృపత్వంచ నైవతుల్యం కదాచన।
స్వదేశే పూజ్యతేరాజా విద్వాన్ సర్వత్రపూజ్యతే॥ ౩౩౮

తా॥ పాండిత్యమున్ను రాజరికమున్ను ఎప్పుడున్ను సమానమేకాదు రాజుస్వదేశమందేపూజింపబడును విద్వాంసుడుసర్వత్రపూజింపబడును.

శ్లో॥ ఇభతురగశతైః ప్రయాన్తిమూర్ఖాః
ధనరహితాశ్చబుధాః ప్రయాన్తిపద్భ్యాం।
గిరిశిఖరగతాపి కాకపఙ్క్తిః
పులినగతైర్నసమత్వమేతిహంసైః। ౩౪౦

తా॥ మూర్ఖులు ఏనుగలు గుఱ్ఱములుతోకూడా పోవుచున్నారు. విద్వాంసులు ధనములేనివారై కాళ్లతో నడిచి పోవుచున్నారు కాకుల వరుస పర్వతశిఖరమందున్నను ఇసుకదిబ్బలలో తిరుగాడు హంసలతో సమానమును పొందదు.

శ్లో॥ ఉదీరితోర్థః పశునాపిగృహ్యతే
హయాశ్చనాగాశ్చ వహన్తినోదితాః।
అనుక్తమప్యూహతిపండితోజనః
పరేంగితజ్ఞాన ఫలాహిబుద్ధయః॥ ౩౪౧

తా॥ తాత్పర్యమును చెప్పినయడలపశువుకూడాగ్రహించుచున్నది. ఏనుగలు గుఱ్ఱములుకూడా ప్రేరేపింప బడినయడల మోసుకొని పోవుచున్నవి పండితులు చెప్పకపోయినప్పటికిన్ని ఊహించుచున్నారు ఏనున

గా బుద్ధులు ఇతరులయభిప్రాయమును తెలుసుటయే ప్రయోజనముగా గలవిగదా. అట్టిబుద్ధిమంతులు పండితులని భావము.

శ్లో॥ అర్థాహరణ కౌశల్యం కింస్తుమశ్శాస్త్రవాదినాం।
అవ్యయేభ్యోపియే చార్థాన్ నిష్కర్షన్తి సహస్రశః॥ ౩౮౨

తా॥ అవ్యయమనగా శెలవుచెయ్యని కృపణునికిపేరు(చతు) మొదలైన అవ్యయములకుపేరు. అర్థమనగా (ద్రవ్యముతాత్పర్యము) అవ్యయములనుండి వేలువేలుగా అర్థములను యెవరుతీర్మానించుచున్నారో అట్టిశాస్త్రజ్ఞులయొక్క, అర్థములనుసంపాదించెడి సామర్థ్యమును మేము ఏమనికొండాడుదుము.

శ్లో॥హర్తుర్యాతిన గోచరంకిమపిశం పుష్ణాతియత్సర్వదా।
హ్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతివృద్ధింపరాం।
కల్పాన్తేష్వపిన ప్రయాతినిధనం విద్యాఖ్యమన్తర్ధనం।
యేషాంతాన్ప్రతిమానముజ్ఝతనృపాః కస్తైస్సహస్పర్థతే॥ ౩౮౩

తా॥ అపహరించెడువారికి గోచరముకాదు.ఎల్లప్పుడుయేదోవక సుఖమును పెంచుచున్నది. యాచకులకిచ్చినను వృద్ధిపొందుచున్నది కల్పాన్తమైన ప్రళయకాలమందును నాశనమునుపొందదు ఈలాటివిద్యయనే పేరుగల మూలధన మెవరికున్నదో అట్టివిద్వాంసులను గురించి ఓరాజులారా గర్వమును విడువుడు వారితో నెవడువిరోధించుకొనును.

—(*) కలితాప్రకరణం. (*)—

శ్లో॥ జయన్తితేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తియేషాంయశఃకాయే జరామరణజంభయం॥ ౩౮౪

తా॥ యెవరియొక్క యశస్సనే శరీరమందు వృద్ధాప్యము మరణమనే భీతిలేదో అట్టిప్రఖ్యాత్ములైన రసప్రధానులైనకవిశ్రేష్ఠులుజయించుచున్నారుగదా.

శ్లో॥ విద్వత్కవయః కవయః కేవలకవయస్తు కేవలం కపయః।
కులజాయా సాజాయా కేవలజాయాతు కేవలంమాయా॥ ౩౮౫

తా॥ విద్వాంసులై కవనముచేసెడివారే కవులుగాని పాండిత్యములేక సాధారణముగా కవులుమాత్రమైనయెడల వారుకవులే (అనగా కోతులే.) ఎట్లన్నను మంచికులమందుబుట్టి వివాహముజేసుకొన్నదే భార్య వివాహించుకొనక నుంచుకున్న భార్య కేవలం మోసవంతురాలు. ఆరీతిన శాశ్వతముగా కవిత్వముండదని భావము.

శ్లో॥ కవిః కరోతిపద్యాని లాలయత్యుత్తమోజనః।
తరుఃప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభం॥ ౩౪౬

తా॥ కవిపద్యములను కట్టుచున్నాడు గొప్పవారు వాటినివినిఆనందించి ఆ అర్థములను మనస్సునధరించి బుజ్జగించుచున్నారు ఎట్లనగా వృక్షము పుష్పములను కలగజేయుచున్నది. వాయువు ఆవాసననుధరించుచున్నది.

శ్లో॥ కవయః పరితుష్యన్తినేతరే కవిసూక్తిభిః।
నహ్యకూపారవత్కూపాః వర్ధన్తేవిధుకాంతిభిః॥ ౩౪౭

తా॥ కవులయొక్కమాటలచేత కవులే సంతోషించుచున్నారు. ఇతరులంత సంతోషించరు. ఎట్లనగా సముద్రమువలె భావులు చంద్రకిరణములచేత వృద్ధిపొందవు.

శ్లో॥ కింకవేస్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః।
పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతియచ్ఛిరః॥ ౩౪౮

తా॥ ఇతరునియొక్కమనస్సున కావ్యముయొక్క రసమైన తాత్పర్యము అంటుకొననియెడల ఆకవికి ఆకావ్యముచేతనేమిప్రయోజనము. శత్రువుయొక్క శిరస్సు ఖండించనియెడల ఆవిలుగానికి ఆబాణముచేతనేమిప్రయోజనము.

శ్లో॥ అర్థాన్కే చిదుపాసతే కృపణవత్కేచిత్త్వలం కుర్వతే।
వేశ్యావత్ఖలుధాతువాదినఇవో ద్బధ్నన్తికేచిద్రసాన్।
అర్థాలంకృతి సద్రసద్రవముచాం వాచాం ప్రశస్తిస్పృశాం।
కర్తారః కవయోభవన్తి కతిచిత్పుణ్యైరగణ్యైరిహ॥ ౩౪౯

తా॥ కొంతమందికవులు కృపణులవలె అర్థములను (ద్రవ్యములను) అవలంబించుచున్నారు కొంతమంది వేశ్యలవలె (శబ్దములచే) అలంకరించుకొనుచున్నారు. కొంతమంది కవులు రసవాదములను జేసెడివారివలె రసములనుకట్టుచున్నారు. (రసమనగా) శృంగారాదిరసం రసగంధకాదులు) అర్థము శబ్దాలంకారము మనస్సును కరిగించెడిరసము వీట్లను కలగజేసెడు వాక్కులను ప్రయోగించెడు కవులు ఈలోకమందు విశేషపుణ్యములచేతనే కలుగుచున్నారు.

శ్లో॥ మదుక్తిశ్చేదన్తర్మదయతి సుధీభూయసుధియః।
కిమస్యా నామస్యా దలస పురుషాఽనాదరభరైః।
యథాయూన స్తద్వత్పరమ రమణీయాపి రమణీ।
కుమారాణామన్తః కరణ హరణంనైవ కురుతే॥ ౩౫౦

తా॥ నావాక్యము అమృతమువలె నేర్పడి విద్వాంసునికి లోపల ఆనందముచే మదమును కలగజేయుచున్నదిఅలాటినా యీమాటకు మందబుద్ధులయొక్క అనాదరమనే భారములచేత నేమితక్కువ యెట్లనగా రమించుస్త్రీ యౌవనవంతుని కెట్లుమనోహరమో అటులనాస్త్రీ బాలులయొక్కమనస్సును అపహరించునా ఏమి అటువలెనే మందులకు కవివాక్యముచే ఫలములేదు.

శ్లో॥ కావ్యంకరోతిసుకవిః సహృదయ ఏవవ్యనక్తితత్త్వం॥
రత్నాఖనిః ప్రసూతే రచయతి శిల్పీతు తత్సుషమాం॥ ౩౫౧

తా॥ మంచికవి కావ్యమునుచేయుచున్నాడు దానియొక్కతాత్పర్యమును రసముతోకూడిన సరసుడు ప్రకాశింపజేయుచున్నాడు. ఎట్లనగా నిక్షేపము రత్నములను కనుచున్నదిదానియొక్కశోభనుశిల్పిప్రకాశింపజేయుచున్నాడు.

శ్లో॥ మన్దంనిక్షి పతేపదాని పరితః శబ్దాసముద్వీక్షతే।
నానార్థా హరణంచకాంక్షతి ముదాలంకార మాకర్షతి।
ఆదత్తే సకలంసువర్ణనిచయం ధత్తేరసా న్తర్గతం।

దోషాన్వేషణ తత్పరో విజయతే చోరోపమ స్సత్కవిః॥ ౩౫౨

తా॥ మంచికవి కావ్యమందు సుబన్తతి జన్తపదములను ఆర్భాటములేక మెల్లిగా ప్రయోగించుచున్నాడు. చుట్టుపక్కల శబ్దములను చూచుచున్నాడు అనేకార్థములు కలుగుటను కోరుచున్నాడు అనేక అలంకారములను లాగుచున్నాడు అనేకమంచి వర్ణముల సమూహము గ్రహించుచున్నాడు శృంగారాది రసములతో కూడినట్టుగా చేయుచున్నాడు దోషముకనిపెట్టుట యందాసక్తుడౌచున్నాడు యీలాటి కవిదొంగిలించెడు వానివలె నుంటున్నాడు అడుగులు మెల్లిగా పెట్టుట చుట్టుప్రక్కన ఏమిశబ్దము కలుగునని చూడడము అనేక ద్రవ్యములు వచ్చుటను కోరడము అలంకారమును పొందడము బంగారములను పొందడము వాటిని భూమియందుంచడము దొంగిలించుట రాత్రి నపేక్షించడము అనే యధార్థాంతరముచేత చోరునికి కవిసమానత కలిగెను.

## —(*) కుకవినిందా. (*)—

శ్లో॥ గణయన్తి నాపశబ్దం నవృత్త భంగంక్షయం నచార్థస్య!
రసికత్వేనా కులితా వేశ్యాపతయః కుకవయశ్చ॥ ౩౫౩

తా॥ వేశ్యలమగలవలె కుత్సితకవులు అపశబ్దమును ఎంచరు వృత్తములు చెడిపోయినవని చూడరు అర్థము తగ్గిపోయినదని గమనించరు అనగా (అపశబ్దంనిందన) వృత్తం నడవడిక అర్థం ద్రవ్యము అనే అర్థాంతరముచేత కుకవులు వేశ్యలమగలతో సామ్యము కలిగెను.

శ్లో॥ అప్రగల్భాః పదన్యాసే జననీరాగ హేతవః।
సంత్యేకే బహులాలాపాః కవయో బాలకా ఇవ॥ ౩౫౪

తా॥ పదములు ప్రయోగించుటయందు సామర్థ్యములేక జనుల యొక్క విరసమున కుపకరణభూతులై అనేకముగా పదరుటలతోకూడి నకవులు బాలకులవలె కొంతమంది ఉంటున్నారు అనగా అడుగులు పెట్టుటయందసమర్థులు (జననీ) తల్లియొక్క అనురాగమునకు కారణభూ

తుత్రై అనేకముగా (లాలా) జొల్లునేత్రాగుచున్న బాలకులతో సమా నులని భావము.

శ్లో॥ కవిభిర్నృపసేవాసు విత్తాలంకారహారిణీ।
వాణీవేశ్యేవలోభే నపరోపకరణీ కృతా॥ ౩౫౫

తా॥ రాజలనుకొలుచుటయందు. ద్రవ్యములను ఆభరణాలంకార ములను తీసుకొనుచున్న వాక్కు, కవులచేత లోభముచే యితరులకు సా ధకమైన బోగందానివలె చేయబడినది.

శ్లో॥ అన్యవర్ణ పరావృత్త్యా బంధచిహ్నని గూహనైః।
అనాఖ్యాతాస్సతాం మధ్యే కవిశ్చోరో విభావ్యతే॥ ౩౫౬

తా॥ వేరు అక్షరములను కూర్చుటచేత ఛందోబంధముల గురు తులను మరిగించుటచేత సాధువులమధ్యయందు కుకవి. దొంగయని తల చబడుచున్నాడు వర్ణమనగా తనజాతినివిడిచి మరియొక జాతిని కల్పిం చుకొనుట తనకట్టుపాటులను మరిగించుకొనుట అనే అర్థముచే కవికి చోరసామ్యమేర్పడెను.

—(*) విద్యా. (*)—

శ్లో॥ నచోరహార్యం నచరాజహార్యం నభ్రాతృభాజ్యంనచభారకారీ।
వ్యయేకృతేవర్ధత ఏవనిత్యంవిద్యాధనం సర్వధనప్రధానం॥ ౩౫౭

తా॥ విద్యయనెడు ద్రవ్యము దొంగచే నపహరించతగదు రాజు లు కొనిపోవ తగదు సహోదరులకు భారముగా నేర్పడదు శెలవు చేసినను వృద్ధి పొందుచున్నది గనుక విద్యాధనము అన్నిధనములకు ప్రధానద్రవ్యము.

శ్లో॥ సద్విద్యా యదికాచిన్తా వరాకోదరపూరణే।
శుకోప్యశనమాప్నోతిహరే రామ ఇతిబ్రువన్॥ ౩౫౮

తా॥ మంచివిద్యవున్నయడల చిన్నదగుకుక్షిని నిండించుటకు నేమి చింత చిలుకకూడ హరేరామయని చెప్పచు ఆహారమును సంపాదించు కొనుచున్నది మనకేమి చింతయని భావము.

శ్లో॥ విద్యయావినయావాప్తిః సాచేదవినయావహా।
కింకుర్మఃకింప్రతిబ్రూమః గరదాయాం స్వమాతరి॥ ౩౫౯

తా॥ విద్యచేత వినయము పొందుచున్నది. ఆలాటి విద్య వినయమును యివ్వక చెడ్డగుణమును కలిగించినయెడల తనతల్లివిషమిచ్చిన యెడల ఏమి చెప్పుదుము యేమి చేయుదుము అనగా తల్లి తనబిడ్డకు విషమునిచ్చుట సాధారణముగా నేర్పడదని యేదో విశేషకారణములచేత నేర్పడవలయునని ఆలాగుననే విద్యచేత అవినయము తరుచుగా నేర్పడదని భావము.

శ్లో॥ కింకులేన విశాలేన విద్యాహీనస్య దేహినః।
అకులీనోపివిద్యావాన్ దేవైరపి సపూజ్యతే॥ ౩౬౦

తా॥ విద్యలేని మనుజునికి గొప్పకులంచే నేమిప్రయోజనము సామాన్యకులమందు బుట్టినను విద్యావంతుడైన యెడల దేవతలచేతను పూజింపబడుచున్నాడు.

శ్లో॥ వీణేవశ్రోత్రహీనస్య లోలాక్షీవవిచక్షుషః।
వ్యసోఃకుసుమమాలేవ విద్యాస్తబ్ధస్య నిష్ఫలా॥ ౩౬౧

తా॥ చెవిలేనివానికి వీణవలె కన్నులేనివానికి బెదురు చూపులతో కూడిన యాడుదివలె ప్రాణములేనివానికి పుష్పమాలికవలె ఆయా సమయమున ఉపయోగించ శక్తిలేని మందునికివిద్య ఆరీతిన ప్రయోజనము లేనిదౌను.

శ్లో॥ గతేపివయసిగ్రాహ్యా విద్యాసర్వాత్మనాబుధైః।
యద్యపిస్యాన్నఫలదా సులభాసాన్యజన్మని॥ ౩౬౨

తా॥ వయసుచెల్లిపోయినను బుద్ధిమంతులచే సర్వప్రకారముతో విద్యపొందతగినదే అవును అప్పుడా విద్యఫలమునిచ్చెడిది కాకపోయినను మరుజన్మమందు సులభముగ ఫలమునిచ్చెడి దగును.

శ్లో॥ శునఃపుచ్ఛమివవ్యర్థం జీవితంవిద్యయావినా।
నగుహ్యగోపనేశక్తం నచదంశనివారణే॥ ౩౬౩

తా॥ కుక్కతోకవలె విద్యలేనివాని బ్రతుకువ్యర్థము కుక్కతోకచే మర్మస్థానమును మూసుకొనుటయందు ఫలములేదు యీగలు దోమలు మొదలైనవి తోలుటయందు ఫలములేదు.

శ్లో॥ మాతేవరక్షతి పితేవహితేనియుంక్తే
కాంతేవచాపిరమయత్యపనీయఖేదం।
లక్ష్మీంతనోతి వితనోతిచ దిక్షుకీర్తిం
కింకింనసాధయతి కల్పలతేవ విద్యా॥ ౩౬౪

తా॥ తల్లివలె విద్యరక్షించుచున్నది తండ్రివలె హితమునందుంచుచున్నది భార్యవలెశ్రమమును పోగొట్టి సుఖంపజేయుచున్నది. సంపదను కలగ జేయుచున్నది దిక్కులయందు యశస్సును వృద్ధి జేయుచున్నది గనుక కల్పతీగవలె విద్యాదేనిని దేనిని సాధించి యివ్వదు.

—(*) వైయ్యాయికప్రశంసా. *)—

శ్లో॥ మోహంరుణద్ధివిమలీకరుతేచబుద్ధిం
సూతేచ సంస్కృత పదవ్యవహారశక్తిం।
శాస్త్రాన్తరాభ్యాసన యోగ్యతయాయునక్తి
తర్కశ్రమోనతనుతేకి మిహోపకారం॥ ౩౬౫

తా॥ తర్కశాస్త్రము అజ్ఞానమును అటంకపరుచుచున్నది బుద్ధిని నిర్మలము జేయుచున్నది సంస్కృతశబ్దములచే మాటలాడుటయందు తెంపును కలగ జేయుచున్నది. ఇతర శాస్త్రముల నభ్యసించుటయందు యోగ్యతతో చేరుచున్నది గనుక ఏమి ఉపకారమును జేయ్యదు.

శ్లో॥ ప్రాయఃకావ్యైర్గమితవయసః పాణినీయ్యాంబురాశేః
సారజ్ఞస్యాప్యపరి కలితన్యాయశాస్త్రస్య పుంసః।
వాదారంభేవదితు మనసోవాక్యమేకం సభాయాం
ప్రహ్వా జిహ్వా భవతికియతీం పశ్యకష్టామవస్థాం॥ ౩౬౬

తా॥ ఇంచుకంతమైనను తర్క శాస్త్రమునుజూడక కావ్యముల చేతనే వయసంతపోగొట్టి వ్యాకరణమనే సముద్రసాగరమును తెలుసు

కొని సభయందు వాదారంభ కాలమున ఒకవాక్యమునైనా చెప్పటకు మనసుతోకూడిన పురుషుడియొక్క నాలిక అణిగినదైయున్నది ఎంతకష్ట స్థితిని పొందినదిచూడుము.

శ్లో॥ అపరిక్షితలక్షణ ప్రమాణైరపరామృష్ట పదార్థసార్థ తత్త్వైః।
అవశీకృతజైత్రయుక్తిజాలైరలమేతైరనధీతతర్కశాస్త్రైః॥ ౩౬౭

తా॥ జహల్లక్షణాది ప్రమాణములను పరీక్షించక భూమి మొదలగు పదార్థములను పరామర్శించక జయించెడు యుక్తి సముదాయమును స్వాధీనపరుచుకొనక నున్న తర్కశాస్త్రమును చదవని పురుషులచేత నేమిప్రయోజనము.

శ్లో॥ అద్భుతస్తర్కపాథోధిర గాధో యస్య వర్ధకః।
అక్షపాదోఽతమస్స్పృష్టస్త్ర్యకళంకః కలానిధిః॥ ౩౬౮

తా॥ యే సముద్రమును వృద్ధిపొందించెడు చంద్రుడు రాత్రిని కలిగించనివాడుగా రాహువుచే తాకనివాడు కళంకములేనివాడేర్పడెనో అట్టి గర్గమనే లోతైన సముద్రము బహుఆశ్చర్యమైనది యీతర్కమును వృద్ధిపొందించెడు వాడు గౌతమముని అక్షపాదుడుగాను(అనగా)అరికాలిన కన్నుగలవాడుగాను అతమస్సనగా అజ్ఞానముచేత తాకనివాడుగా పాపరహితుడుగాను సర్వవిద్యలకు ఆధారభూతుడుగాను నున్నాడని భావము.

—(*) నైయ్యాయికనిందా. (*)—

శ్లో॥ కర్మబ్రహ్మవిచారణాం విజనతో భోగాపవర్గ ప్రదాం
ఘోషంకంచన కంఠశోషఫలకం కుర్వన్త్యమీ తార్కికాః।
ప్రత్యక్షం నపునాతినాపహరతే పాపాని పీలుచ్ఛటా
వ్యాప్తిర్నావతి నైవపాత్యనుమతిః నోపక్షతా రక్షతి॥ ౩౬౯

తా॥ ఐహికఫలమును ఆముష్మికఫలము నిచ్చుచున్న కర్మకాండ విచారమును విడుచుచున్న వారై కంఠశోష మాత్రము ప్రయోజనమైన గొప్ప అరుపుశబ్దమును యీ తార్కికులు చేయుచున్నారు ప్రత్యక్ష ప్ర

మాణమని అరుచుచున్నారే యీ ప్రత్యక్షశబ్దము వీరిని పరిశుద్ధులనుగా జేయుచున్నదా లేదు అటులనే పీలుచ్ఛటాశబ్దములు పాపములనుపోగొట్టదు అవ్యాప్తి అతివ్యాప్తియనెడుది వీరిని కాపాడదు అనుమతిన్ని కాపాడదు పక్షతాయనెడుదిన్ని రక్షించదు గనుక ఆభాటశబ్దములను ప్రయోగించి వ్యర్థముగ ప్రొద్దుబోగొట్టుచున్నారు కేవలవాచాలకులే గాని యః క్రియావాన్ సపండితః అనే ప్రకారం క్రియావంతులుగారని భావము.

శ్లో॥ నజిఘ్రిత్వామ్నాయం స్పృశతినతదం గాన్యపిసకృత్
పురాణంనాదత్తేన గణయతికించ స్మృతిగణం।
పరన్ శుష్కంతర్కం పరపరిభవార్థోక్తి భిరసౌ
నయత్యాయుస్సర్వం నిహతపరలోకార్థ యతనః॥ ౩౭౦

తా॥ వేదమును వాసనచూడడు వేదాంగములను ఒకానొకప్పుడైనను తాకడు పురాణమును గ్రహించడు స్మృతులను మదించడు మరేమంచే సారములేని తర్కమును చదువుడు ఇతరులను అవమదించడమునకు మాత్రమే ప్రయోజనమైన కొన్ని మాటలచేత పరలోక ఫలప్రయత్నములేనివాడై అంత ఆయుర్దాయమును వ్యర్థపరచుచున్నాడు.

శ్లో॥ ప్రయత్నైరస్తోకైః పరిచితకుతర్క ప్రకరణాః
పరంవాచోవశ్యాన్ కతిపయపదౌఘాన్ విదధతః।
సభాయాం వాచాటా శ్రుతికటురటన్తో ఘటపటాన్
నలజ్జన్తేమందాః స్వయమపితుజిహ్రేతి విబుధః॥ ౩౭౧

తా॥ అనేక ప్రయత్నములచేత కుత్సితప్రకరణములను పరిచయం చేసినవారై వాచోవిధేయములై కొన్ని మాటలను ప్రయోగింపుచు సభయందు వాచాలకులై చెవికివిరోధముగ ఘటపట శబ్దములను పదరుచు మూఢులు శిగ్గుపడరు విద్వాంసుడైనను తానుశిగ్గుపడడుగదా.

—(*) వైయ్యాకరణస్తుతినిందా. (*)—

శ్లో॥ వైయ్యాకరణ కిరాతాదపశబ్దమృగాః క్వయాన్తిసంత్రస్తాః।

జ్యోతిర్నటవిటగాయకభిషగానసగహ్వరాణియదినస్యుః॥ ౩౨౩

తా॥ జ్యోతిష్కులు నటులు విటులు గాయకులు వైద్యులు వీరి యొక్క ముఖములు లేనియెడల అపశబ్దములనెడిమృగములు వైయ్యాకరణుడనెడి బోయవేటగాని వలన భయపడినవై ఎక్కడపోయి చేరును.

శ్లో॥ కుప్యోఃకప్యోచశేషోఘ్యసఖి సనజుషోమర్గ్విరామోఽవసానం

శచ్ఛోటీత్యాదిశబ్దైఃసదపియదిశతాశ్నాద్రికాఃపండితాస్యుః।

తేషాంకోవాపరాధఃకధయతసతతంమేపరస్త్రీహ(ధోత్త్ర

త్త్రాక్షయ్యాధయ్యాధయ్యాధిగధిగధిగధిక్ఫయ్యాధయ్యేతి)శబ్దాన్॥

తా॥ పైసూత్రశబ్దములను సభయందు చెప్పటచే దుష్టులైన వైయ్యాకరణులేపండితులైనయెడల యేనటులు ధయ్యాధయ్యాదిశబ్దములను చెప్పుచున్నారో వారికేమిదోషము చెప్పుడు.

శ్లో॥ కృతదురితనిరాకరణం వ్యాకరణంచతురధీరధీయ్యానః।

బుధగణగణనావసరేకనిష్ఠికాయాం పరంజయతి॥ ౩౨౪

తా॥ చేసినపాపమును పోగొట్టెడు వ్యాకరణమును చదువుచున్న బుద్ధిశాలియైనవాడు విద్వాంసుల సమూహమును లెక్కపెట్టెడు సమయమున చిటికెనవ్రేలి ఉత్తమభాగమును జయించుచున్నాడు అనగా యీవైయ్యాకరణునిగూడ జ్ఞాపకముతో యెంచుదురని భావము.

శ్లో॥ పాతం జలేవిష్ణుపదాపగాయాః

పాతంజలే చాపినయేఽవగాహం।

ఆచక్షతే శుద్ధిదమాప్రసూతే

రాచక్షతే రాగమధోక్షజేచ॥ ౩౨౫

తా॥ గంగానదీ జలమందుపడుట పుట్టినదిమొదలు శుద్ధినిచ్చెడిదానినిగా చెప్పబడుచున్నది పతంజలిచే చెప్పబడిన నూతనమైన భాష్యశాస్త్రమందభ్యాసము పరమాత్మయందను రాగమును జెప్పుచున్నది.

శ్లో॥ సూత్రంపాణినిబద్ధం కలయన్ పురుషస్సముద్వహతి సుదృశం।

వర్ణాదీనాం ధర్మాన్ విధివత్ బుద్ధ్వాప్రయుక్తేసా॥ ౩౨౬

తా॥ పాణినిచేత ఏర్పరచిన సూత్రమును అర్థజ్ఞాన పూర్వకము గా నభ్యసించుచున్న పురుషుడు వివేకమనే మంచికన్నును పొందుచున్నాడు బ్రాహ్మణాది వర్ణములయొక్క ధర్మములను తెలుసుకొని తగినట్లు ప్రయోగం జేసును. (ఇంకొకఅర్థము) చేత కట్టుకొన్న కంకణసూత్రము ను ధరించిన పురుషుడు మంచి స్త్రీని వివాహము జేసుకొనును బ్రాహ్మణాది వర్ణముల ధర్మములను తెలుసుకొని తగినట్లు సత్కర్మములతో స్త్రీని మనస్సును చేర్చును.

—(*) వైద్యనిందా. (*)—

శ్లో॥ వైద్యరాజనమస్తుభ్యం యమరాజసహోదర।
యమస్తుహరతిప్రాణాన్ వైద్యః ప్రాణాన్ ధనానిచ॥ ౩౭౭

తా॥ యమధర్మరాజుకు సహోదరుడైన ఓవైద్యశ్రేష్ఠనీకు నమస్కారము. ఐతే యముడుప్రాణములనుమాత్ర మపహరించును వైద్యుడు ప్రాణములను ధనములనపహరించుచున్నాడు గనుకనమస్కారము.

శ్లో॥ మిథ్యౌషధైహరాన్తవృషాకషాయై
రసహ్యలేహ్యై రయథార్థతైలైః।
వైద్యాఇమేవంచితరుగ్ణవర్గాః
పిచండభాండం పరిపూరయంతి॥ ౩౭౮

తా॥ అబద్ధమూలికలచేత అవాస్తవమైన కషాయములచే లోకమందులేని తైలములచేత అసందర్భలేహ్యములచేత రోగులను వంచింపచేయుచున్న యీవైద్యులు కడుపుఅనే పెద్దకుండను నిండింప జేయుచున్నారు.

శ్లో॥ కషాయైరుపవాసైశ్చ కృతాముల్లాఘతాంనృణాం।
నిజౌషధకృతో వైద్యోనివేద్య హరతేధనం॥ ౩౭౯

తా॥ కషాయములచేతను ఉపవాసములచేతనుచేయబడిన మనుష్యులరోగశాంతిని వైద్యుడు తనఔషధములచేత చేయబడినదని తెలిపించి ద్రవ్యమును అపహరించుచున్నాడు.

## —(*) వైద్యస్తుతిః. (*)—

శ్లో॥ గురోరధీతాఖిలవైద్యవిద్యః పీయూషపాణిః కుశలః క్రియాసు।
గతస్పృహో ధైర్యధరః కృపాలుః శుద్ధోధికారీ భిషగీదృశస్స్యాత్ ॥౪౦౦

తా॥ గురువువలన పొందబడిన సకలవైద్య విద్యతో కూడినవాడు గాను అమృతహస్తముతో కూడినవాడుగాను ఔషధములు జేసుటయందు సమర్థుడును ద్రవ్యమందు ఆశలేనివాడై ధైర్యముతో కూడినవాడై దయతో కూడినవాడుగాను శుద్ధమైన అధికారియగు వైద్యుడీట్లుండును.

శ్లో॥ మస్తేదుస్సహవేదనా కబళితే భగ్నేస్వరేంతర్గళం।
తప్తాయాం జ్వరపావకేనచ తనౌ తాన్తేహృషీకవ్రజే।
దూనేబంధు జనేకృతప్రలపనే ధైర్యంవిధాతుం పునః।
కశ్శక్తః కలితామయప్రశమనే వైద్యాత్పరో విద్యతే॥ ౪౦౧

తా॥ శిరస్సుగొప్పనొప్పిచే నాక్రమించగా లోగొంతుగా మాట బలహీనమైపోగా జ్వరతాపముచేత శరీరము తపించుచుండగా అన్ని యింద్రియములు పాటవతప్పిపోగా విలపించుచున్న బంధువులు ఖేదమునొందగా నట్టికాలమున ధైర్యమును కలగజేయుటకై వైద్యునికంటె మరెవడు రోగశాంతి చేయువాడు శక్తుడున్నాడు.

శ్లో॥ నిర్వృత్తాధ్వరకృత్య ఋత్విజమహోతీర్ణాపగో నావికం।
యుద్ధాన్తేసుభటంచసిద్ధ విజయః పోఘారమాప్తస్థలః।
వృద్ధంవారవధూజనశ్చకితవో నిష్ఫల్యతద్యౌవనః।
ధ్వస్తాతంకచయశ్చికిత్సకమపిద్వేష్టి ప్రదేయార్థినం॥ ౪౦౨

తా॥ యాగమును ముగించుకొన్న యజమానుడు ఋత్విక్కును. నదిని దాటినవాడు పడవవానిని. జయించినవాడు యుద్ధాన్తమందు పదాతిని, పోతగినచోటును పొందినవాడు మోసుకొనిపోయెడువానిని, వృద్ధుల యౌవనమును అవమదించెడు కపటముతో కూడిన వేశ్యల గుంపు

ముసలివానిని. రోగముతీర్చుకున్నవాఁడు ఇవ్వవలసినదానిని కోరుచున్న వైద్యుని విరోధించుచున్నాఁడుగదా.

శ్లో॥ భ్రాన్తా వేదాన్తినః కింపరదశరతయాఽధ్యాపిచాద్వైతవిద్యాం
పృథ్వీతత్వేఽలరన్తో విమృశథసతతం కర్కశాస్త్రార్కికాః కిం।
వేదైర్నానాగమైః కిఙ్గ్లపయథ హృదయంశ్రోత్రియాః శ్రోత్రశూలై
ర్వైద్యంసర్వావ వద్యంవిచినుత శరణం ప్రాణ సంప్రీణనాయ॥ ౪౦౩

తా॥ ఓభ్రాన్తులైన వేదాన్తులే దుష్టతనముచేత నిష్ఫమున్న (అనగా రోగముకలిగిన యీకాలమునను) వేదాంతమును చదువుచున్నారే ఏమి ఓకర్కశులైన తార్కికులారా ఎల్లప్పుడు పృథ్వ్యాది తత్వమున పొరలాడుచు పరామర్శించుచున్నారా ఏమి ఓవైదికులారా చెవులకు శూలములైయున్న వేదములచే నానావిధములైన ఆగమములచేత హృదయమును తపింపజేయుచున్నారా ఏమి ఆశాస్త్రములిప్పుడు ప్రాణములు సుఖముగానుండుట కుపయోగ పడవు గనుక యెల్లప్పుడు పూజించతగిన వైద్యశాస్త్రము రక్షకమని నిశ్చయించుడు.

—(*) గణకప్రశంసా. (*)—

శ్లో॥ భానోశ్శీత కరస్యవాపి భుజగగ్రాసే పురోనిశ్చితే।
తీర్థానామటనం జనస్యఘటతే తాపత్రయోచ్చాటనం।
ఇష్టేప్రాగవధారితే సతిధృతే స్తుష్టేశ్చలాభోభవేత్।
తుష్టేతు వ్యసనేత్ర తత్పరిహృతిః కర్తుంజనాద్వైర్యఃక్షమా॥ ౪౦౪

తా॥ సూర్యచంద్రులకు రాహుగ్రహణము ముందుగానే నిశ్చయించినయడల జనులకు సర్వోపద్రవములను పోగొట్టెడు తీర్థయాత్ర లభించుచున్నది ఫలానిదశయందు ఫలాని ఇష్టకార్యము జ్యౌతిషకులచే చెప్పబడినందున ఆయిష్టము మనస్సున ధరించినయడల ధైర్యలాభమును సంతోషలాభమున్ను కలుగుచున్నది దుఃఖము సంతోషమైనయడల వ్యసన నివృత్తి జపాదులచేత చేయుటకు తగియుంటున్నది.

శ్లో॥ వృద్ధిహ్రాసౌ శశమదసుహృదః పుష్పవంతోపరాగః।
శుక్రాదీనా ముదయవిలయౌ విత్యమీ సర్వదృష్టాః।
ఆవిష్కుర్వం త్యఖిలవచనే ష్వత్రకుంభీపులాకః।
న్యాయాజ్జ్యోతిర్నయగతి విదాం నిశ్చలంమానభావం॥ ౪౦౫

తా॥ చంద్రునియొక్క వృద్ధిక్షయములు సూర్య చంద్రులయొక్క గ్రహణమును గురుశుక్ర ఉదయాస్తములు నడరిచే చూడబడిన యీ విషయములు అన్ని మాటలయందును కుంభీపులాకన్యాయమువలనవ్యక్త పడుచున్నవి గనుక జ్యోతిశ్శాస్త్ర మార్గము తెలుసుకొన్న వారికి పూజ్యతస్థిరమే.

శ్లో॥ అసుఖమథసుఖంవా కర్మణాం పక్తివేళా।
స్వహహనియతమేతే భుంజతే దేహభాజః।
తదిహపురత ఏవప్రాహమా హూర్తికశ్చేత్।
కథయఫలమ మీషామంతతః కింతతస్యాత్॥ ౪౦౬

తా॥ కర్మలయొక్క పరిపాక దశలలో మనుష్యులు సుఖమో దుఃఖమో నియతమైనదానిని అనుభవించుచున్నారు. అట్టిసుఖదుఃఖములను ఇక్కడముందుగానే జ్యోతిష్కుడు చెప్పెడు యడల పిమ్మట వీరికి ప్రశయముచేతనేమి ప్రయోజనము కలుగును.

శ్లో॥ వినాదైవజ్ఞం గ్రామం విబుధ విధురాం భూపతిసభాం।
ముఖంశ్రుత్యాహీనం మనుజపతి శూన్యంచవిషయం।
అనాచారాన్దారా నపహరికథం కావ్యమపిచ।
ప్రవక్తృత్వాపేతం గురుమపి సుబుద్ధిః పరిహరేత్॥ ౪౦౭

తా॥ జ్యోతిష్కుడులేనిగ్రామమును విద్వాంసులులేని రాజసభను వేదహీనమైన ముఖమును రాజులేని సభను ఆచారములేని భార్యను హరికథలేని కావ్యమును ప్రవచన సామర్థ్యములేనిగురువును బుద్ధిశాలియైనవాడు విడవవలయును.

—(*) కుగణకనిన్దా. (*)—

శ్లో॥ గణికాగణకౌ సమానధర్మౌ నిజపంచాంగ నిదర్శితావుభౌ।
జనమానసమోహకారిణౌ తౌ విధినావిత్తహరౌ వినిర్మితౌ॥ ౪౦౮

తా॥ తమతమ పంచాంగములను చూపించుచున్న వేశ్యయు జ్యోతిష్కుడు సమానధర్మము గలవారలే పంచాంగమనగా పంచాంగ మున కున్నూ. చేతులు. స్తనములు, ముఖము, నేత్రములు, మందహాసము, యీలాగున నేక ప్రకారములుగా నేర్పడుచున్న అయిదు అంగములనిభావము పైవుభయులు బ్రంహ చేతజనులయొక్క మనస్సును మోహింపచేయువారలుగా ద్రవ్యము నపహరించెడువారలుగా గలగ జేయబడెరిగదా.

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రి మహోదధౌ బహుతరోత్సర్గాపవాదాత్మభిః
కల్లోలైర్నిబిడేకణాః కతిపయాః లబ్ధ్వాకృతార్థాఇవ।
దీర్ఘాయుస్సుత సంపదాదికథనైః దైవజ్ఞ పాశాఇమే।
గేహంగేహమనుప్రవిశ్యధనినాం మోహంముహుఃకుర్వతే॥ ౪౦౯

తా॥ అనేకమైన సామాన్యాపవాద రూపకములైన అలలచేత నిండియుండెడి జ్యోతిశ్శాస్త్రి సముద్రమందు కొన్నితుంపురలను పొంది ధన్యులైనవారివలె ధనికులయొక్క ఒక్కొక యింటిని ప్రవేశించిదీర్ఘాయువ్యము పుత్రులు మొదలైన సంపదలు కలుగునని చెప్పడములచేత జ్యోతిష్కులనే మోహపాశములు ధనికులకు పలుమారు మోహమును కలుగజేయుచున్నారుగదా.

శ్లో॥ విలిఖతిసదస ద్వాజన్మ పత్రంజనానాం
ఫలతియది తదానీం దర్శయత్యాత్మ దాక్ష్యం।
నఫలతియది లగ్నం ద్రష్టురేవాహ మోహం
హరతి ధనమి హైవంహన్త దైవజ్ఞ పాశః॥ ౪౧౦

తా॥ జనులయొక్క జాతక పత్రమును మంచిఫలములతో చెడుఫలములతో కూడా వ్రాయుచున్నాడు అప్పుడు అదిఫలించుచున్న యెడల తనసామర్థ్యమని తన నేర్పరితనమును చూపించుచున్నాడు అదిఫలించని

మొదల జనన కాలమున లగ్నమును పరిశోధించెదువాడు లగ్నమును చక్కగా పరిశోధించ లేదని వాడియొక్కతప్పిదమునే చెప్పుచున్నాడుఇటులయిక్కడనే మోహపాశమనేజ్యోతిషుఁడు ద్రవ్యమునపహరించు చున్నాడుగదా.

శ్లో॥ ప్రమోదేఖే దేవాప్యుపనమతి పుంసాం విధివశాత్।
మన్యేవం ప్రాగేవాభి హితమితి మిథ్యాకథయతి।
జనానిష్టాఽనిష్టాకలన పరిహారైక నిరతాన్।
అసౌ మేషాదీనాం పరిగణనయైవ భ్రమయతి॥ ౪౧౧

తా॥ దైవవశముచేత పురుషులకు సుఖదుఃఖములుప్రాప్తములగుచుండగా ప్రాప్తమైనదానినిచూచి యీప్రకారము జరుగునని మునుపే నాచేత చెప్పబడినదని యబద్ధమును చెప్పుచున్నాడు. అనిష్టముపోవుటకు యిష్టముప్రాప్తమగుటకు తగు పరిహారములచేయ నాసక్తిగల జనులను గురించి యీజ్యోతిషుఁడు మేషాదిరాసులను నవగ్రహములను యెంచుటచేతనే భ్రమింపజేయుచున్నాడుగదా.

## —(*) గృహస్థాశ్రమసౌఖ్యం. (*)—

శ్లో॥ మానుష్యం వరవంశజన్మ విభవో దీర్ఘాయురారోగ్యతాం।
సన్మిత్రంసు సుతస్సతీ ప్రియతమా భక్తిశ్చ నారాయణే।
విద్వత్వం సుజనత్వ మింద్రియ జయస్స త్పాత్రదానేరతిః।
తేపుణ్యేన వినాత్రయో దశగుణాస్సంసారిణాందుర్లభాః॥౪౧౨

తా॥ మనుష్యజన్మమెత్తడము; శ్రేష్ఠవంశమందు పుట్టడము, ప్రభుత్వముండడము, దీర్ఘాయుర్దాయము, రోగములేకుండుట, మంచిస్నేహితుడు, అనుకూలమైన పుత్రుడు, అనుకూలమైన భార్య, పరమాత్మనైన నారాయణునియందు అధికభక్తి, పాండిత్యము, మంచితనము, ఇంద్రియనిగ్రహము, సత్పాత్రమందీవి, యీ ౧౩ గుణములు పుణ్యమువినాగాసాంసారికులకు లభించవు.

శ్లో॥ సవేదశాస్త్రధ్వనిగర్జితాని
సవిప్ర పాదోదక కర్దమాని।
స్వాహా స్వధాకార నిరంతరాణి
స్వానంద తుల్యాని గృహాణితాని॥ ౪౧౩

తా॥ వేదశాస్త్రముల మార్గమందలిశబ్దములతోకూడినవి బ్రాహ్మణ పాదతీర్థముచే బురదలైన హవ్యకవ్యములచే అతిశయములై (అనగా) దేవయాగములచే నిండియుండెడు గృహములు బ్రహ్మానందతుల్యములే.

శ్లో॥ నవిప్రపాదోదక పంకిలానిన వేదశాస్త్రధ్వనిగర్జితాని।
స్వాహాస్వధాకార వివర్జితాని శ్మశానతుల్యాని గృహాణితాని॥

తా॥ బ్రాహ్మణపాదతీర్థములచే బురదలుగాని వేదశాస్త్రఘోషములేని దేవయాగ పితృయాగములులేని గృహములు శ్మశానతుల్యములు.

శ్లో॥ యదిరామా యదిచరమా యదితనయో వినయగుణోపేతః।
తనయె తనయోత్పత్తిః సురవరనగరేకిమాధిక్యం॥ ౪౧౫

తా॥ మంచివనిత, లక్ష్మి, వినయ గుణములతోకూడిన కుమారుడు, పుత్రునికి పుత్రుడు పుట్టడమున్ను యిట్లున్న యెడల స్వర్గలోక మందేమి విశేషము.

శ్లో॥ తావద్విద్యానవద్యా గుణగణమహిమా రూపసంపత్తిశౌర్యం।
స్వస్థానేసర్వశోభా పరగుణకథనేవాక్పటుస్తావదేవ।
యావత్పాకాకులాభిస్స్వగృహయువతిభిః ప్రేషితాపత్యవక్త్రాత్
హేబాబానాస్తితైలంనచ లవణమయీత్యాదివాచాం ప్రచారః॥

తా॥ వంటచేసుటయందు వ్యాకులమును పొందిన తమఆడవారిచే చెప్పిపంపబడిన బిడ్డలమూలకముగా ఓబిడ్డా చమురులేదు ఉప్పులేదు అనేమాట లెంతమట్టుకున్నవో అంతమట్టుకు విద్యయున్ను లేదు గుణముల విశేషమున్ను లేదు మంచిరూపమున్ను ప్రయోజనములేదు పరాక్రమము లేదు తనచోటవేడుకలు పొరుగువారిని తక్కువగా చెప్పట మొదలైనవి వకటి లేదు.

—(*) అభ్యాసః. (*)—

శ్లో॥ అభ్యాసేన నయత్సిద్ధిః తాదృక్షే త్రియో స్తికింభువి।
తస్మాత్తదర్థిభిర్భూయో౽ భ్యాసఏవావలమ్బ్యతాం॥ ४०४

తా॥ అభ్యాసముచేత యెంత క్షేమము సిద్ధించుచున్నదో అంత క్షేమము భూమియందు వేరేవున్నదా ఏమి లేదు అందువలన ఆ క్షేమమును కోరు జనులచే పలుమారు అభ్యాసమునే యవలంబించ వలెను గాక.

శ్లో॥ అభ్యాసాదేవపవనం భక్షయన్త్యేవ కేచన।
తరన్త్యంభోధి మప్యన్యే సహన్త్యపివిషాదికం॥ ४०౮

తా॥ అభ్యాసముచేతనే కొందరు వాయుభక్షణమును చేయుచున్నారు. కొందరు సముద్రమును దాటుచున్నారు విషములను తినిగాని యెక్కించుకొనిగాని ఓర్చుకొనుచున్నారు.

శ్లో॥ అభ్యాసినామేవలభ్యా విద్యా అపిచతుర్దశ।
అప్యర్కమండలంభిత్వా౽ భ్యాసేనైవగమ్యతే॥ ४०౯

తా॥ అభ్యాసముచేతనే ౧४ విద్యలున్ను పొందదగినవవును అభ్యాసముచేతనే సూర్యమండలమును భేదించుకొని పోజను.

—(*) ప్రమాదనిన్దా. (*)—

శ్లో॥ దుఃఖార్ణవ సహస్రాణి ప్రమాదేన పదేపదే।
ప్రత్యక్షముపలభ్యన్తే సకాలో౽ త్రోవకుత్రచిత్॥

తా॥ పొరపాటుచేత అనేకదుఃఖములు జనులచే ప్రత్యక్షముగానే పొందబడుచున్నవి గనుక ఆ ప్రమాదమును ఎచ్చటచేయకూడదు.

శ్లో॥ మృత్యుం ప్రమాదమేవాహ భగవాన్ బాదరాయణః।
తస్మాత్తద్ధింసనేదక్షో యస్సమృత్యుం జయోభవేత్॥ ४౨౧

తా॥ భగవన్తుడైన వ్యాసులు మృత్యువునే ప్రమాదమునుగా చెప్పిరి అందువలన నెవడు ప్రమాదమును తొలగ జేయుచున్నాడో వాడే మృత్యువును జయించినవాడగును.

శ్లో॥ ప్రమాదినాం నవిత్తాని నవిద్యావనితాపిచ।

నహిమద్యజుషాక్వాపి సాధనాన్యథ దీశ్చహీః॥ ౪౨౨

తా॥ పొరపాటులతో కూడిన వారికి ద్రవ్యములు లేవు విద్యలేదు కాంతయునులేమ మద్యపానము జేయువానిచే యేమిసాధనములు పొందదగివున్నవి వానికి లజ్జబుద్ధియున్ను లేదుగదా.

శ్లో॥ ప్రమాఘ్న ఇతివక్తవ్యే ప్రమాద ఇతిజల్పతి।
జనస్తస్యైవ మాహాత్మాత్ వైయ్యాకరణరాడపి॥ ౪౨౩

తా॥ ప్రమాయనగా నిశ్చయజ్ఞానము దానిని నిచ్చునది ప్రమాదమనిపేరు యిప్పుడీ ప్రమాదము జ్ఞానమును చెరిపెడిదిగా నున్నది గనుక ప్రమాఘ్నమని చెప్పతగియుండను వ్యాకరణమును తెలిసినవాడైనను ప్రమాదము యొక్క అభ్యాసముచేతనే ప్రమాదమని పదరుచున్నాడు.

—(*) మద్యపాననిందా. (*)—

శ్లో॥ చిత్తేభ్రాన్తిర్జాయతే మద్యపానా
ద్భ్రాన్తేచిత్తే పాపచర్యా ముపైతి।
పాపంకృత్వా దుర్గతిం యాన్తిమూఢా
స్తస్మాన్మద్యం నైవపేయం నపేయం॥ ౪౨౪

తా॥ కల్లు మొదలైనవి త్రాగుటవలన బుద్ధిభ్రమము కలుగుచున్నది, చిత్తము భ్రమించినయడల పాపకార్యమును పొందును, పాపమును జేసిన చెడుగతిని పొందుదురు, అందువలన కల్లు మొదలైనవి తాగనే కూడదు.

శ్లో॥ మత్తోహి నస్తిసర్వం మిథ్యాప్రలపతిహి వికలయాబుద్ధ్యా।
మాతరమపికామయతే సావజ్ఞం మద్యపానమత్తస్సన్॥ ౪౨౫

తా॥ మద్యపానాదులచే మత్తుడైనయడల అందరిని కొట్టుచున్నాడు బుద్ధివైకల్యముచే అబద్ధముగా మాటలాడుచున్నాడు మర్యాదలేక తల్లినిగూడ కోరుచున్నాడుగదా.

శ్లో॥ మద్యపస్య కుతస్సత్యం దయామాంసాశినఃకుతః।
కామినశ్చ కుతోవిద్యా నిర్ధనస్య కుతః క్రియా॥ ౪౨౬

తా॥ కల్లుత్రాగువానికి సత్యమెక్కడిది మాంసభక్షకునికి దయ యెక్కడిది కాముకునికి విద్యయెక్కడిది దరిద్రునికి అనష్ఠానమెక్కడిది.

శ్లో॥ వైక్లవ్యం ధరణీపాత మయథోచిత జల్పనం।
సన్నిపాతస్య చిహ్నాని మద్యం సర్వాణి దర్శయేత్॥ ౪౨౭

తా॥ బుద్ధిచెడిపోవుట భూమియందు పడుట తగనిమాటలాడుట, సన్నిపాతునికి లక్షణములు గనుక మద్యమైనది అన్నిటిని చూపించును.

—(*) అఘటితఘటనా. (*)—

శ్లో॥ అంబుజ మంబునిజాతం నహిదృష్టం జాతమంబుజాదంబు।
అధునాతద్విపరీతం చరణసరోజా ద్వినిర్గతా గంగా॥ ౪౨౮

తా॥ జలమందు తామరపుష్పము కలిగినదిగాని తామర పుష్పము వలన జలముకలిగినదని యెచ్చట చూడలేదుగదా యిప్పుడు అది విపరీతమైనదే ఏమనగా భగవంతుని పాదపద్మము వలన గంగానది నైనది బయలు దేరినదిగదా.

శ్లో॥ జాతాలతాహిశైలే జాతులతాయాం నజాయతేశైలః।
అధునాతద్విపరీతం కనకలతాయాం గిరిద్వయం జాతం॥ ౪౨౯

తా॥ పర్వతమున తీగెకలుగును యెప్పుడున్ను తీగెన పర్వతము కలగనే కలగదు యిప్పుడిచ్చట విపరీతమైనది ఏమనగా బంగారపు తీగెన రెండుకొండలు కలిగియున్నవి అనగా స్త్రీశరీరమనే బంగారపుతీగెన స్తనములనె రెండు కొండలు భావము.

శ్లో॥ కుసుమే కుసుమోత్పత్తి శ్శ్రూయతేనచ దృశ్యతే।
బాలేతవముఖాంభోజేదృష్టమిందీవర ద్వయం॥ ౪౩౦

తా॥ పుష్పమున పుష్పము పుట్టుట వినబడినదికాదు చూడబడినది కాదు ఐనను ఓచిన్నదానా నీముఖమనే తామర పుష్పమందు నేత్రములనే తెల్ల తామర పుష్పములు చూడబడినవి కదా.

---

* (సన్నిపాతుడనగా సన్నిపాతరోగి కల్లుత్రాగి క్రిందపడిన వాడు.)

శ్లో॥ నకేనాపిశ్రుతం దృష్టం వారిణావారి శుష్యతి।
అహోగోదావరీవారా భవసిన్ధుర్విశుష్యతే॥ ४३౧

తా॥ జలముచేత జలమింకిపోవడము ఒకనిచేతను చూడబడ లేదు వినబడలేదు. ఇట్లున్నను ఓహో యీగోదావరీ నీటిచేత సంసారమనే సముద్రము ఇంకిపోయినదిగదా.

శ్లో॥ త్రిదోషశమనాధార యద్యప్యుభవజ్జనీ మాంవాః।
*
త్వంకరోషి చతుర్దోషం కథంగంగేనలజ్జసి॥ ४३౨

తా॥ ఓగంగాదేవి దైవమువల్ల ఆత్మవల్ల పంచభూతములవల్ల కలిగెడు మూడు దోషములను అణగిపోవుటకు గాను జనులు నీయందు మునుగుచున్నారు నీవో నిమ్మిమునిగినవారికి మూడు దోషములను పోగొట్టక నాలగవ దోషమును కలగజేయుచున్నావే కొంచమైన లజ్జ పడవేమి.

శ్లో॥ నకేనాపిశ్రుతం దృష్టం సత్యావైహేయాతేపతిః।
అహో గంగాస్త్రియా భర్తా భవసింధుర్విపశ్యతి॥ ४३३

తా॥ పతివ్రతచేత భర్తా చెడిపోవుచున్నాడనేది ఒకనిచేతవినబడలేదు చూడబడలేదు. ఓహో యీగంగానది యనే స్త్రీచేత సంసారమనె సముద్రుడైన భర్తా నశించుచున్నాడే అనగా గంగానది స్నానముచే సంసార సముద్రము నశించుచున్నదని భావము.

శ్లో॥ మాకారబ్ధాం కమపిబధిరా శ్లోకమాకర్ణయన్తి।
శ్రద్ధాలుస్తాం విలిఖతికుణిః శ్లాఘయావీక్షతేంధః।
అభ్యాలోహత్య హహహసహసా పంగురప్య ద్రిశృంగం।
సాంద్రాలిస్యాశ్శిశుభరణతో మన్దమాయాన్తి వంధ్యా॥ ४३४

తా॥ మూగవానిచే నారంభించబడిన యేదో వక శ్లోకమును చెవిటివారలు వినుచున్నారు. దానిని చెయ్యిలేనివాడు అత్యాసక్తుడయి వ్రాయుచున్నాడు. వకగుడ్డివాడు వ్రాసిన దానిని చూచి కొనియాడుచు

---

* దోషమన. చెయి. విష్ణువగునని భా.

న్నాడు. వక కుంటివాడు హఠాత్తుగా పర్వత శిఖరమును యెక్కుచు న్నాడు గొడ్రాలులు బిడ్డల భారముచేత మందగతితో బోవుచున్నారు.

శ్లో॥ సర్వదా సర్వదోసీతి మిథ్యా సంస్తూయసే జనైః।
నారయో లేభిరే పృష్ఠం నవక్షః పరయోషితః॥ ౪౩౫

తా॥ యెల్లప్పుడు అన్నిటిని నిచ్చువాడవని జనులచే అబద్ధముగా పొగడబడుచున్నావు. ఏలనగా శత్రువులు గోరునట్టి వీపునువారు పొందలేదు పరస్త్రీలుగోరు వక్షస్థలమును వారుపొందలేదు.

—(*) అసత్యవాదినిందా. (*)—

శ్లో॥ యశో యస్మాద్భస్మీ భవతివనవహ్నే రివవనం।
నిదానం దుఃఖానాం యదవనిరుహాణా మివజలం।
నయత్రస్యా చ్ఛాయాతప ఇవతపస్సంయమ కథా।
కథం చిత్తన్మిథ్యా వచనమభి ధత్తేన మతిమాన్॥

తా॥ కార్చిచ్చు అడవినెల్లు భస్మముగా జేయుచున్నదో అటులనే కీర్తిని పాడుజేయుచున్నది. చెట్లకు నీరువలె దుఃఖములకంతా యాధారమయినది. నీడనయెండ యెటుల యేర్పడదో అటువలె యే అసత్యమందు ఋషుల సంగతి తపోవృత్తాంత మేర్పడదో అట్టి యబద్ధమాటను బుద్ధిమంతుడెటులనైనను చెప్ప నొప్పుకొను వాడు కాడు.

శ్లో॥ జిహ్వైకే వసతాముభే ఫణివతాం స్రష్టుశ్చతస్రశ్చతాః
తాస్సప్తైవ విభావసో ర్నియమితాః షట్కార్తికేయస్యచ।
పౌలస్త్యస్యదశాభవ న్ఫణిపతేర్జిహ్వా స్సహస్రద్వయం
జిహ్వాలక్ష శతైకకోటి నియమోనో దుర్జనానాంముఖే॥ ౪౩౭

తా॥ సత్పురుషులకు నాలుకయొకటె సర్పములకు ౨ బ్రహ్మకు ౪ కుమారస్వామికి ౬ అగ్నిహోత్రునికి ౭ రావణాసురునికి ౧౦ ఆదిశేషునికి ౨౦౦౦ యీలాగుదుర్జనునికి నాలుకలకు లక్షయని కోటియని నూరని వకటని యేర్పాటులేదు.

శ్లో॥ నాసత్యవాదినస్సఖ్యం నపుణ్యం నయశోభువి।

దృశ్యతేనాపికల్యాణం కాలకూటమివా శ్నతః॥ ౪౩౮

తా॥ అబద్ధము పలుకువానికి స్నేహధర్మములేదు పుణ్యములేదు కీర్తిలేదు విషమును తినువానికివలె క్షేమమున్నులేదు.

—(*) మదనః. (*)—

శ్లో॥ నగమ్యో మన్త్రాణాం నచభవతి భైషజ్య విషయః
నచాపిప్రధ్వంసం వ్రజతివివిధైశ్శాన్తికశతైః।
భ్రమావేశాదంగే కిమపివిదధ ద్భవ్యమసమం
స్మరాపస్మారోయం భ్రమయతిదృశం ఘూర్ణయతిచ॥ ౪౩౯

తా॥ మన్మథుడనే అపస్మారవ్యాధి మన్త్రములకుస్వాధీనముకాదు వైద్యవిషయమున కేర్పడదు నవగ్రహ శాంతులచే నశించదు బుద్ధిచాంచల్యముచేత శరీరమందు ఏదో సరికాని దుఃఖమును విస్తరించుచున్నది. బుద్ధిని నేత్రములనుకూడా చుట్టునట్లు చేయుచున్నది.

శ్లో॥ ఏకంవస్తు ద్విధాకర్తుం బహవస్సన్తిధన్వినః।
ధన్వీసమారఏవైకో ద్వయోరైక్యం కరోతియః॥ ౪౪౦

తా॥వకవస్తువును౨గా జేయుటకు బహుమంది విలుగాండ్రున్నారు స్త్రీపురుషులనే ౨ని వకటిగాజేయుటకు యీమన్మథుడొకడేవిలుగాడు.

శ్లో॥ నకరోరం నవాతీక్ష్ణ మాయుధం పుష్పధన్వనః।
తథాపిజితమేవాసీ దమునా భువనత్రయం॥ ౪౪౧

తా॥ మన్మథునియొక్క యాయుధము తీక్ష్ణముగాదు కఠినమైనది గాదు ఐనను ౩ లోకములు యీమన్మథునిచే జయించబడినదే నైనది.

శ్లో॥ హృదయ తృణకుటీరే దీప్యమాన స్స్మరాగ్నా
వుచితమనుచితంవావే త్తినోపండితోపి।
కిముకువలయనేత్రాః సన్తినైనాకనార్యః
త్రిదశపతిరహల్యాంతాపసీంయత్సిషేవే॥ ౪౪౨

తా॥ మన్మథాగ్నిచే ప్రకాశించెడు హృదయమనే పూరింటియందు పండితుడైనను చేయవచ్చును చేయకూడదని గాని తెలుసుకొనడు.

ఎట్లనగా 3 లోకములకు యజమానుఁడైన యింద్రుఁడైనను తనకు అప్సరసలనేకులున్నను అడవిలో వ్రతపరురాలైన యహల్యను బలాత్కరించెగదా గనుక ఎట్టివాఁడైనను తెలుసుకొనఁడు.

—(*) వాగ్మిప్రశంసా. (*)—

శ్లో॥ శ్రోతౄన్మూకయతిబ్రువన్ స్థిరతమం కుర్వన్నమీషాం మనః।
నిర్బాష్పః పరబాష్పకృత్పర దృశామేకాగ్రయో నాన్యదృక్।
యస్స్వాక్తాంగవికంపనః ప్రచలయన్నిత్యం సతామ్మస్తకాన్।
క్షీరం శ్రోతృషుముఖ్యమాత్మనిగుణం ధత్తేసవక్తోత్తమః॥ ౪౪౩

తా॥ సభయందు చక్కగా మాటలాడెడు వాచాలకుఁడు, తాను మాటలాడుచున్న వినువారిని మూగ వారినిగ చేయుచున్నాఁడు. వినువారిమనస్సును చంచలించక స్థిరముగ జేయుచున్నాఁడు. తానుకంట నీరు విడవకనే యితరులుకంట ఆనంద బాష్పములను కలగజేయుచున్నాఁడు. తానందరినిజూచుచున్నప్పటికిన్ని తన్నొకనినే ఇతరులుజూచునట్లు జేసుకొనుచున్నాఁడు. తానుశరీరము నాడించక సాధువులతలలనునిత్యంఆడించుచు తనయందుండెడు గుణమును ఇతరుల విషయమున పాలుగజేయుచున్నాఁడు.

శ్లో॥ తద్వక్తాసదసి బ్రవీతువచనం యచ్ఛృణ్వతాం చేతసః।
ప్రోల్లాసం రసపూరణం శ్రవణయోరక్ష్ణో ర్వికాసశ్రియం।
క్షున్నిద్రాశ్రమదుఃఖ కాలగతిహృత్ కార్యాన్తర ప్రస్మృతిం।
ప్రోత్కంఠామనిశం శ్రుతౌవితనుతే శోకంవిరామాదపి॥ ౪౪౪

తా॥ వినువారి మనస్సుకు వేడుకనైను, చెవులకు శృంగారాది రసములు నిండియుండి కనులకు వికసించుటయున్ను. ఆకలి నిద్రా శ్రమము దుఃఖము కాలగతులను తెలియకుండునటుల జేయునదినై వినుటయందు వక ఆసక్తిన్ని ఇతరపనులను మరిచేటట్లున్ను మాట్లాడక విడిచినయడల దుఃఖమును కలగజేయునదియే వాక్కు ఆవాక్కును బాగా మాటలాడెడివాఁడు సభయందు మాటలాడుగాక.

శ్లో॥ అల్పాక్షరరమణీయం యఃకథయతినిశ్చితం సఖలువాగ్మీ।
బహువచన మల్పసారం యఃకథయతి ప్రలాపీసః॥ ౪౪౫

తా॥ కొద్దిమాటలతో మనోహరమై సత్యముగా నెవడు మాట లాడుచున్నాడో వాడే వక్తా అనిచెప్పబడును. అధికమాటలుండి యర్థ ములేక పలికెడువాడు వదరువాడె అవును.

శ్లో॥ కామాన్దుగ్ధే విప్రకర్షత్యలక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతం యాహినస్తి।
తాంచాప్యేతాం మాతరం మంగలానాం
ధేనుంధీరాః సూనృతాం వాచమాహుః॥ ౪౪౬

తా॥ ఏవాక్కు-నది అభీష్టములనుయిచ్చుచున్నదో దారిద్ర్యమును పోగొట్టుచున్నదో. కీర్తిని యిచ్చుచున్నదో. పాపమును పోగొట్టుచు న్నదో. అట్టి సత్యవాక్కు-ను క్షేమములను యిచ్చునట్టి కామధేనువును గానుతల్లినిగాను విద్వాంసులు చెప్పుచున్నారు.

శ్లో॥ తాస్తువాచస్సభాయోగ్యాః యాశ్చిత్తాకర్షణక్షమాః।
స్వేషాంపరేషాంవిదుషాం ద్విషామవిదుషామపి॥ ౪౪౭

తా॥ తమయొక్క పొరుగువారియొక్క విద్వాంసులయొక్క శత్రు వులయొక్క మూఢులయొక్క మనస్సును ఆకర్షించుటయందు నేమా టలు తగియున్నవో ఆమాటలేసభకు తగినవి.

శ్లో॥ నధనీనబలీనాపి శూరోనగుణవానపి।
తథాభాతియథా విద్వాన్సభాయాం పికద్వనే॥ ౪౪౮

తా॥ వనమందు కోకిలవలె సభయందెవడు ప్రకాశించుచున్నా డో వాడు ధనవంతుడు కాకపోయినను బలవంతుడు కాకపోయినను గుణవంతుడు కాకపోయినను ప్రకాశించుచున్నాడు వాక్కు-న్న యెడల సర్వమున్నట్లగును.

శ్లో॥ సాలంకారోపిసరసః సగుణోపిపుమానిహ।
ప్రబన్ధ ఇవవక్తృత్వం వినానూనం జడోనకిం॥ ౪౪౯

తా॥ అలంకారముతో కూడినను సరసుడైనను గుణవంతుడైనను పురుషుడు మాటలాడు స్వభావము లేనియెడల కావ్యాది ప్రబన్ధములవలె జడుడుగాడా ఏమి, అనగా ప్రబన్ధమునకు అలంకారములు రసములు మొదలైనవియున్నందున పురుషుడికి సామ్యము.

—(*) మిశ్రప్రకరణం. (*)—

శ్లో॥ దానాయలక్ష్మీః సుకృతాయవిద్యా
చింతా పరబ్రహ్మ వినిశ్చయాయ।
పరోపకారాయ వచాంసియస్య
వన్ద్యస్త్రిలోకీ తిలకస్సఏవ॥ ౪౫౦

తా॥ ఎవనికి దానముకొరకు సంపద, పుణ్యముకొరకు విద్యా, పరబ్రహ్మ నిశ్చయించుటకొరకు ఆలోచన పరోపకారముకొరకువాక్కులున్నవో వాడే అందరిచే నమస్కరించ తగినవాడున్ను మూడులోకములకు తిలకమువంటి వాడున్ను గును.

శ్లో॥ నిష్కలంక కలయాపియః సంయుతస్స ఖలుపూజ్యతే జనైః।
భద్రపక్ష్య జలజోపిధార్యతే శంకరేణ శిరసా నిశాకరః॥ ౪౫౧

తా॥ వకడైనను కళంకములేని కలతోకూడిన యెడల వాడే జనులచే పూజింపబడును జలమందుపుట్టినను చంద్రుడు శంకరుని శిరస్సుచే పూజింపబడుచున్నాడు గదా చూడు.

శ్లో॥ హస్తాదపిన దాతవ్యం గృహాదపినదీయతే।
పరోప కరణార్థాయ వచనేకిం దరిద్రతా॥ ౪౫౨

తా॥ చేతినుండియివ్వవద్దు యింటినుండి యిచ్చుట కాదు గనుక పరోపకారముచేయుటకుగాను మాటలుచెప్పుటయందు ఏమిదరిద్రము.

శ్లో॥ వనానిదహతోవహ్నేః సఖాభవతిమారుతః।
సఏవదీపనాశాయ కృశేకస్యాస్తి సౌహృదం॥

తా॥ వనములను కాల్చుఅగ్నికి వాయువు అనుకూలుడగుచున్నా

డు ఆదేవాయువు దీపమునుపోగొట్టుటకు ఏర్పడుచున్నాడు గనుక బల హీనునియందెవనికి స్నేహమున్నది.

శ్లో॥ భోజ్యంభోజనశక్తిశ్చరతిశక్తిర్వరస్త్రియః।
విభవోదానశక్తిశ్చ నాల్పస్యతపసఃఫలం॥ ౪౫౪

తా॥ తినతగిన మంచిపదార్థము భుజించుటకు జీర్ణించుకొనుశక్తి సంభోగసామర్థ్యము మంచిస్త్రీలు, మంచినైశ్వర్యము దానమిచ్చు స్వభావము యీ ౬న్ను మహాతపస్సుకు ఫలముగా లభించును.

శ్లో॥ అనుచితకర్మారంభః స్వజనవిరోధో బలీయసిస్పర్ధా।
ప్రమదాజనవిశ్వాసో మృత్యుద్వారాణి చత్వారి॥ ౪౫౫

తా॥ చెడుపనులనారంభించడము స్వజనవిరోధము బలవంతునితో కలహించుట ఆడవారియందు నమ్మిక యీనాలుగున్ను మృత్యువును గురించిపోవుటకు దోవలు.

శ్లో॥ దుష్టాభార్యాశఠమ్మిత్రం భృత్యశ్చోత్తరదాయకః।
ససర్పేచ గృహేవాసః మృత్యురేవనసంశయః॥ ౪౫౬

తా॥ దుర్నడతగలభార్య చెడుతలంపుగల స్నేహితుడు బదులు చెప్పెడుపనివాడు సర్పమున్ను యింటిన వాసము యివియన్నియు మృత్యువుతో సమానములే.

శ్లో॥ పంచభిస్సహగంతవ్యం స్థాతవ్యం పంచభిస్సహ।
పంచభిస్సహవక్తవ్యం నదుఃఖం పంచభిస్సహ॥ ౪౫౭

తా॥ తలితండ్రులు కొడుకు కోడలు భార్య యీ ౫ గురితోయాత్రపోవలయును దేవయాగ పితృయాగ మనుష్యయాగ భూతయాగ ఆత్మయాగములనే ౫ టితో నెల్లప్పుడుండ వలయును. జాతిధర్మము ఆశ్రమధర్మము మతధర్మము దేశధర్మము గుణధర్మములననుసరించిమాటలాడవలయును. ఇట్లైదింటితో నుండుట దుఃఖములేదు.

శ్లో॥ అమృతం దుర్లభంనౄణాం దేవానా ముదకంతధా।
పిత్రూణాం దుర్లభఃపుత్రఃతక్రం శక్రస్యదుర్లభం॥ ౪౫౮

తా॥ మనుజులకు అమృతము చిక్కటయరుదు దేవతలకు నీరు చిక్కటయరుదు పితృదేవతలకు పుత్రుడుయరుదు ఇంద్రునికి మజ్జిగయరుదు.

శ్లో॥ యాస్తిన్యాయ ప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం।
అపంథానంతు గచ్ఛన్తం సోదరోపి విముంచతి॥ ౪౫౯

తా॥ న్యాయముతో ప్రవర్తించెడువానికి మృగాదులుకూడా సహాయధర్మమును పొందుతున్నవి చెడుమార్గమున పొయ్యెడివానిని కూడబుట్టినవాడును విడుచుచున్నాడు. రామాయణమే సాక్షి.

శ్లో॥ యస్మిన్దేశేన సమ్మానః నప్రీతి ర్నచబాంధవాః।
నచవిద్యాగమః కశ్చిన్నతత్ర దివసం వసేత్॥ ౪౬౦

తా॥ యేచోటమదింపు ప్రియము బంధువులు విద్యాలాభములేదో ఆచోట వకదినమైనా వుండకూడదు.

శ్లో॥ వహేదమిత్రం స్కన్ధేనయావత్కాల విపర్యయః।
అథైవ మాగతేకాలే భిన్ద్యాత్ ఘటమివాశ్మని॥ ౪౬౧

తా॥ యెంతవరకుకాలము విపరీతముగాయున్నదో అంత వరకు శత్రువునుకూడ భుజములో యెత్తిపెట్టుకొనవలయును. ఆపిమ్మటయీ ప్రికారమె మనకు మంచికాలము రావడముతో నేరాతిన కుండను కొట్టినట్టు పగల కొట్టవలయును.

శ్లో॥ గతశ్రీః గణకాన్ ద్వేష్టి గతాయుశ్చ చికిత్సకాన్।
గతశ్రీశ్చ గతాయుశ్చ బ్రాహ్మణాన్ ద్వేష్టిభారత॥ ౪౬౨

తా॥ సంపదపోయినవాడు గుమాస్తా మొదలగు లెక్ఖవారిని లేక జోతిష్యులనుగాని విరోధించుకొనుచున్నాడు ఆయుస్సుతగ్గిపోయినవాడు వైద్యులను విరోధించుకొనుచున్నాడు ఆయుస్స సొత్తుపోయినవాడు బ్రాహ్మలనువిరోధించు కొనుచున్నాడు.

శ్లో॥ శనైః పన్థాశ్శనైః కంథాశనైః పర్వతమస్తకే।
శనైర్విద్యా శనైర్విత్తం పంచైతానిశనై శ్శనైః॥ ౪౬౩

తా॥ మెల్లగాదోవనడవవలయును పాతగుడ్డ మెల్లగా ధరించవ

లయును. విద్య మెల్లగా నభ్యసించతగినది ద్రవ్యము మెల్ల మెల్లగాసంపాదించవలయును. గనుక యీ ౫ టిని మెల్లతనముండవలయును.

శ్లో॥ సుహృదినిరంతరచిత్తే గుణవతి భృత్యేప్రియాసునారీషు।
స్వామినిశక్తిసమేతే నివేద్యదుఃఖం సుఖీభవతి॥ ౪౬౪

తా॥ అనుసరించిన మనస్సుగలస్నేహితునివద్ద, శక్తివంతుండైన యజమానునివద్ద, దుఃఖమును తెలిపించి సుఖవంతుడగుచున్నాడు.

శ్లో॥ అన్వయాగతవిద్యానా మన్వయాగతసంపదాం॥
విదుషాంచ ప్రభూణాంచ హృదయం నావలిప్యతే॥ ౪౬౫

తా॥ పరంపరగా విద్యతోకూడినవారియొక్కయు పరంపరగా ద్రివ్యముతో కూడినవారియొక్క హృదయముకొంచమున్ను గర్వపడదు.

శ్లో॥ మక్షికామశకావేశ్యాః మూషికాయాచకాస్తథా।
గ్రామణీర్గణకాశ్చైవ సప్తైతే పరభక్షకాః॥ ౪౬౬

తా॥ యీగెలు దోమలు బోగమువారు యెలుకలు యాచకులు గ్రామాధికారి జ్యోతిషకులు లెక్కవారు యీ ౭ గురు పొరుగు వారిని పెరుకొనితినెడువారు.

శ్లో॥ గన్తవ్యారాజసభా ద్రష్టవ్యా రాజవల్లభాః పురుషాః॥
యద్యపినభవత్యర్థో భవత్యనర్థప్రతీకారః॥ ౪౬౭

తా॥ రాజసభ ప్రవేశించ తగినది అచ్చట రాజశ్రేష్ఠులైన పురుషులు చూడతగినవారే. అయితే వారిని కొలిచినందువలనప్రయోజనమేమియుండదు అయినప్పటికిన్ని అనర్థము రాకుండునటుల తప్పించుకొనడమే ప్రయోజనము.

శ్లో॥ పుత్రపౌత్ర వధూభృత్యై స్సంపూర్ణ మపి సర్వదా।
భార్యాహీన గృహస్థస్య మాన్యమెవ గృహమ్మతం॥ ౪౬౮

తా॥ యెల్లప్పుడు పుత్రపౌత్రులతో స్త్రీలతో సేవకులతోగృహమునిండియుండినను. భార్యలేని గృహస్థునియొక్క గృహముశూన్యమనే తీర్మానము.

శ్లో॥ ఏకంద్దృష్ట్వా శతంద్దృష్ట్వా దృష్ట్వాపంచ శతాన్యపి।
అతిలోభోన కర్తవ్యః చక్రం భ్రమతి మస్తకే॥ ౪౬౯

తా॥ శెలవున వకటినిగాని నూటినిగాని అయిదునూటినిగానిచూచినను లోభము చేయకూడదు ఏలనగా శిరస్సునవిధి చక్రము తిరుగుచున్నది గదా.

శ్లో॥ నవేవయసి యశ్శాన్తః సశాన్తఇతిమేమతిః।
ధాతుషుక్షీయమాణేషు శాన్తిఃకస్య నజాయతే॥ ౪౭౦

తా॥ నూతనప్రాయమున అణకువతో కూడిన వాడైన యడల వాడుశాంతుడని నాసమ్మతము నాళ్ళుతగ్గినప్పుడుయెవనికణకువకలగదు.

శ్లో॥ ప్రియవాక్యప్రదానేన సర్వేతుష్యన్తి జంతవః।
తస్మాత్తదేవ వక్తవ్యం వచనేకా దరిద్రితా॥ ౪౭౧

తా॥ మంచిగా మాటలాడుటచే సర్వప్రాణులు సంతోషించుచున్నారుగనుక మంచిమాటలే మాటలాడ వలయును మాటలలో నేమి దరిద్రము.

శ్లో॥ వివాహకాలే ఋతుసంప్రయోగే
ప్రాణాత్యయే సర్వధనాపహారే।
విప్రస్యచార్థేప్య నృతంవదేయుః
పంచాన్నృతాన్యాహురపాతకాని॥ ౪౭౨

తా॥ వివాహకాలమందు సంగమకాలమందు ప్రాణాపత్తునందు సర్వధనములు కోలుపోవుటయందు బ్రాహ్మణుని విషయమైనను అనృతమును పలుకుదుడు యీ ౫ న్ను పాపమును కలగజేయవు. చోరులు మొదలైనవాటివల్ల కలిగె తాత్మణి కాపత్తులవిషయమునయనిభావము.

శ్లో॥ దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలంపిబేత్।
సత్యపూతం వదేద్వాక్యం మనఃపూతం సమాచరేత్॥ ౪౭౩

తా॥ కంటికిశుద్ధమైనచోట పాదముంచవలయును వస్త్రముచేవ

డకట్టి నీటినిత్రాగవలయును సత్యమైన మాట లాడవలయును మనశ్శుద్ధమైనపనిని చెయ్యవలయును.

శ్లో॥ దుర్మన్త్రీ రాజ్యనాశాయ గ్రామనాశాయ కుంజరః।
స్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులః॥ ౪౭౪

తా॥ దుష్టమంత్రియైనవాడు రాజ్యనాశనముకొరకగును యేనుగ గ్రామనాశనముకొరకగును. బావమరిది యిల్లుచెరుచుట కొరకగును మేనమామ అన్నిటిని చెరుచుటకై యగును.

శ్లో॥ జలేతైలం ఖలేగుహ్యం పాత్రేదానంమనాగపి।
ప్రాజ్ఞేశాస్త్రం స్వయంయాతి విస్తారం వస్తుశక్తితః॥ ౪౭౫

తా॥ నీటిని చమురు, దుర్మార్గునియందు రహస్యవృత్తాంతము సత్పాత్రమందు యీవి, బుద్ధిశాలి విషయమున శాస్త్రము యివించుకంతయైనను పదార్థ ప్రభావమువల్ల తాముగానే విస్తరించుచున్నవి.

శ్లో॥ హరింహరీతకీంచైవ గాయత్రీంచ దినేదినే।
మోక్షారోగ్య తపఃకామః చిన్తయే ద్భక్షయేజ్జపేత్॥ ౪౭౬

తా॥ మోక్షమునపేక్షించినవాడు ఆరోగ్యమునపేక్షించినవాడు తపస్సునుకోరినవాడు ప్రతిదినము యీమూటిని క్రమముగా చెయ్యవలయును. యేదినగా హరిని తలచవలయును కరక్కాయను భక్షించ వలయును గాయత్రీమంత్రమును జపించవలయును.

శ్లో॥ ఉద్యోగః కలహః కండూర్ద్యూతం మద్యం పరస్త్రియః।
ఆహారోమైథునం నిద్రా సేవనాత్తు వివర్ధతే॥ ౪౭౭

తా॥ ఉద్యోగము, కలహము, దురద, జూదము, కల్లుత్రాగుట, పరస్త్రీలు, ఆహారము, సంభోగము, నిద్రా, యివియన్ని చెయ్య చెయ్యను వృద్ధిపొందుచున్నవి.

శ్లో॥ నిద్రాప్రియోయస్సతు కుంభకర్ణః హతస్సమీకే రఘునన్దనేన।
తతోస్యపత్నీ విధవా ప్రజాతా
శ్రోతుం సమాయాతి కథంపురాణం॥ ౪౭౮

తా॥ ఏకుంభకర్ణుఁడు నిద్రయందాసక్తుఁడో అట్టికుంభకర్ణుఁడు రామునిచేత యుద్ధమందుకొట్టబడెను వాని భార్యవిధవయైనను ఇట్లుండను పురాణమును వినుటకు యెట్లువచ్చుచున్నది.

శ్లో॥ దరిద్రతా ధీరతయా విరాజతే
కురూపతా శీలతయా విరాజతే।
కుభోజనం చోష్ణతయా విరాజతే
కువస్త్రితా శుభ్రతయా విరాజతే॥ ४८९

తా॥ దారిద్ర్యమైనను ధైర్యమున్నయెడల ప్రకాశించుచున్నది. ఆవలక్షణరూపమున్నను మంచినడవడికచేత ప్రకాశించుచున్నది. ఉత్తమపదార్థము లేక తక్కువైన భోజనమైనను వేడిచేత ప్రకాశించుచున్నది. పాతగుడ్డమైనను తెల్లగానుండుటచేత ప్రకాశించుచున్నది.

శ్లో॥ సంహతిశ్శ్రేయసీ పుంసాంస్వకులైరల్పకైరపి।
తుషేణాపి పరిత్యక్తాన ప్రరోహన్తి తండులాః॥ ४९०

తా॥ పురుషులకు తమకులమువారల్పులైనను వారితోచేరియుండుట క్షేమము బియ్యములు ఉముకచేతనైనను విడవబడినవైనయెడల మొలవవుగదా.

శ్లో॥ అల్పానామపి వస్తూనాం సంహతిః కార్యసాధికా।
తృణైర్గుణత్వమాపన్నైర్బధ్యన్తే మత్తదంతినః॥ ४९१

తా॥ అల్పపదార్థములయొక్క చేరికయున్న వక కార్యసాధకమవుచున్నది. దారముగ నేర్పడిన గడ్డిపరకలచేత యేనుగలున్నా కట్టబడుచున్నవిగదా.

శ్లో॥ నాగోభాతిమదేన కంజలరుహైః పూర్ణేన్దునాశర్వరీ
శీలేన ప్రమదాజవేన తురగః నిత్యోత్సవైర్మందిరం।
వాణీవ్యాకరణేన హంసమిథునైర్నద్యః సభాపండితైః
సత్పుత్రేణకులం నృపేణవసుధా లోకత్రయం విష్ణునా॥ ४९२

తా॥ మదముచేత యేనుగ. తామరలచేత తటాకము. పూర్ణ

చంద్రునిచే రాత్రి, మంచినడవడికచేతవనిత, వేగముచేత నశ్వము, నిత్య వేడుకలచేత గృహము, వ్యాకరణముచే వాక్కు, హంసజతలచేతనదులు, పండితులచేతసభ, మంచిపుత్రునిచేకులము, రాజుచేభూమి, విష్ణువుచే మూడులోకములు, ప్రకాశించుచున్నవిగదా.

శ్లో॥ షట్కర్ణోభిద్యతేమంత్రః చతుష్కర్ణస్థిరోభవేత్।
ద్వికర్ణస్యచమంత్రస్య బ్రహ్మాప్యంతంనగచ్ఛతి॥ ౪౮౩

తా॥ ఆరు చెవులతోకూడి యాలోచించుట అణగియుండక బైట పడును. నాలుగుచెవులతోకూడిన మంత్రాలోచన అచ్చటనే స్థిరముగా యుండును ౨ చెవులతోగూడి మంత్రాలోచన యొక్క చివరను బ్రహ్మ కూడాపొందదు. కావునముగ్గురితో యాలోచనకూడదు.

శ్లో॥ భూమిపతావర్థపతౌబాలే వృద్ధేతపోనిధౌ విదుషి।
యోషితిమూర్ఖేగురుషుచ విదుషానైవోత్తరం దేయం॥ ౪౮౪

తా॥ రాజువిషయములో, ద్రవ్యవంతుని విషయములో. బాలుని విషయమున. పెద్దలవిషయమున. మహర్షులవిషయమున. విద్వాంసుల విషయమున. స్త్రీల విషయమున. మూర్ఖుని విషయమున. గురువులవద్దను. బుద్ధిమంతునిచే మాటకు బదులుమాట చెప్పగూడదు.

శ్లో॥ యశఃపుణ్యాంకలత్రాణి పుత్రోత్పత్తిర్నిధీస్తథా।
సుకృతాదేవలభ్యన్తేనచ పార్థ పరాక్రమాత్॥ ౪౮౫

తా॥ కీర్తి, పుణ్యము, భార్య, పుత్రుడుకలుగుట, నిక్షేపము, ఇవి యన్ని జన్మాంతర సుకృతముచేత లభించుచున్నవిగాని ఓ యర్జునుడా పరాక్రమముచేత చిక్కవు.

శ్లో॥ రాజ్ఞి ధర్మిణిధర్మిష్ఠాః పాపేపాపాః సమేసమాః।
లోకాస్తమనువర్తన్తే యథారాజా తథాప్రజా॥ ౪౮౬

తా॥ రాజుధర్మవంతుడైనయడల జనులుధర్మవంతులే, రాజుపాపకర్ముడైనయడల జనులుపాపకర్ములే, రాజుమధ్యస్థుడైనయడల జనులు మధ్యస్థులే, గనుక జనులెల్లప్పుడు రాజును అనుసరించుచున్నారు,గనుక,

రాజెటులనో జనులాలాగెయగుదురని భావము.

శ్లో॥ వైద్యావదన్తి కపపిత్త మరుద్వికారాన్
జ్యోతిర్విదో గ్రహగతిం పరివర్తయన్తి।
భూతాభిషంగఇతి భూతవిదోవదన్తి
ప్రాచీనకర్మబలవన్మునయోవదన్తి॥ ౪౮౭

తా॥ ఒకనికి ఉపద్రవము వచ్చినప్పుడు వైద్యులు కపవాత పిత్తవికారములని చెప్పుచున్నారు. జ్యోతిష్కులు గ్రహచారసామాన్యమని జెప్పుచున్నారు. మాంత్రికులు పిశాచావేశమని చెప్పుచున్నారు మునులు ప్రాచీన కర్మమని జెప్పుచున్నారు.

శ్లో॥ సన్తృప్తానిసపూర్యన్తే పూర్యమాణాన్యనేకశః।
బ్రాహ్మణోగ్నిర్యమోరాజాపయోధిరుదరంగృహం॥ ౪౮౮

తా॥ అనేక పదార్థములు నెండుతుండను యీ ౭ ను మాత్రము నెండలేవు యేవియనగా, బ్రాహ్మణుడు, అగ్ని, యముడు, రాజు, సముద్రము, కుక్షి, ఇల్లు యివియెల్లప్పుడు యేదోవక కొరతగానేయుండును.

శ్లో॥ మృగామృగైస్సంగమనువ్రజన్తి
గావశ్చగోభిః తురగాస్తురంగైః।
మూర్ఖాశ్చ మూర్ఖైస్సుధియస్సుధీభి
స్సమానశీల వ్యసనేషు సఖ్యం॥ ౪౮౯

తా॥ జింకలతో జింకలు, పశువులతో పశువులు గుఱ్ఱములతో గుఱ్ఱములు, మూఢులతో మూఢులు, పండితులతో పండితులు చేరుచున్నారు సమానములైన నడవడిక స్వభావము వ్యసనము గల వారియందు స్నేహము కలుగును.

శ్లో॥ ప్రాప్యచాప్యుత్తమం జన్మలబ్ధ్వాచేన్ద్రియసౌష్ఠవం।
నవేత్త్యాత్మహితం యస్తుసభవేదాత్మ ఘాతుకః॥ ౪౯౦

తా॥ ఉత్తమ జన్మమును యింద్రియ పాటవమును సంపాదిన్చి

ఆత్మ హితమును యెవఁడు తెలిసుకొనఁడో వాఁడు యాత్మ ఘాతుక డన బడును.

శ్లో॥ సంపత్సరస్వతీసత్యం సంతానం సదనుగ్రహః।
సత్తా ఋకృతసంభారః సగారాస్సప్తదుర్లభాః॥ ౪౯౧

తా॥ సంపద, సరస్వతీ, సత్యవాక్కు, సంతానము, సత్పురుషుల యనుగ్రహము, స్థిరముగనుండుట పుణ్యముచేరుట, యీ 7న్ను చిక్కుట యరుదు.

శ్లో॥ అభ్రచ్ఛాయా ఖలప్రీతిర్నవసస్యా నియోషితః।
కించిత్కాలో పభోగ్యాని యౌవనాని ధనానిచ॥ ౪౯౨

తా॥ మేఘములనీడ, దుష్టునియందుప్రియము, క్రొత్తపయిరు, స్త్రీలు, యౌవనము, ధనములు, యివి కొంతకాలమే అనుభవించ తగినవుండగలవు.

శ్లో॥ పరోపిహితవాన్ బంధుః బంధురప్యహితఃపరః।
అహితో దేహజో వ్యాధిః హితమారణ్యమౌషధం॥ ౪౯౩

తా॥ పొరుగువాఁడైనను హితముజేసెడు వాఁడే బంధువు, బంధువైనను అహితమును జేసెడువాడు పొరుగువాఁడే, వ్యాధిమనశరీరమందు బుట్టినను అనుకూలమైనదికాదు, అడవినబుట్టినను మూలికహితమైనదే.

శ్లో॥ జలబిందు నిపాతేన క్రమశః పూర్యతేఘటః।
సహేతు స్సర్వవిద్యానాం ధర్మస్యచ ధనస్యచ॥ ౪౯౪

తా॥ నీటియొక్క వక్కొక్క బిందువు పడుటచేతనే కుండనెండుచున్నది, ఆలాగే సర్వవిద్యలు ధర్మము ధనమున్ను సంపూర్ణ మగుటకు క్రమక్రమముగా కావలయును.

శ్లో॥ ప్రభుర్వివేకీ ధనవాంశ్చ దాతా
విద్వాన్ విరాగీ ప్రమదా సుశీలా।
తురంగమ శ్శస్త్రనిపాత ధీరో
భూమండలస్యా భరణాని పంచ॥ ౪౯౫

తా॥ ప్రభువు వివేకముగలవాడు గాను, ధనవంతుడు దాతగాను, విద్వాంసుడు వైరాగ్యముతో కూడిన వాడుగాను, కాముకిరాలైన స్త్రీ మంచి నడవడికతో కూడినదిగాను, గట్టిము బాణములు పడు సమయమున బెదరక ధైర్యముతో నుండునదిగాను యివియైదు భూమండలమునకు యాభరణములు.

శ్లో॥ సౌవర్ణాని సరోజాని నిర్మాతుం సన్తిశిల్పినః।
తత్రసౌరభ నిర్మాణేచతురశ్చ తురాననః॥ ౪౯౬

తా॥ బంగారపు తామరపూలను కలగజేయుటకు బహుమందిపనివారున్నారు, అందున పరిమళమును కలగ జేయుటకు ఆ నేర్పరియైన బ్రహ్మవకడే.

శ్లో॥ స్వదేశజాతస్య నరస్యనూనం గుణాధికస్యాపి భవేదవజ్ఞా।
నిజాంగనాయద్యపిరూపరాశిస్తథాపిలోకఃపర దారసక్తః॥ ౪౯౭

తా॥ అధికగుణములతో కూడినవాఁడైనను తమదేశమందు బుట్టినవానికి అంత మర్యాదకలగదు, తనభార్య బహు రూపవంతురాలైనను జనులు పరస్త్రీలయందె యాసక్తులగుచున్నారు.

శ్లో॥ ఘృతం నశ్రూయతే కర్ణైదధిస్వప్నేపి దుర్లభం।
ముగ్ధే దుగ్ధస్య కావార్తా తక్రం శక్రస్య దుర్లభం॥ ౪౯౮

తా॥ నెయిచెవ్వున వినబడదు, కలలోనను పెరుగు లభించదు, ఓ వనితా పాలసంగతేమివున్నది, మజ్జిగ యింద్రునికిన్ని లభించదు.

శ్లో॥ లుబ్ధానాం యాచకశ్శత్రుః చోరాణాం చంద్రమారిపుః।
జారస్త్రీణాం పతిశ్శత్రుః మూర్ఖాణాం బోధకోరిపుః॥ ౪౯౯

తా॥ కృపణులకు అడిగెడువాడు శత్రువు, దొంగలకు చంద్రుడు శత్రువు వ్యభిచారి స్త్రీలకు మొగుడె శత్రువు, మూర్ఖుడికి జ్ఞానమును బోధించెడువాడు శత్రువు.

శ్లో॥ యథాచతుర్భికనకః పరీక్ష్యతేనికర్షణచ్ఛేదన తాడతాపనైః।
తథాచతుర్భిఃపురుషఃపరీక్ష్యతేశ్రుతేనశీలేనకులేనకర్మణా॥ ౫౦౦

తా॥ యెటుల బంగారము ఒరచుట ఖండించుట కొట్టుట కాల్చుట యీనాల్గింటితో పరీక్షించబడుచున్నదో అటులనె ఉత్తమ పురుషుడు విద్యచేత మంచి స్వభావముచేత కులముచేత అనుష్ఠానముచేత పరీక్షించబడుచున్నాడు.

శ్లో॥ అమన్త్రాక్షరం నాస్తినాస్తి మూలమనౌషధం।
అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః॥ ౫౦౧

తా॥ మంత్రముకాని అక్షరమేలేదు అన్నిమంత్రములే అన్నిమూలికలు మందులే అందరు మనుష్యులు యోగ్యులె ఐతె వీటిని సమకూర్చు వాడు యరుదు.

శ్లో॥ పరోపదేశవేళాయాం శిష్టాస్సర్వే భవన్తివై।
విస్మరన్తిహి శిష్టత్వం స్వకార్యేసముపస్థితే॥ ౫౦౨

తా॥ పొరుగువారికి యుపదేశించు కాలమున యందరు శిష్టులేయగుచున్నారు. తమచే చెయ్యవలసినదై నేర్పడినప్పుడు తమ శిష్టత్వమును మరచుచున్నారుగదా.

శ్లో॥ అవివేకిని భూపాలే నశ్యన్తి గుణినాం గుణాః।
హావభావాః పురంధ్రీణాం భర్తరీ వనపుంసకే॥ ౫౦౩

తా॥ రాజు వివేకములేనివాడైనప్పుడు గుణవంతుని గుణములు కనపడవు ఎట్లనగా కుటుంబవంతురాలు తనవేడుకలంతా భర్తయందు వలె నపుంసకుని యందు చూపించుచున్నది పుంస్త్వము లేని వాడుగాన ఎట్లు జేసినా ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ నిస్సారస్య పదార్థస్య ప్రాయేణాడంబరో మహాన్।
నసువర్ణేధ్వనిస్తాదృక్ యాదృకాంస్యే ప్రజాయతే॥ ౫౦౪

తా॥ బలహీన పదార్థమునకు తరుచుగా ఆడంబరము గొప్పదిగానుండును కంచున యెంతధ్వని కలుగుచున్నదో అంత బంగారమందు ధ్వని కలగదుగదా.

శ్లో॥ గుణినాం నిర్గుణానాం చదృశ్యతే మహదంతరం।

హారః కంఠగతః స్త్రీణాం నూపురాణిచ పాదయోః॥ ౫౦౫

తా॥ గుణవంతులకున్ను గుణహీనులకున్ను అధిక తారతమ్యము కనబడుచున్నది, ఏమనగా స్త్రీలయొక్క కంఠమున హారము ప్రకాశించుచున్నది, అందెలు కాలిన ప్రకాశించుచున్నది, (గుణమనగా దారము).

శ్లో॥ అగాధ హృదయాభూపాః కూపా ఇవ దురాసదాః।
ఘటకాగుణినో నోచేత్ కథంలభ్యేత జీవనం॥ ౫౦౬

తా॥ కానరాని హృదయముతో కూడిన రాజులు భావులవలె అసాధ్యులు దగ్గిరయుండెడువారు గుణవంతులు కాని యెడల బ్రతుకును యెటుల పొందుదురు, ఇవ యర్థము ఘటకాః కుండలు దారముతో కూడనివైనయడల నీటినియెట్లు పొందగలవు.

శ్లో॥ స్త్రీణాంహి సాహచర్యా ద్భవన్తి చేతాంసి భర్తృసదృశాని।
మధురాపి హిమూర్ఛయతే విషవిటపి సమాశ్రితా వల్లీ॥ ౫౦౭

తా॥ స్త్రీలయొక్క సహవాసము చేత భర్తకానివాని మనస్సున్ను మగనిమనస్సువలె యగుచున్నది, మాధుర్యమైన తీగెయైనను విషవృక్షమును యాశ్రయించినయడల మనుజుని మూర్ఛింపజేయుచున్నదిగదా.

శ్లో॥ అధ్వాజరా మనుష్యాణామ మనధ్వావాజినాం జరా।
అమైధునం జరా స్త్రీణాం వస్త్రాణా మాతపం జరా॥ ౫౦౮

తా॥ మనుజులకు దోవనడచుటచే వృద్ధాప్యము కలుగుచు గుఱ్ఱములు కట్టివేయుటచే ముసలితనము గలుగును స్త్రీలకు సంభోగములేకుండుటచే వృద్ధాప్యము కలుగును, వస్త్రములకు యెండచే పాతదవును.

శ్లో॥ ధర్మంప్రసంగాదపినాచరన్తి పాపంప్రయత్నేనసమాచరన్తి।
ఆశ్చర్యమేతద్ధిమనుష్యలోకే౽ మృతంపరిత్యజ్యవిషంపిబన్తి ౫౦౯

తా॥ వ్యాజముతోనైనా ధర్మమును మనుజులుచెయ్యరు ప్రయత్నముతో పాపమును చేయుచున్నారు మనుష్యలోకమందు యిది ఆశ్చర్యముకదా అమృతమును విడిచి విషమును త్రాగుచున్నారే.

శ్లో॥ నీతిభూమిభుజాంనతిర్గుణవతాం హ్రీరంగనానాంరతిః
దంపత్యోశ్శిశవోగృహస్యకవితా బుద్ధేఃప్రసాదోగిరాం।
లావణ్యంవపుషశ్శ్రితం సుమనసః శ్శాంతిర్ద్విజస్యక్షమా
శక్తస్యద్రవిణం గృహాశ్రమవతాం శీలంసతాంమండనం॥ ౫౧౦

తా॥ రాజులకు న్యాయము గుణవంతులకు అణకువ స్త్రీలకు లజ్జ దంపతులకు ఆసక్తి యింటికి బిడ్డలు, బుద్ధికి పాండిత్యము మాటలకు ప్రసన్నత శరీరమునకు నిగనిగ మెరయుట విద్వాంసునికి వినికిడి బ్రాహ్మణునికి ఇంద్రియనిగ్రహము బలవంతునికి ఓర్పు గృహస్థులకు ద్రవ్యము సత్పురుషులకు మంచినడవడిక అలంకారము.

శ్లో॥ కార్పణ్యేనయశః క్రుధాగుణచయః దంభేనసత్యం క్షుధా
మర్యాదావ్యసనైఃధనంచ విపదాస్థైర్యం ప్రమాదైర్ద్విజః।
పైశున్యేనకులంమదేన వినయోదుశ్చేష్టయా పౌరుషం
దారిద్ర్యేణజనాదరః మమతయాచాత్మ ప్రకాశోహతః॥ ౫౧౧

తా॥ కృపణతచేత కీర్తి, క్రోపముచేత గుణ సమూహము, డంబముచేత సత్యమున్ను, ఆకలిచేత మర్యాదయు, దుఃఖముల చేత ద్రవ్యము, ఆపదచేత ధైర్యము, పొరపాటులచేత బ్రాహ్మణుడు కొండెములుచెప్పటచేత కులము, మదముచేత వినయము, చెడ్డనడవడికచేత పరాక్రమము, దారిద్ర్యముచేత జనులాదరణ, మమకారముచేత నాత్మజ్ఞానము చెడి పోవుచున్నది.

శ్లో॥ స్త్రీణాం యౌవనమర్థినామనుగమోరాజ్ఞాం ప్రతాపస్సతాం
స్వాస్థ్యం స్వల్పధనస్య సంహతిర సద్వృత్తేశ్చ వాగ్దంబరః।
స్వాచారస్య సదర్చనం పరిణతేర్విద్యా కులస్యైకతా
ప్రజ్ఞా యాధనమున్నతే ర్నతితతిః శాస్త్రైర్వివేకో బలం॥ ౫౧౨

తా॥ స్త్రీలకు యౌవనము, యాచకుల కనుసరింపుతనము, రాజులకుప్రతాపము. సత్పురుషులకు స్థిరచిత్తము స్వల్పధనమునకు చేరియుండుట. చెడ్డపనిని నోటి ఆడంబరము మంచి యాచారమునకు సాధువుల

పూజించుట. అణకువకు విద్య, కులమున కైకమత్యము, బుద్ధికి ధనము, గొప్పతనమునకు ప్రకాశము, ఇంద్రియనిగ్రహమునకు వివేకము బలం.

శ్లో॥ అప్రతిబుద్ధే శ్రోతరివక్తుర్వాక్యం ప్రయాతివైఫల్యం।
నయనవిహీనే భర్తరిలావణ్య మివేహఖఞ్జ నాక్షీణాం॥ ౫౧౩

తా॥ వినెడివాడు జ్ఞానహీనుడైనయడల (తెలుసుకొనని యెడల) చెప్పెడువానిమాట వ్యర్థమగుచున్నది. భర్తగ్రుడ్డివాడైనయడల కాటుక కన్నులుగలస్త్రీల సౌందర్యమేమిప్రయోజనమవును.

శ్లో॥ కాకఃపద్మవనేరతిం నకురుతేహంసోనకూపోదకే।
మూర్ఖః పండితసంగమేనరమతే దాసోనసింహాసనే।
కుస్త్రీసజ్జన సంగమేనరమతేనీచం జనస్సేవతే।
యాయస్య ప్రకృతిస్స్వభావజనితా కేనాపినత్యాజ్యతే॥ ౫౧౪

తా॥ కాకి తామరసమూహమందు ఆసక్తిపడదు, హంస బావి నీటియందు, మూఢుడు పండితులచేరికయందు, సేవకుడు సింహాసనమునందు, చెడుయాడది సత్పురుషులచేరికయందు ఆసక్తినిపొందదు. యెవనికి యేదివాసనాజన్యమైన కార్యమో యెవనిచేతను నది విడిపించ సరిపడదు.

శ్లో॥శూరశ్చ కృతవిద్యశ్చ రూపవత్యశ్చ యోషితః।
యత్రయత్ర గమిష్యన్తి తత్రతత్రకృతాదరాః।
కాచంమణిం కాంచనమేకసూత్రే ముగ్ధానిబధ్నన్తికిమత్రచిత్రం।
విచారవాన్ పాణినిరేకసూత్రే శ్వానంయువానం మఘవానమాహ॥

తా॥ మూఢులు వకసూత్రమున* గాజుపూసను బంగారమును చేర్చి కట్టుచున్నారనెడిది యేమిహాశ్చర్యము. బుద్ధి విచారముగలపాణిని

---

* సూత్రము, దారము.

ఋషివకటే సూత్రమందు కుక్కను యౌవన పురుషుని ఇంద్రునిచేర్చి ప
ఠించినాడుగదా.

శ్లో॥ అగస్త్య తుల్యాశ్చఘృతాబ్ధి శోషణే
దంభోళితుల్యా వటకాద్రి భేదనే।
శాకావళీకానన వహ్నిరూపా
తఏవభట్టా ఇతరే భటాశ్చ॥ ౫౧౬

తా॥ నెయ్యి సముద్రమును శోషింపజేసుటయందు అగస్త్యము
నితో సమానులు పాలకాయలుఅనే కొండలు భేదించుటయందుఇంద్రు
నితో సమానులు కూరకాయలు అనే అడవికి కార్చిచ్చువంటివారు అట్టి
వారే భట్టాచార్యులగుచున్నారు ఇతరులు భటులగుచున్నారు.

శ్లో॥ ధన్యాగోకుల కన్యావయమిహమన్యా మహేజగతి।
యాసాంనయన సరోజేష్వఞ్జనభూతో నిరంజనస్సాక్షాత్॥

తా॥ ఈజగత్తుయందు గోకులమందుబుట్టిన కన్యలను కృతార్థుల
నుగా మేమునెంచుచున్నాము. యేలనగా యే స్త్రీలయొక్క నేత్రము
లకు కాటుకవలెపరమాత్మ యేర్పడెనోఆకారణముచేతయని భావము.

శ్లో॥ వరంబాల్యేమృత్యుః నపునరధనం యౌవనమిదం।
వరంభార్యా వేశ్యాన పునరవినీతా కులవధూః।
వరందేశత్యాగోన పునలవివేకి ప్రభుపురం।
వరందేహత్యాగోన పునరధమాగార మటనం॥ ౫౧౭

తా॥ ద్రవ్యములేక యౌవనముండుటకంటె బాల్యమందె చచ్చుట
మేలు, అణగనిభార్యకంటె వేశ్యాస్త్రీమేలు, వివేకములేని ప్రభువుండు
పట్టణముకంటె ఆదేశము విడుచుట మేలు. అధములయింటినిగురించి తి
రుగుటకంటె శరీరమునువిడుచుటమేలు.

శ్లో॥ గంధస్సువర్ణె ఫలమిక్షుదండే నాకారిపుష్పం ఖలుచన్దనేషు।
విద్వాక్ ధనాఢ్యో నతుదీర్ఘ జీవీ
ధాతుః పురాకోపినబుద్ధిదో భూత్॥ ౫౧౮

తా॥ బంగారమున వాసనకలుగునటుల చెరుకున ఫలము చందనపు వృక్షమున పుష్పము విద్వాంసుడు ధనవంతుడు అగునటుల. బ్రహ్మకు యిట్టిబుద్ధికలగజేసెడు దీర్ఘజీవి మునువు ఒకడున్ను లేకపోయెగదా.

శ్లో॥ పరైఃప్రోక్తా గుణాయస్య నిర్గుణోపి గుణీభవేత్।
ఇన్ద్రోఽపి లఘుతాంయాతి స్వయంప్రఖ్యాపితైర్గుణైః॥ ౫౨౦

తా॥ యెవనియొక్క గుణములు యితరులచే చెప్పబడునో వాడు గుణహీనుడైనను గుణవంతుడే యగును తనవల్ల ప్రకటింపబడిన గుణములచే నింద్రుడుగూడా చులకనగును.

శ్లో॥ క్షోణీశా శ్రయిణో పరోపకరణా భావాదనా ప్తశ్రియాం।
కార్పణ్యాత్సుధియా మనధ్యయనతో యానాంప్రవాసాశ్రయాత్।
జ్ఞాత్వాణాంజగదీశభక్తివిరహాదాయుర్వృథా గచ్ఛతి।
త్యేవంకాంస్య సముద్భవః ప్రతిదినం నాదోవదత్యుచ్చకైః॥ ౫౨౧

తా॥ రాజునాశ్రయించిన వారికి పరోపకారము లేనందువలన సంపద గలవారికి లోభమువలన బుద్ధిశాలులకు చదవనందువలన యౌవనవంతులకు పరదేశవాసమువలన తెలుసుకొనుచున్నవారికి పరమాత్మయందు భక్తిలేనందువలన ఆయుర్దాయము వ్యర్థముగా పోవుచున్నదని కంచునపుట్టిన శబ్దము గట్టిగా చెప్పుచున్నదిగదా.

శ్లో॥ స్యాదత్యన్త నిరక్షరః క్షితిపతిః శ్రీకారమాత్రాశ్రయాత్।
మంత్రీతత్కృతితార్థ లేఖనపరః తత్సేవకోజాయతే।
అధ్యేతాతదగారమేవ భజతే విద్వాంస్తుతం యాచతే।
యావాక్ యస్య గిరాసమం పరిచయస్తావాక్ పిగూరశ్రయః॥

తా॥ రాజు శ్రీఅనెడువర్ణమునుమాత్ర మాశ్రయించుటవలన నిరక్షరకుక్షియగుచున్నాడు మంత్రియో ఆనిరక్షరకుక్షియైన రాజుచే చెప్పబడినదానిని వ్రాయుడు వానికిబంటుడై పుట్టుచున్నాడు. చదివెడువాడు ఆరాజునే సేవించుచున్నాడు విద్వాంసుడు వానినే యాచించుచున్నాడు

యెవనియొక్క మాటకు సమం వెంత పరిచయము అంత దాపుగా సంపదలుండును.

శ్లో॥ గురురేకః కవిరేకః సదసిమఘోనః కలాధరో ప్యేకః।
అస్మాతమిత్ర సభాయాం గురవః కవయః కలాధరాస్సర్వే॥ ౫౨౩

తా॥ ఇంద్రునిసభలో గురువొకడె కవియునొకడే, కలావంతు డొకడె, యీసభలో, అందరుగురువులే, అందరుకవులె అందరు కలాధరులె, యేమిఆశ్చర్యము. అనగా. యింద్రసభలో బృహస్పతి, శుక్రుడు, చంద్రుడని. యిక్కడ గొప్పవారని కవులని కలావంతులుగాని విద్యావంతులు గానియర్థము.

శ్లో॥ కమలె కమలా శేతే హరశ్శేతే హిమాలయే।
క్షీరాబ్ధౌచ హరిశ్శేతే మన్యేమత్కుణ శంకయా॥ ౫౨౪

తా॥ లక్ష్మి జలమందుగాని తామర పుష్పమందు గాని పవ్వళించుచున్నది. పరమశివుడు హిమవద్గిరియందు క్షీరాబ్ధియందువిష్ణువు ఇటుల వీరుకొండలో నీటిలోశయనించడ మెందుకనగా నల్లులబాధచే స్థలముల యందు వసించుచున్నారని తలచెదను.

శ్లో॥ అతిపరిచయాదవజ్ఞా సంతతగమ నాదనాదరోభవతి।
మలయేభిల్ల పురంధ్రీ చందనతరుకాష్ఠ మింధనంకురుతే॥ ౫౨౫

తా॥ అధికసంపర్కమువల్ల అవమానము యెల్లప్పుడు పోవుటవలన ఆదరణలేకపోవుట కలుగు చున్నది యెట్లన మలయ పర్వతమంచు ఏంచుస్త్రీ చందనపుకట్టెను పొయ్యికికట్టెలుగా చేయుచున్నది.

శ్లో॥ పౌలస్త్యఃకథమన్యదారహరణే దోషంనవిజ్ఞాతవాన్।
అజ్ఞైశ్చాపి యుధిష్ఠిరేణ రమతాజ్ఞాతోన దోషోనుకిం।
రామేణాపివనే హేమహరిణస్యా సంభవోలక్షితః।
ప్రత్యాసన్నవిపత్తిమూఢమనసాం ప్రాయోమతిఃక్షీయతే॥ ౫౨౬

తా॥ రావణాసురుడు అన్యస్త్రీని కొనిపోవుటయందు దోషము ను తెలుసుకొనక పోయెను, పాచికలచేనాడు ధర్మరాజు జూదమాడు

ట దోషమని మేలతెలుసుకొనలేము. రాముడు బంగారమృగముకలగదని మేలకని పెట్టలేదు. గనుక ఆపదసమీపించుటచే మోహమును జెందిన మనస్సుగల వారికి తరుచుగా బుద్ధి చెడిపోవుచున్నది.

శ్లో॥ దౌర్మన్త్ర్యాన్నృపతిర్వినశ్యతి యతిస్సంగాత్సుతో లాలనా
ద్విప్రోఽనధ్యయనాత్ కులంకుతనయాచ్ఛీలం ఖలోపాసనాత్।
హ్రీర్మద్యాదనవేక్షణాదపి కృషిస్స్నేహః ప్రవాసాశ్రయాత్
మైత్రీచాప్రణయాత్ సమృద్ధిరనయాత్త్యాగాత్ ప్రమాదాద్ధనం॥

తా॥ దుర్మన్త్రియాలోచనచే రాజున్ను సంపర్కముల వలన, సన్యాశిన్ని, బుజ్జగించుటవలన, బిడ్డ, చదవనందువలన బ్రాహ్మణుడున్ను, దుష్ట తనయునివలన వంశమున్ను, దుర్మార్గులను కొలుచుటచే, మంచినడవడికయున్ను. కల్లు త్రాగుటవలన, లజ్జయున్ను, చూడకున్నందున పైరున్ను, పొరుగూరిన వసించుటవలన స్నేహమున్ను కలహించుట వలన మిత్రభావము న్యాయములేనందువలన సంపదన్ను యీవివలన పొరపాటువలన ధనమున్ను, చెడిపోవును.

శ్లో॥ లోభశ్చేదగుణేనకిం పిశునతాయద్యస్తికిం పాతకైః
సత్యంచేత్తపసాచకిం శుచిమనోయద్యస్తి తీర్థేనకిం।
సౌజన్యంయదికిం భక్తైః సుమహిమాయద్యస్తి కిమ్మండనైః
సద్విద్యాయదికిం ధనైరపయశోయద్యస్తికిం మృత్యునా॥ ౪౭౮

తా॥ కృపణతయున్నయెడల వేరేచెడుగుణముచేత నేమిప్రయోజనం, కొండెము చెప్పటయున్నయెడల వేరేపాపములచేత నేమి, సత్యమున్నయెడల, తపస్సుచేత నేమి, మంచిమనస్సున్నయడల తీర్థాటనముచేత నేమి, మంచితనమున్నయడల పనివారిచేత నేమి మాహాత్మ్యమున్నయడల, అలంకారములచేత నేమి, మంచివిద్యయున్నయడల ధనములచేత నేమి, అపయశస్సున్నయడల, మృత్యువుచేత నేమిప్రయోజనము.

శ్లో॥ శశీదివస ధూసరో గళిత యౌవనాకామినీ
సరో విగతవారిజం ముఖమనక్షరం స్వాకృతేః।

ప్రభుర్ధనపరాయణస్సతత దుర్గతస్సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్తశల్యాని మే ॥ ౫౭

తా॥ దినములచే తగ్గి మాసిపోయిన చంద్రుడు, యౌవనము పోయిన భార్య. తామరతగ్గిపోయిన గుంట, చదువులేని ముఖము, ధనమం దాశగల ప్రభువుయెల్లప్పుడు దరిద్రుడైన సత్పురుషుడు, రాజసభా ప్రవేశకుడైన దుష్టుడు యివిమనస్సుకు ౭ శల్యములు.

శ్లో॥ పతంగపాకసమయే పతంగసమవిక్రమాః।
పతంగస్యోదయేచేరుః పతంగా ఇవవానరాః॥ ౫౩౦

తా॥ పతంగమనె వడ్లు పండు సమయమున గరుడ పరాక్రమముగల కోతులు సూర్యోదయ కాలమున మిడతలవలె సంచరించినవి.

శ్లో॥ శీలభారవతీకాన్తా పుష్పభారవతీలతా।
అర్థభారవతీవాణీ భజతేకామపిశ్రియం॥ ౫౩౧

తా॥ మంచి స్వభావమును మోసుకున్న స్త్రీ, పుష్ప భారముతో కూడినతీగె, అర్థపుష్టితోకూడిన వాక్కున్నూ యెదోవక శోభను పొందుచున్నది.

శ్లో॥ తాంబూలస్య గుణాస్సన్తి శతశోథ సహస్రశః।
ఏకోపిచమహాన్ దోషఃయస్య రానాద్విసర్జనం॥ ౪౩౨

తా॥ తాంబూలమునకు నూరువేలుగా గుణములున్నవి, ఐతేవక గొప్పదోషమున్నది ఏదియనగా దేనిని యివ్వడముతోనే యింటకి అంపించడమవుతున్నదో అదిగొప్పదోషమని భావము.

శ్లో॥ భూపఃకూప ఇవాభాతినమజ్జన సుఖావహః।
దదాతిగుణసంబంధాత్ యథాపాత్రానురూపతః॥ ౫౩౩

తా॥ రాజు భావివలె నమస్కరించెడువారికి సుఖమును కలగజేసెడువాడుగా ప్రకాశించుచున్నాడు, కూపావర్ధందు మునుగువారికి సుఖకరముకాదనిభావము గుణసంబంధమువలన పాత్రమతగినట్టు సుఖమును యిచ్చుచున్నని.

శ్లో॥ అంధందరిద్రిణ మపిప్రియయాపిహీనం
వీక్ష్యేశ్వరోవదతి యాచవరం త్వమేకం।
నేత్రేన నాపివసునో వనితాం సవత్రే
ఛత్రాభిరామ సుతదర్శన మిత్యువాచ॥ ౫౩౪

తా॥ ఒకగుడ్డివాడును దరిద్రుడును భార్యా విహీనుడనగువానిని జూచి శివుడు వకవరమును కోరుమనిచెప్ప, కండ్లను ద్రవ్యమును భార్యను కోరక నతడు ఏకఛత్రాధిపత్యముతో కూడిన కుమారుని నేనుచూడవల యునని కోరెను.

శ్లో॥ ఉపభోక్తుం నజానాతిశ్రియం ప్రాప్యాపిమానవః।
ఆకంఠజలమగ్నోపి శ్వాలిహత్యేవ జిహ్వయా॥ ౫౩౫

తా॥ సంపదపొందినప్పటికిన్ని, అనుభవించడమునకు తెలుసుకోనడు యెట్లనగా, కుక్కగొంతు లోతునీటిన మునిగియున్నను నాలికచే నాకునేగాను నోటినిండా తాగనట్లు అని భావము.

శ్లో॥ అబలాయత్ర ప్రబలా శిశురవనీశో నిరక్షరశ్చ మన్త్రీ।
నహినహితత్ర ధనాశాజీవిత ఆశాపిదుర్లభా భవతి॥ ౫౩౬

తా॥ యెచ్చట స్త్రీ ప్రబలవంతురాలుగాను పశివాడు రాజుగాను నిరక్షరకుక్షియైనవాడు మంత్రిగాను వున్నదో, అక్కడ ద్రవ్యాశ లేదు బ్రతుకు యందాశయున్న లేదు.

శ్లో॥ అయశ్చణకచర్వణం ఫణిఫణామణేః
కర్షణంకరేణ గిరితోలనంజలనిధేః పదాలంఘనం।
ప్రసుప్తహరిబోధనం నిశితఖడ్గ సంస్పర్శనం
కదాచిదఖి లంభవేన్నచ శఠాద్ధన స్యార్జనం॥ ౫౩౭

తా॥ ఇనుపశనగలు నవలట, సర్పశిరస్సున మణినిలాగుట చేతితో కొండను ఆడించుట కాలితో సముద్రమును దాటుట నిద్రబోవున్యాఘ్రసింహ్మమును లేపుట తీక్ష్ణమగుకత్తిని త్రాకుట యినియన్నియెప్పుడైనను సంభవించునుగాని దుష్టునినుండి ధన సంపాదన మాత్రం వానరు భావము.

శ్లో॥ సర్పస్య రత్నే కృపణస్య విత్తే సత్యాః కుచే కేసరిణశ్చ కేశే।
మానోన్నతానాం శరణాగతేచ మృతౌభవేదస్య కరప్రచారః॥

తా॥ సర్పముయొక్క రత్నమందు కృపణుని ద్రవ్యమందు పతివ్రత స్తనమందు సింహము యొక్క వెంట్రుకలయందు మానవంతుల యొక్క శరణాగతియందు ఇతరులచేయి ప్రసరించడము మరణ విషయము ననే యేర్పడును.

శ్లో॥ శ్లోకస్సుశ్లోకితాం యాతియత్రతిష్ఠన్తి సాధవః।
లకారోలుప్యతే తత్రయత్రతిష్ఠన్త్యసాధవః॥ ౫౩౯

తా॥ యెచ్చట సాధు వృత్తాంత ముంటున్నదో అక్కడ శ్లోకము కీర్తి యుతముగా నుండును, సాధువులు లేనిచోట శ్లోకమందు లకారములో పించిపోవును శోకముగా నుండును.

శ్లో॥ ఆర్తా దేవాన్నమస్యన్తి తపఃకుర్వన్తి రోగిణః।
నిర్ధనా ధనమిచ్ఛన్తి వృద్ధానారీ పతివ్రతా॥ ౫౪౦

తా॥ ఖిన్నులైనవారు దేవతలను నమస్కరించుచున్నారు రోగవంతులు తపస్సును చేయుచున్నారు ధనములేనివారు ధనము నిచ్చయించుచున్నారు స్త్రీముసలిదైనయెడల పతివ్రతయగును.

శ్లో॥ కస్యాపికోప్యతిశయోస్తి సతేనలోకే
ఖ్యాతింప్రయాతి నహిసర్వవిదస్తు సర్వే।
కింకేతకీ ఫలతికిం పనసస్సపుష్పః
కింనాగవల్ల్యపి చపుష్పఫలైరుపేతా॥ ౫౪౧

తా॥ లోకమందు యెవనికో యెదోవక అతిశయమువచ్చుచున్నది వానిచేతవాడు ఖ్యాతిని పొందుచున్నాడు, అందరు అన్ని అతిశయముల నుపొందరు. మొగిలిచెట్టు ఫలించుచున్నదా తమలపాకుతీగె పనసచెట్టు పుష్పించుచున్నదా ఏమీలేదు గనుక అందరికి అన్నిరావు.

శ్లో॥ ననాన్ద్రాసానందా హసితవదనా భ్రాతృగినికా
కృతాధారాచశ్వశ్రూః కుపితదృతిపతౌ మంయుసఖీ।

సచేన్మచ్చైగ్యాశ్రితే కరినవచన్నైస్త్రీస్సకలాః
కరిష్య న్తిప్రాహౌవసన రహితాస్తాండవవిధిం॥ ౫౪౨

తా॥ ఒక స్త్రీ చెలికత్తెను చూచి తన అత్తగారింటి కష్టమును చె ప్పుచున్నది నాభర్త కండ్లెలు చేసుకొన్న యెడల వదినగారు ఆనందము తో కూడియుండును ఆడబిడ్డ మందహాసముతో నుండును అత్తగారు,బోధిం చినది నెరవేరినదని కృతార్థురాలవును కరినపుమాటలచేత ఘట్టిగాయెర చినయెడల అందరును వస్త్రహీనులై యేం నటనమును చెయ్యగలరు.

శ్లో॥ నకేశేషుస్నేహో నచకుచతటీచందనరసః
నవాపీటీవక్త్రే నచనయనయో రంజనకథా।
నచాలోప్యాకల్పో నచసువసనంనైవకుసుమం
స్సుపాత్వంపావానాం ఫలమధనగేహేషు సుదృశాం॥ ౫౪౩

తా॥ పై స్త్రీవృత్తాంతము వెంట్రుకలకు చమురులేదు స్తనములకు చందనమెన్నడు లేదు. నోటికి విడెములేదు కంటికి కాటికసంగతేలేదు ఇంచుకంతనైన అలంకారములేదు మంచిచీరరెలేదు పుష్పమురేదు. దరి ద్రులయింట స్త్రీలకు కోడలితనము జన్మాంతర పాపములకు ఫలము.

శ్లో॥ అనుయాతాఽనేకజనః పరపురుషైరుహ్యతేఽస్య నిజదేహః।
అధికారస్థః పురుషఃశవ ఇవనశృణోతి వీక్షతేకుమతిః॥ ౫౪౪

తా॥ అనేకజనము కూడవచ్చుచున్నది వీనియొక్క శరీరము ఇతర పురుషులచేత మోసుకొనిపోబడుచున్నది. అధికారముతో కూడిన పురు షుడు శవమువలె వినడు చూడడు.

శ్లో॥ జామాతాజఠరం జాయాజాతవేదాజలాశయః।
పూరితానైవపూర్యన్తే జకారాః పంచదుర్భరాః॥ ౫౪౫

తా॥ అల్లుడు జఠరాగ్ని భార్య. అగ్ని. సముద్రము యీ ౫ జకా రములు ఆసిగాగల పేర్లతో కూడిన వస్తువులు నిండిన నైనను నిండనే నిండవు.

శ్లో॥ జననీజన్మభూమి శ్చజాహ్నవీచ జనార్దనః।

జనకః పశ్చుతస్త్చైవజకారాః పంచదుర్లభాః॥ ౫౪౬

తా॥ తల్లి. పుట్టినచోటు గంగానదీ మహావిష్ణువు తండ్రి యీ ౫ జకారములు చిక్కుటయరుదు.

శ్లో॥ సదావక్ర స్సదాక్రూరః స్వస్మైపూజామపేక్షతే।
కన్యారాశిగతోనిత్యం జామాతాదశమోగ్రహః॥ ౫౪౭

తా॥ అల్లుడనెడువాడు పదియవగ్రహము. ఆతొమ్మిదిగ్రహముల కంటె యీ అల్లుడనెడు గ్రహము. యెప్పుడు వక్రమైనదే. యెప్పుడు క్రూరమైనదే తనకెయెప్పుడు పూజనపేక్షించుచున్నాడు యీగ్రహము కన్యారాశిలోనే వుండును గనుక యితనుపదియవగ్రహము.

శ్లో॥ సులభంవస్తు సర్వస్యనయాత్యా దరణీయతాం।
స్వదారపరిహారేణపరదారార్థినోజనాః॥ ౫౪౮

తా॥ అందరికి పదార్థము సులభమైనయెడల అదరించతగినది కాదు. తనభార్యను నపహరించి అన్యస్త్రీలను జనులుకోరుచున్నారు గదా.

---



రమ్భాశుకసంవాదః.

రమ్భోవాచ ॥ మార్గేమార్గే నూతనం చూత ఖండం
ఖండేఖండే కోకిలానాం విరావః।
రావేరావే మానినీ మానభంగో
భంగే భంగే మన్మధః పంచబాణః॥ ౧

తా॥ శృంగార రసప్రధానముగా రంభ చెప్పుచున్నది. ఒకొొక్క త్రోవయందున్న నూతనమైన తియ్యమామిడి తోపున్నది. ఒకొొక్క తోపులో కోకిలయొక్క ధ్వనికలుగుచున్నది. ఒకొొక్క ధ్వనిలోనున్న స్త్రీ లయొక్క గర్వము పోవడమున్నది. ఒకొొక్క గర్వ భంగమునందున్న ౫ బాణములతో కూడిన మన్మధుడు ప్రకాశించు చున్నాడు.

శుక॥ మార్గేమార్గేజాయతేసాధుసంగఃసంగేసంగేశ్రూయతేకృష్ణకీర్తిః
కీర్తౌకీర్తౌనస్తదాకారవృత్తిఃవృత్తౌవృత్తౌసచ్చిదానందభాసః॥ ౨

తా॥ వేదాంత రీతిగా శుకస్వామి చెప్పుచున్నారు. ఒక్కొక్కత్రోవలో సాధుసంబంధము కలుగుచున్న. ఆయా సాధుసంగమున కృష్ణవైభవము వినబడుచున్నది. ఆయా కృష్ణగుణ శ్రవణమందున్ను మాకు ఆ కృష్ణాకారము ఎదటయున్నట్లగుచున్నది. అట్లుండు రీతిరీతిన బ్రహ్మానందము ప్రకాశించుచున్నది.

శు॥ తీర్థేతీర్థే నిర్మలంబ్రహ్మబృన్దం బృన్దేబృన్దే తత్వచిన్తానువాదః।
వాదేవాదేజాయతేతత్వబోధఃబోధేబోధేభాసతేరామచంద్రః॥ ౩

తా॥ శుకులుచెప్పుచున్నారు. ఒక్కొక్క పుణ్యక్షేత్రమందు నిర్మలమైన బ్రాహ్మణసమూహమున్నది. ఒక్కొక్క సమూహమున బ్రహ్మధ్యాన ప్రవచనమున్నది. ఒక్కొక్క ప్రవచనమునందు యధార్థము స్ఫురించుచున్నది. ఒక్కొక స్ఫురణమునందున్ను పర బ్రహ్మయగు రామచంద్రుడు కానబడుచున్నాడు.

రం॥ గేహేగేహేజంగమా హేమవల్లీ
వల్ల్యాం వల్ల్యాం పార్వణంచంద్రబింబం।
బింబేబింబేదృశ్యతే మీనయుగ్మం
యుగ్మేయుగ్మే పంచబాణ ప్రచారః॥ ౪

తా॥ ఒక్కొక్కయింటిని చంచలమైన బంగారపుతీగయుంటున్నది. (అనగా స్త్రీ.) ఒక్కొక్క తీగెన పూర్ణ చంద్ర బింబముంటున్నది. ఒక్కొక బింబమున మత్స్యముల జతవుంటున్నది. ఒక్కొక్క జతలో మన్మథబాణ ప్రచారముంటున్నది. అనగా చూపువల్ల మోహము కలుగునని భా.

శు॥ స్థానేస్థానేదృశ్యతేరత్నవేదీవేద్యాంవేద్యాంసిద్ధగంధర్వగోష్ఠీ।
గోష్ఠ్యాంగోష్ఠ్యాంకిన్నరద్వంద్వగీతంగీతేగీతేగీయతేరామచంద్రః॥ ౫

తా॥ ఒక్కొక్క స్థానమున రత్నఖచితమైన అరుగుకనబడుచున్నది ఒక్కొక్క అరుగు సిద్ధ గంధర్వుల సమూహమున్నది. ఒక్కొక్క సమూ

ఖాముస కిన్నరుల గీతమున్నది. ఒకొక్క గీతమున రామచంద్రుడు కొని యాడబడుచున్నాడు. అనగా హృదయము అనగు అందున సర్వశాస్త్రా ర్థములే గంధర్వగోష్ఠి ఆసమూహములో కర్మజ్ఞానమనె కిన్నరద్వంద్వ గీతము యీరెంటియందు ప్రకాశించెడువాడు రామమూర్తి యనిభావ.

రం। పీనస్తనచందనచర్చితాంగి విలోలనేత్రా తరుణీసుశీలా।
నాలింగితా ప్రేమభరేణ యేనవృథాగతంతస్య నరస్యజీవితం॥ ౬

తా॥ బలిశిన స్తనములతో కూడి చందనము పూసుకున్న శరీరము తో కూడి చంచల నేత్రముగలిగి యౌవనవంతురాలై మంచినడవడికతో కూడిన స్త్రీ ఆశతో కూడిన యెవని చేత ఆలింగనము చేసుకొనబడలేదో అట్టి మనుష్యునియొక్క బ్రతుకువ్యర్థము.

శుక॥ అచింత్యరూపో భగవాన్ నిరంజనో
విశ్వంభరో జ్ఞానమయ శ్చిదాత్మా।
విశోధితో యేనహృదిక్షణం నో
వృథాగతం తస్య నరస్య జీవితం॥ ౭

తా॥ తలచుటకు వల్లలేని స్వరూపముతో కూడి హేయగుణములు లేక జగత్తులన్నిటిని వహించుకొన్న జ్ఞానస్వరూపియైన పరమాత్మయె వనియొక్క హృదయమునందు క్షణకాలమైనా ధ్యానింపబబలేదో అట్టి వాని బ్రతుకు వ్యర్థము.

రం॥ కామాతురా పూర్ణశశాంక వక్త్రా
బింబాధరా కోమల నాలగౌరా।
నాందోళితా స్వే హృదయేభుజాభ్యాం
వృథాగతం తస్య నరస్యజీవితం॥ ౮

తా॥ సంభోగమందాశ గలిగి చంద్ర బింబముతో సమానమైన ముఖముతోగూడె దొండపండుతో సమానమైన పెదవులతో గూడి తామరతూండ్లవలె వర్ణము గలిగిన స్త్రీ యెవనియొక్క హృదయము ననుండి రమించలేదో అట్టివాని బ్రతుకు వ్యర్థము.

శుక॥ చతుర్భుజశ్చక్రధరో గదాయుధః
పీతాంబరః కౌస్తుభమాలయాలసన్
ధ్యానేధృతో యేన నబోధకాలే
వృథాగతంతస్య నరస్య జీవితం॥ ౯

తా॥ చతుర్భుజుడై చక్రమునుధరించినవాడై గదాపీతాంబరవన మాలికలతోకూడి ప్రకాశించుచున్న పరమాత్మ ధ్యానకాలమందు యెవనిచేత నాకర్షింపబడలేదో నట్టివానియొక్క బ్రతుకు వ్యర్థము.

రం॥ విచిత్రవేషానవయౌవనా ఘ్యాలవంగ కర్పూరసువాసిదేహా
నాలింగితా యేనదృఢంభుజాభ్యాం వృథాగతం తస్యనరస్యజీవితం॥

తా॥ విచిత్రమై యలంకారముతోగూడి నూతనమైన యౌవనవంతురాలై లవంగ కర్పూర వాసనతో గూడిన స్త్రీ యెవనిచేత దృఢముగా నాలింగనము చేసుకోబడలేదో వానియొక్క జీవము వ్యర్థము.

శుక॥ నారాయణః పంకజలోచనః ప్రభుః
కేయూరవాన్కుండల మండితాననః।
భక్త్యాస్తుతో యేన సమాధితోవా
వృథాగతం తస్య నరస్య జీవితం॥ ౧౧

తా॥ తామరసనేత్రుడున్ను సర్వవ్యాపియు కేయూరకుండలములచే ప్రకాశించెడు ముఖముతోగూడిన నారాయణుడు యెవనిచే ధ్యానింపబడడో అట్టివాని జీవము వ్యర్థము.

రం॥ ప్రియంవదాచంపకహేమవర్ణా హారావళీమండితనాభిదేశా।
సంభోగశీలారమితానయేనవృథాగతంతస్యనరస్యజీవితం॥౧౨

తా॥ ప్రియముగ మాటలాడుచున్నదిన్ని బంగారపువన్నెగలదిన్ని హారాదులచే ప్రకాశించే నాభిప్రదేశముతో గూడిన సంభోగమందు ప్రియముగల స్త్రీ యెవనిచే రమింపబడలేదో అట్టివానిజన్మము వ్యర్థము.

శుక॥ శ్రీవత్సలక్ష్మాంకితహృత్ప్రదేశస్తార్క్ష్యధ్వజఃశార్ఙ్గధరఃపరాత్మా
న సేవితో యేననృజన్మనాపి వృథాగతంతస్యనరస్య జీవితం॥ ౧౩

తా॥ శ్రీవత్సమనెడు మచ్చచే గురుతేర్పడిన హృదయ ప్రదేశము తోగూడి గరుడవాహనముతో కూడినరాజఠీవిని ధరించినపరమాత్మ యేమనుజునిచేత సేవింపబడలేదో వానిజీవముఖ్యర్థము.

రం॥ చలత్కటీసూపురమంజుఘోషానాసాగ్రముక్తానయనాభిరామా
న సేవితాయేన భుజంగవేణీవ్యథా॥ ౧౪

తా॥ కదలుచున్న నడుము అందెలయొక్క మనోహరమైనశబ్ద ముతోకూడినది న్ని ముక్కు-కొనను బులాకిముత్యముచే కంటకి మనోహరమైనదిన్ని శేషుడివంటి జడతోకూడిన స్త్రీ యెవనిచే పొందబడలేదో వానిజీవము వ్యర్థము.

శుక॥ విశ్వంభరోజ్ఞానమయః పరేశోజగన్మయోనన్తగుణప్రకాశీ
నారాధితోనాపి ధృతోనయోగేవ్యథా॥ ౧౫

తా॥ లోకమును ధరించుచున్న జ్ఞానమయుడైన జగత్స్వరూపి యై అనన్తగుణములచే ప్రకాశించెడు పరమాత్మ, యెవనిచే యోగ మందు ధరింపబడలేదో వానిబ్రతుకు వ్యర్థము.

రమ్భ॥ తాంబూలరాగైః కుసుమప్రకర్షైః
సుగంధతైలేనచ వాసితాయాః
నోమర్దితా యేనకుచౌనిశాయాంవ్యథా
గతంతస్య నరస్య జీవితం॥ ౧౬

తా॥ తాంబూలముయొక్క యెఱుపులచేతను పుష్పములచేత సుగంధతైలముచేత పరిమళించెడు స్త్రీయొక్క స్తనములు రాత్రిని యెవనిచే పీడింపబడలేదో వానిజీవముఖ్యర్థము.

శుక॥ బ్రహ్మాదిదేవోఽఖిలవిశ్వదేవో మోక్షప్రదోతీతగుణఃప్రశాన్తః
ధృతోనయోగేన హృదిస్వకీయెవ్యథా॥ ౧౭

తా॥ బ్రహ్మాదులలో ప్రకాశించెడివాడై సర్వప్రపంచమునకుప్రధానుడై, మోక్షమును యిచ్చేటివాడైనిర్గుణుడై కామాదులులేనివాడైన

పరమాత్మ యెవనిచే, హృదయమందు యోగాభ్యాసకాలమున ధరింప బడలేదో వానిజన్మము వ్యర్థము.

రమ్భా॥కస్తూరికా కుంకుమ చందనైశ్చ సుచర్చితాయాః
గురుధూపితాంబరా। ఉరస్థలేనోలురి తానిశాయాంవృధా॥ ౧౮

తా॥ ఎవనియొక్క వక్షస్థలమున కస్తూరీకుంకుమచందనాదులచే పరిశోభించెడుదియ్ను అగరుధూప పరిమళముతోకూడిన చీరెగట్టిన స్త్రీ పొర్లాడలేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ ఆనందరూపోనిజబోధరూపో దివ్యస్వరూపోబహునామరూపః
తతస్సమాధౌ కలితోనయేనవృధా॥ ౧౯

తా॥ ఆనందస్వరూపుడై జ్ఞానముచే తెలియబడువాడై దివ్యరూపముతో కూడినవాడై అనేక నామ రూపములతో కూడిన పరమాత్మ యెవనిచే ధ్యాన కాలమున ఆకర్షింప బడలేదో వాని జన్మము వ్యర్థము.

రమ్భా॥కరోరపీన స్తనభారన మ్రాసుమధ్యమా చంచలఖంజనాక్షీ
హేమన్తకాలే రమితానయేన వృధా॥

తా॥ కరోరమై బలిశిన స్తనభారముచేత వంగినదియ్ను సన్ననడుముతోకూడినదియ్ను తిప్పుచున్న కాటుక కన్నులుగలస్త్రీ యెవనిచే చలికాలమున రమింపబడలేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ తపోమయోజ్ఞాన మయోవిజన్మా విద్యామయోయోగమయః
పరాత్మా। చిత్తే ధృతోనో తపసిస్థితేన వృధా॥ ౨౧

తా॥ తపస్స్వరూపియై జ్ఞానస్వరూపియై. విద్యామయుడై యోగమయుడై జననమరణములులేని పరమాత్మ యెవనిచే మనస్సున ధరింపబడలేదో వానిజన్మము వ్యర్థము.

రం॥ సులక్షణా మానవతీగుణాఢ్యా ప్రసన్నవక్త్రా మృదుభాషిణీయా
నోచుంబితాయేన సునాభిదేశే వృధాగ॥ ౨౨

తా॥ మంచిలక్షణములతోకూడి మానవంతురాలై మంచి గుణ

వంతురాలై చల్లగామాటలాడు మంచి స్త్రీ యెవనిచే ముద్దిడుకొనబడ లేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ పత్న్యార్జితం సర్వసుఖంవినశ్వరం దుఃఖప్రదం కామినిభోగ సేవితం । ఏవంవిదిత్వా నధృతోహియోగోవృధా॥ ౨౩

తా॥ భార్యవల్లనేర్పడునది సంభోగముచే నేర్పడునదిసర్వసుఖ మున్ను నశించునదియు దుఃఖమును కలగజేసెడునదియు నగును. అని తెలిసి యోగము నెవనిచే ధరింపబడలేదో వానిజన్మము వ్యర్థము.

రం॥ విశాలవేణీ నయనాభిరామా కందర్పసంపూర్ణ నిధానశూరా భుక్తానయేనైవ వసన్తకాలేవృధా॥ ౨౪

తా॥ విస్తారమైన జడగలదియు కంటికిమనోహరమైనన్మథవ్యాపారమందు బహుసమర్థురాలైన స్త్రీ యెవనిచే వసన్తకాలమందు అనుభవించబడలేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ మాయాకరండీ నరకస్యహండీ తపోవిఖండీ సుకృతస్యభండీ నృణాంవిఖండీ చిరసేవితాచె ద్వృధా॥ ౨౫

తా॥ మాయకుభరిణవంటిదిన్ని నరకమునకు అండా అనేపాత్రవంటిదిన్ని. తపస్సును ఖండించెడుదిన్ని పుణ్యము పాడుచేయునదియై మనుజులను చెరిపెడు స్త్రీ యెవనిచే బహుకాలము కొలవబడినయడల వానిజన్మమువ్యర్థము.

రం॥ సమస్త శృంగార వినోదశీలాలీలావతీకోకిల కంఠనాళా విలాసితానో నవయావనేన వృధా॥ ౨౬

తా॥ సర్వశృంగార రసములతో కూడి వేడుక స్వభావము గల దిన్ని ఆటపాటలతోకూడినదిన్ని కోకిలవలెకంఠనాళముతో కూడిన స్త్రీయేనూతనప్రాయముగల పురుషునిచేత వేడుకగా క్రీడింపబడలేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ సమాధిహా స్త్రీజనమోహాయ స్త్రీ ధర్మేకుమ స్త్రీకపటస్యతంత్రీ సతోహమాణహంత్రీ కలితాచయేన వృధా॥ ౨౭

తపస్సును నాశనము చేయునదియు జనులను మోహింప జేయు నదియు ధర్మమందు కుత్సిత మన్త్రమువంటిదిన్ని కపట తంత్రముతో కూడినదిన్ని సత్కర్మముల చెరుపునదియైన స్త్రీయెవనిచే పొందబడ నదో వానిజన్మమువ్యర్థము.

రం॥ బిల్వస్తనీకోమలితా సుశీలా సుంగంధకుంతాలలితాచగౌరా।
నాశ్లేషితాయేనచ కంఠదేశేవృథా॥ ౨౯

తా॥ బిల్వఫలము వంటిస్తనములతో కూడి మెత్తని శరీరము గల మంచినడవడికగల పరిమళవిశేషముతో కూడి బంగారపు రంగుగలమనోహరమైన స్త్రీ యెవనికంఠదేశమందు ఆలింగింప బడలేదో వాని జన్మము వ్యర్థము.

శుక॥ చిన్తావ్యథాదుఃఖమయీ సదోషా
సంసారపాశా జనమోహకర్త్రీ।
సంతాపకోశా భజితాచయేన వృథాగతం॥

తా॥ చింతపీడ దుఃఖమయమైనదిన్ని సంసారమున దారమువంటి దిన్ని దోషముతో కూడినదిన్ని జనులకుఅజ్ఞానమును కలగ జేసెడుదిన్ని సన్తాపమునకు బొక్కసమువంటిదియైన స్త్రీ యెవనిచే పొందబడినదో వానిజన్మము వ్యర్థము.

రం॥ ఆనందకందర్పనిధానరూపా రణత్క్వణత్కంకణనూపురాఢ్యా
నాస్వాదితాయేనసుధా ధరస్థావృథా॥ ౩౦

తా॥ ఆనందమునకున్ను మన్మథునికిన్ని వునికిపట్టైన ఆకారము గలదిన్ని శబ్దించుచున్న కంకణ నూపురములచే ప్రకాశించెడు దిన్ని అమృతమయమైన పెదవులతో కూడిన స్త్రీ యెవనిచే ఆస్వాదింప బడ లేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ కాపట్యవేషా జనవంచికా సావిణ్మూత్ర దుర్గన్ధదరీదురాశా।
సంసేవితాయేనసదామలాఢ్యావృథా॥ ౩౧

తా॥ కపటవేషముతో కూడినదిన్ని జనవంచకురాలున్నూమలమూత్రములకు అగడ్త వంటిదిన్ని దురాశతోఁకూడినదిని యిట్టి స్త్రీ యెవనిచే కొలవబడుచున్నదో వానిజన్మము వ్యర్థము.

రం॥ చంద్రాననా సుందరి గౌరవర్ణా వ్యక్తస్తనీభోగవిలాసదక్షా।
నాందోళితా హ్యైశయనేషుయేనవృథా॥ ౩౨

తా॥ చంద్రముఖియు సుందరమైన పసుపువన్నె గలదై తెలియు స్తనములతోఁగూడి సంభోగ విలాసమున సమర్థురాలైన స్త్రీ యెవనిచే పడకన ఊగించబడలేదో వానిజన్మము వ్యర్థము.

శుక॥ ఉన్మత్తవేషా మదిరాసుమత్తా పాపప్రదాలోక విడంబినీయా।
యోగచ్ఛలాయేన విభాజితాచ వృథాగతం॥ ౩౩

తా॥ మోహమును కలగజేసెడు వేషముతో కూడి మద్యముచే మత్తురాలై పాపమును కలగజేసెడు జనులకు మందతనమును కలగజేసెడు కపట యోగముతో కూడిన స్త్రీ యెవనిచె కొలచబడుచున్నదో వానిజన్మము వ్యర్థము.

రం॥ ఆనందరూపా తరుణీనతాంగీ సద్ధర్మసంపాధనసృష్టిరూపా।
కామార్థదాయస్య గృహేననారీవృథాగతం॥ ౩౪

తా॥ ఆనందమును కలగజేసెడు రూపముతో కూడి యౌవనముతోఁకూడి వంగినశరీరముగలదియై మంచిధర్మములకు సాధనమైన జన్మముతోఁకూడి కామార్థములనిచ్చెడు స్త్రీ యెవనియింటలేదో వాని జన్మము వ్యర్థము.

శుక॥ అశౌచదేహాపతితస్వభావావ్యః ప్రగల్భాబలలోభశీలా।
మృషావిద న్త్రీ కలితాచయేన వృథాగతంతస్య॥ ౩౫

తా॥ పరిశుద్ధమైన శరీరములేక పాపస్వభావముతోఁకూడి శరీర ప్రభావముతోఁకూడి అబలాత్వముమారిలోభ నడవడికతోఁకూడి అబద్ధమును చెప్పునట్టిదియైన స్త్రీ యెవనిచే కొలవ బడుచున్నదో వానిజన్మము వ్యర్థము.

తా॥ మంచి రూపము ఆకారము యౌవనవంతురాలైన భార్య మేరువంతద్రవ్యము మనోహరమై అద్భుతమైన మాటలు వుండిన్ని భగవంతుని పాదమున మనస్సు అంటనియడల అవతలయేమి ప్రయోజనము.



కవిహృదయసర్వస్వమునందు - పూర్వభాగము,

సంపూర్ణము.

